53139



# దైవజ్ఞదృష్టి పథము

ఆథర్-&-పబ్లిషర్ :
శ్రీరామకవచం వేంకటేశ్వర సిద్ధాంతి
శ్రీలక్ష్మీభవాని జ్యోతిషాలయం
బాపట్ల-మాయాబజార్-522101.

# దైవజ్ఞ దృష్టిపథము

## (PRACTICAL ASTROLAZEE)




**శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో**

ఈ గ్రంథము ముద్రించబడినది.

శ్రీ స్వామివారికి - దేవస్థానమువారికి శతాధికవందనములు

*'This Book is Published with the Financial Assistance of Tirupati Devastanams Under their Scheme Aid Publish Religious Books'*



వాస్తు జ్యోతిషాలంకార, జ్యోతిఃకంఠీరవ,

దైవజ్ఞరత్న, ఆదిత్య (పద్మ) మణి

**శ్రీ శ్రీరామకవచం వేంకటేశ్వరశర్మ**

ఆథర్ & పబ్లిషర్

"దైవజ్ఞ దృష్టిపథము" All Rights Reserved by the Publisher

ప్రథమ ముద్రణ : 1960 కాపీలు 500

ద్వితీయ ముద్రణ : 1999 కాపీలు 800

**NB** - ఈ గ్రంథము ఇండియా గవర్నమెంటు కాపీరైటుల అక్టు ప్రకారం రిజిష్టరు చేయబడినది. ఈ గ్రంథములోని యే విషయమునుగానీ యే భాగమునుగానీ, యెవరూ ప్రచురించుకొనరాదు. యితర భాషలలోనికి అనువదించరాదు. అలా చేసినవారిపై సివిలు. క్రిమినలు చర్యలు తీసుకోబడును.

రచయిత - పబ్లిషరు

శ్రీరామకవచం వేంకటేశ్వరశర్మ

(స్వస్థానం - చుండూరు పోష్టు, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా)

బాపట్ల టవును - 522101




ముద్రణ :

**R K** ప్రింటర్స్,

జి. బి. సి. రోడ్, బాపట్ల

పోస్టు ఖర్చులు సహా రూ. 62/-లు ముందుగా మనియార్డరు పంపవలెను.

గమనిక :- గ్రంథమును **V.P.**గా పంపము.

☎ 3734999

డా॥ సి. వి. బి. సుబ్రహ్మణ్యం

M.A. (Tel.) M.A. (Skt.), Ph.D.

Head - Dept. of Astrology, Telugu University

Public Gardens, Hyderabad - 500 004

శ్రీ శ్రీరామకవచం వేంకటేశ్వరశర్మగారు జ్యోతిష విజ్ఞాన శాస్త్ర మథనంలో షష్ఠిపూర్తి చేసుకున్న మనీషి.

వారి చేతులమీదుగా వారి మేధాశక్తికి నిదర్శనంగా "దైవజ్ఞ దృష్టిపథం" వెలువడింది. ఈ గ్రంథంలో దైవజ్ఞుల మనోభావాలు, మతాంతరాలు విపులంగా చర్చించబడినాయి. శాస్త్ర చర్చలతోబాటు విషయ నిర్ధారణ విపులీకరించబడింది.

ఈ జ్ఞాన వయోవృద్ధుల కృషి అందరికీ మార్గదర్శకమైనది. 77 సం॥ వయసులోగూడా నిరంతరకృషి చేస్తూ జ్యోతిషశాస్త్ర సేవ చేస్తున్నారంటే వారి పట్టుదలను అర్థం చేసుకోవచ్చును. వారి ఆసక్తిని మీలాంటివారంతా అనుసరించవలసిన అవసరం ఉంది.

మీ

డా॥ సి. వి. బి. సుబ్రహ్మణ్యం

Resi : 101, Swathi Kuteer,

Near Yusufguda Bus Stop, Hyd - 45

# విషయ సూచిక

# గురు పరంపరా వందనము

1. గురుదేవులు శ్రీ అవధూత శివస్వామివారు–(దత్తపీఠము)

2. దీవి సీతారామాచార్యులుగారు కొల్లూరు -
గౌతమస (తెనాలి తాలూకా)

3. శ్రీ బూరుగుల రామకోటయ్యగారు అమృతలూరు -
కౌండిన్యస (తెనాలి తాలూకా)

4. మహామహోపాధ్యాయ దర్శనాచార్య, బ్రహ్మశ్రీ
జమ్మలమడక మాధవరామశర్మగారు (తెనాలి తాలూకా)
కోరుతాడిపర్రు-అమృతలూరు మండలం కౌండిన్యస గోత్రం

జన్మజన్మాంతరాలలో, జ్ఞాన విజ్ఞాన ప్రదాతలయిన శ్రీ విద్యా గురుదేవుల అనుగ్రహాన్ని అర్థిస్తూ, శతకోటి చందనతాంబూల చామంతికా సుమాంజలులు సమర్పణము చేస్తున్నాను. అనుగృహ్ణాన్తు



గ్రంథకర్త దంపతులు

శ్రీ రామకవచం వెంకటేశ్వరశర్మ

,, శ్రీమతి జానికమ్మ

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ సరస్వత్యై నమః—శ్రీ మహాలక్ష్మ్యై నమః

# దైవజ్ఞ దృష్టిపథము

## (PRACTICAL ASTROLAZEE)

## శ్రీ రవి స్తుతిః

శ్లో॥ యస్యాకర్షణశక్తి నాంబరతలే నాలంబమార్గే సదా
నక్షత్రాణ్యఖిలాని ఖేచరగణా స్తిష్ఠన్తి గచ్ఛన్తిహి,
తస్యోత్కృష్టచరిత్ర మీషదపి నజ్ఞాతం మయాద్యోమణేః
తస్మాత్త్వం వసుమాలినం ప్రతిదినం వందేహ మిష్టాప్తయే.

## శ్రీ సరస్వతీ స్తుతిః

శ్లో॥ దేవీ సరస్వతీ సాక్షాద్బ్రహ్మపత్నీ సనాతనీ
జిహ్వాగ్రే వర్తతేనిత్యం సర్వవిద్యాప్రదాయినీ
విష్ణుపత్నీ మహాలక్ష్మీ వర్తతే నాహతే సదా
రుద్రపత్నీతు రుద్రాణీ పార్వతీ సహవర్తతే

శ్లో॥ ఏషా సరస్వతీదేవీ సర్వభూత గుహాశ్రయా,
సవాక్సిద్ధి మవాప్నోతి సరస్వత్యాః ప్రసాదతః

## దైవజ్ఞ లక్షణం

శ్లో॥ సత్య శౌచ దయాయుక్తో దేవతోపాసక స్తథా,
ఆశ్యాశా వర్జిత స్తస్య వాక్సిద్ధి ర్భవతి ధ్రువం.

# జ్యోతిశ్శాస్త్రము వేదపరము

'వేదాస్తావద్యజ్ఞకర్మ ప్రవృత్తాః। యజ్ఞాఃప్రోక్తాస్తేతు కాలా శ్రయేణ। శాస్త్రాదస్మాత్కాలబోధాయ తస్మా ద్వేదాంగత్వం జ్యోతిష స్యోక్తమస్మాత్॥ అని ప్రమాణము. మరియూ శ్లో॥ యథా శిఖా మయూరాణాం నాగానాం మణయో యథా। తద్వద్వేదాంగ శాస్త్రాణాం జ్యోతిషం మూర్ధని స్థితం' అనియూ కలదు. నృత్యకియైన నెమలి శిరస్సునందలి శిఖలు అలంకారప్రాయములుగ వుండి, దాని శరీర సౌందర్య, నృత్య, హావభావాదుల ప్రకటింపజేయుచూ అలంకారము లుగ నుండును. శిఖాహీనమైన నెమలి యెంతటి సుందరముగ నుండునదీ భావస్ఫురణకే అర్థమగుచుండును. ఇట్టి మయూరపింఛము నందలి వ్యామోహముచేతనే శ్రీకృష్ణపరమాత్మగూడ తన శిఖయం దలంకరింపచేసుకొనినాడు నాగరాజు శిరస్సునందలి నాగమణి ప్రకాశించుటయేగాక, నాగరాజుకు మార్గదర్శకమయినట్లు, తదితరు లకూ మక్కువ కలిగించి ఉపయోగవంతమై భాసించునట్లు, జ్యోతి శ్శాస్త్రము వేదాంగములయిన శ్రౌతక్రియలనన్నిటినీ తాను ప్రకాశింప చేయుచు వేదశిరస్సున సుప్రతిష్ఠతమై అలరారుచు లోకకళ్యాణకర ముగ యున్నదని వేద, శాస్త్రాది విషయప్రస్తుతులవల్ల తెలియు చున్నది. కనుక జ్యోతిషము వేదాంగము అనునది వేదశాస్త్రాధ్యయన పరులకూ తదభిమానులకూ సమ్మతమనేది నిర్వివాదాంశము వేద చోదితములయిన సకల కర్మకాండలకూ జ్యోతిషము కాలనిర్ణయ ప్రబోధకముగాన వేదాంగము అని నిర్ణయం. ఇట్టి జ్యోతిషము జ్యోతిర్వేదమని పిలువబడుచున్నది. ఇట్లే వేదాంగశాస్త్రములైన ధను ర్విద్య (విలువిద్య) ధనుర్వేదమనియు ఆయుర్విద్యయైన వైద్యము

ఆయుర్వేదముగను వ్యవహరింపబడి యున్నవి. ఈ విధముగా జ్యోతిషము సకలశాస్త్రములకన్న మిన్నయై వేదశిరస్సున ప్రకాశించు చున్నది. "అధాది జ్యోతిషం" అనియు "జ్యోతిషం చక్షుషీచ" అని వేదమునను, శాస్త్ర గంథములందు ప్రముఖముగా పేర్కొనబడినది గాన జ్యోతిశ్శాస్త్రము వేదపరమయినదని నిశ్చయార్థము.

## జ్యోతిశ్శాస్త్ర ప్రయోజనం?

శ్లో॥ సిద్ధాన్తసంహితాహోరా రూపస్కన్ధత్రయాత్మకం।
వేదస్య నిర్మలం చక్షుర్జ్యోతిశ్శాస్త్ర మకల్మషమ్।
వినైతదఖిలంశ్రౌతం స్మార్తం కర్మ న సిద్ధ్యతి।
తస్మాజ్జగద్ధితాయేదం బ్రహ్మణా నిర్మితం పురా॥

అని ప్రమాణము. స్కన్ధత్రయాత్మకము, అకల్మషమునైన జ్యోతిషము వేదమునకు నిర్మలమైన జ్ఞానచక్షువని ప్రమాణము. ఇది లేనిదే జగము నందు శ్రౌత స్మార్తాది సకల కర్మలూ లేవుకూడను అందుచే ఆది యందే సృష్టికర్త లోకహితార్థమై ఈ శాస్త్రమును వేదశిరస్సున స్థిరీక రించెను. మానవునకు విజ్ఞానదృష్టి, యోగులకు యోగదృష్టి, భగవంతు నకు దివ్యదృష్టి అత్యవసరములు దివ్యదృష్టికాధారమయిన జ్యోతి శ్చక్రములేక కాలచక్రము నడువలేదు. కాలచక్రాధారముగ నడుపు టకు భగవానునకూ ఒక దివ్యదృష్టి అవసరమగుటచే జ్యోతిర్దృష్టిగల దీనిని వేదశిరస్సున వుంచి యుండెను. "శ్లో॥ ప్రయోజనంతు జగతః శుభాశుభ నిరూపణం" అని నారదవాక్యము కలదు. లోకస్థులకు శుభాశుభ కాలనిర్ణయములు తెలుపుటయే జ్యోతిశ్శాస్త్ర ప్రయోజనము. ఇట్టి శుభకాలమనునది తిథ్యాదిసాధనముచే కలిగే సంక్రాంతులు,

గ్రహణములూ, యజ్ఞయాగాది కార్యములకూ, వేదాధ్యయనమూ, వ్రతములూ, ఉపనయన, వివాహాది షోడశకర్మకాండలూ, వాస్తు శాస్త్రాది గృహసంబంధమైన సర్వమంగళ కార్యములకూ మూల కారణము. మరియూ "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అనియూ, "లోచనాభ్యాం విహీనస్య దర్పణం కిం కరిష్యతి" అను ప్రమాణవాక్యములవలెనే, జ్యోతిషము వేదనేత్రమని కలదు. శ్లో॥ వేదస్య చక్షుః కిలశాస్త్రమేతత్। ప్రధాన తాంగేషు తతోర్థ్యజాతా। అంగైర్యుతోన్యైః పరిపూర్ణమూర్తి శ్చక్షుర్విహీనః పురుషోన కించిత్॥ అని కలదు. శేషాంగములెన్నియున్ననూ నేత్రహీనుడెట్లు వ్యర్థుడగు చున్నాడో—అదేవిధముగ వేదనేత్రమయిన జ్యోతిషములేకున్న, వేదముతోపాటు వేదక్రియలూ అంధత్వము తప్పక పొందగలవు. ఇటీవల కొందరు ఆధునిక విజ్ఞానులయినవారు— అవి దేవతాగ్రహ ములుగావు, వట్టిగోళములు మేము చంద్రుని వెనుకభాగమునుకూడ ఫొటోలు తీసియున్నాము జ్యోతిషం అసత్యము—సత్యమైనచో. శాస్త్రజ్ఞులు ఉన్నపాటున కాళిదాసాదులవలె సత్యముతో కూడిన నిదర్శనములు చూపుదురా? అని సవాలు చేయుచూ, వశిష్ఠుడు రామునికి పెట్టిన ముహూర్తమేమయినది? అంత తెలివితక్కువగా యెందుకు పెట్టినాడు? గ్రహణములూ, దానములూ, స్నానములూ మానవుని అపరిణతాస్థితి నాటి మూఢనమ్మకలు వాటిని శాస్త్రాధార ముగ చేసినారు శాస్త్రజ్ఞులు. అని బహువిధములుగ విమర్శించు చున్నారు. ఆ కాలమున ప్రశ్నించిన—వారు ఏ సమాధానము చెప్పెడి వారో, ఏ నిదర్శనము చెప్పువారో—ఇట్టి ప్రశ్నలు వేయువారికిగానీ ఈ శాస్త్రాభిమానులమయిన మనకూ అనూహ్యమైనవిషయం కానీ ఇట్టి ప్రశ్నలు వేయువారూ ఇట్టి పూర్వీక శాస్త్రాధారులయిన మన ముభయులమూ కలికాలములో వున్నామనునది నిజము.

ఇందువిషయమై బాగా నాలోచించగా యిట్టి ప్రశ్నలు వేయువారు ఒకవిధముగా హిందూదేశ సంస్కృతినే నిరశిస్తున్నారని తోచును హిందూజాతికాధారమైన రామాయణ, భారత, భాగవతాది ప్రధాన గ్రంధత్రయము బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులవలె నేటికీ ప్రతి మనుజునకు స్మరణీయులు. ఇందు మొదటిదైన రామాయణమునందు శ్రీరాముడు రావణసంహారమునకుగాను అగస్త్యునివలన ఆదిత్యోపాసనాదులు పొంది రావణసంహారము చేసినట్లు గలదు. (ఇది సూర్యగ్రహ విషయము) ఇక రెండవదైన భారతమున నలమహారాజుచే స్తుతించబడిన శనిస్తోత్రము కలదు (ఇది శనిగ్రహ విషయం) ఇక మూడవ విషయము భాగవతమున ధృవోపాఖ్యానమున ధృవునకీయబడిన ధృవమండలం (ఇది మండల విషయము) ప్రధానములుగనున్నవి. దానిని నేటికీ ఖగోళశాస్త్రజ్ఞులు ధృవరేఖయని వాడుచున్నారు మరియు క్షీరసాగర మదనమందు రాహు గహ విషయము కలదు. ఇట్టి మహనీయులే గ్రహారాధనలుగాక గ్రహములనే దైవములుగ కూడ నమ్మినారు. ఈనాటివారు అవి గ్రహములు కావనుచున్నారనగా అవి గ్రహములు కాదన్నవిషయము భారత, భాగవత, రామాయణములే అసత్యములను వరకు వచ్చుచున్నది. గ్రహసిద్ధాంతమునే తిరస్కరించినచో హిందూ సంస్కృతినే తిరస్కరించిరని యీవిధముగ ద్యోతకమగుచున్నది. యదార్ధము కూడను కలిప్రభావముచే దైవజ్ఞులు నిదర్శనము చూపలేకపోవచ్చును అంతమాత్రమున శాస్త్రమును, దైవజ్ఞులను దూయబట్టుట వారికి శ్రేయోదాయకముగా నేరదు. ఇష్టమైన ఈ శాస్త్రాధ్యయము చేయవచ్చును, ఇష్టములేకున్న మనకెందుకని విరమించవచ్చును. లోకమున కొందరి ద్వేషమునకు మనము గురికానవసరము లేదు. నిండుచూలాలు ప్రసవవేదన చూడలేక

ఆస్పత్రికి తీసుకువెళ్ళుతాము అతను శస్త్రచికిత్సచేసి శిశువును వెలికి తీసినా శిశువు, తల్లి గతించుట కలదు. అంతమాత్రమున నీదేమి వైద్యమయ్యా? పనికిమాలిన వైద్యుడవు. నీ వైద్యమే అబద్ధము. అని అనుట వివేకమేనా? వ్యవసాయ సైన్సువారు ఇట్టియెరువు, ఇట్టి పోషణ, ఇట్టివిధులు చేసిన ఇంత పంట పండునని చెప్పుదురు. వ్యవసాయకులు అటు చేయుదురు. కాని, మధ్యలో వర్షభంగమో, తెగులో తగిలి వారి అంచనా భంగమగును అపుడు వీరు యెవరి నాక్షేపించవలయును? కనుక శాస్త్రము శాస్త్రమే ఇట్లే జ్యోతిష్కుడు కొన్ని గ్రహించి చెప్పలేకపోవచ్చును. అంతమాత్రమున శాస్త్రము గాకపోదు. "చికిత్స తజ్యోతిష మంత్రవాదాః పదేపదే ప్రత్యయ మావహంతి" (ప్రత్యయ మనగా విశ్వాసము) అని శాస్త్రము కలదు. వైదులు, జ్యోతిష్కులు, మంత్రానుష్ఠానపరులు (ఆవేశ గ్రహపీడా పరిహారకులు) ప్రజాభిమానపరులు అగుచున్నారు.

జ్యోతిష్కుడు కొన్ని విషయములందు యెటుల తప్పిపోవు చున్నాడో అదేవిధముగ వైద్యుడూ (డాక్టరు) కొన్ని కేసులందు విఫలుడు అగుటయేగాక నిందాపాత్రుడూ అగుట కలదు. కొందరు మావాడిని అన్యాయముగా డాక్టరు పొట్టపెట్టుకున్నాడు—అని ప్రచారం చేసెదరు. ఇట్లే భూతగ్రహ చికిత్సకులూ భూతోచ్చాటన చేయలేక, ఆ భూతమునకే దండముపెట్టి పోయేవారూ కలరు. ఇట్లే మేము సైన్సుపరిశోధకులమూ, విశ్వవిజయమే మా చేతులలో వున్నదను కుంటున్నవారుకూడ కొన్నిటియందు సఫలతయూ, మరికొన్నిటి యందు విఘాతములు పొందుచూ నేటికీ తహతహలాడుచున్నారు. నవగ్రహసిద్ధాంతమే అక్కరలేదనుటయేగాక, అవి మానవుని అజ్ఞాన

దశనాటి విషయములని చెప్పినపుడు, గ్రహసిద్ధాంతమును గొప్పగా చాటుచున్న రామాయణ, భారత, భాగవతములే అసత్యప్రచారము లగుచున్నవి. వీరి వాదనలవల్ల — రామాయణము రచించిన వాల్మీకియూ, భారత, భాగవత రచయిత అయినవాడూ, నారయణా వతారుడయిన వ్యాసభగవానులూ ఇట్టివారి వాదనలచే పరోక్షముగా దూషింపబడుచున్నారు. మహాపురుషులగు కవిత్రయమైన నన్నయ, యఱ్ఱాప్రగడ, తిక్కనాదులు రచించిన భారతమూ, మహాకవి భక్త పోతనాదులు రచించిన భాగవతాదులు, వీరి సాహిత్యసేవలూ, విజ్ఞానమూ ఇట్టివ్రాతలు వ్రాయువారి విజ్ఞానముకన్న అల్పములు అని పరోక్షనిర్ణయములు అగుచున్నవి. వైద్యుడు రోగికి ఆయుర్దాయ మనేది వున్నపుడే వ్యాధి విముక్తునిచేసి సాక్షీభూతుడగుచూ, స్తుతించ బడుచున్నాడు అదేవిధముగా జాతకునియొక్క శుద్ధమయిన జాతక వివరములూ దైవజ్ఞునియందలి మంచి పాండిత్యమూ, ఫలనిర్వచన శక్తి, దైవోపాసన బలము, సత్యదయా శౌచబలములు అన్నీ సమ కూడినపుడు, అతని భవిష్యద్వాణి పొల్లుపోనేరదు. అన్నియూ సక్ర మముగా వున్నపుడే దైవజ్ఞుడు ప్రకాశించును. సాక్షీభూతుడగును కనుక నేవో కొన్ని భావములు పెట్టుకొని-శాస్త్రమును దూషించుట, నేటి మానవుని పరిణతావిజ్ఞాన లక్షణముగాదు ఇటీవల 1960 మే, జూన్ నెలల ఆంధ్ర సచిత్ర వారపత్రికలందు శ్రీచంద్ర, నక్షత్రకుడు అనువారలు ఈ శాస్త్రముపయి చేసిన విమర్శనలు శాస్త్రజ్ఞులకు యెంతయినా కనువిప్పు కాగలవు. శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారు కొంత సమాధానము పత్రికాముఖమున జెప్పియుండిరి నేడు మన ఆంధ్రప్రదేశమందలి ప్రముఖ జ్యోతిష్కులు సిద్ధాంతులు, విమర్శ కులూ, పౌరాణిక ప్రసిద్ధులూ, వైదిక విజ్ఞాన ఘనులెవరుగాని తృప్తి కరముగా సమాధానమిచ్చినది లేదు.

ఈ శాస్త్రమున స్వల్పకృషిచేసి నేను పంపిన సమాధాన పత్ర ములు వారు అచ్చువేయకపోవుటయు నాకు విచారము కలిగించినది. ఇందులో వ్రాసిన విషయములుగాక మరికొన్ని విషయములనే వ్రాసి యున్నాను. వారికి నా సమాధానపత్రములు అందలేదేమోనని తలచి తిని. కొంతకాలము చూచి ఒక కార్డు వ్రాసియున్నాను. ఇంతలో ఈ చర్చను ముగింపు చేయుచున్నామని పత్రికా సంపాదకులే ఒక వ్యాసము వ్రాసి విరమింప చేసినారు. న్యాయమూర్తి సమక్షమున అన్యాయమైన వాదకునితో (ప్లీడరు) న్యాయమైన కోర్టు వ్యవహార ములే ఓడిపోవుచున్న ఈ రోజులలో న్యాయమైన ఈ శాస్త్రము ఇట్టి అన్యవాదకులతో (హిందూ సిద్ధాన్త వ్యతిరిక్తులు) ఆత్మవిశ్వాసాదులు లేక దూషించినంత మాత్రమున శాస్త్రము లేకపోలేదు ప్రజలు ఉప యోగించుకొనకపోరు. హిందూ సిద్ధాన్తమునకు మూలమైన భగవద్గీత వివేకానంద, రామకృష్ణ పరమహంసలవల్ల భారతదేశముననేగాక అమెరికాలాంటి పశ్చిమ దేశములందు అఖండకీర్తి గడించి హిందూ సంస్కృతిని ఇనుమడింపచేసినది ఇట్టి భగవద్గీతయందుకూడ "ఆది త్యానా మహం విష్ణుర్జ్యోతిషాం విధి రంశుమాన్" అని కలదు సూర్యచంద్రాదులనే గ్రహములుకూడ నేనే (భగవానుడు) అని తెలుపుచున్నది కనుక రామాయణాదులతోపాటు భగవద్గీతలోకూడ సూర్యచంద్ర గ్రహస్థితి సువిదితము. జ్యోతిశ్శాస్త్రము వ్యర్థమనగా ఈ భగవద్గీతనుకూడ బాహాటముగ దూషించుటయే కాగలదు మన ఇండియా వైస్‌ప్రసిడెంటు శ్రీ రాధాకృష్ణ (సర్వేపల్లి) కూడ భగవద్గీత ఇంగ్లీషులో రచించి స్వదేశమునకన్న పరదేశమందధికఖ్యాతి గడించి నారు గ్రహసిద్ధాన్తము తప్పు అనువారు వీరందరికన్న అధికులమని భావించుదురేమో. ఇందుకు లోకముకూడ సాక్షిభూతమనియు, పై

గ్రంధములు హిందూజాతికే ప్రధానమనియు విస్మరించకుందురుగాక. గ్రహసిద్ధాన్తముతో కూడిన జ్యోతిషము లోకమునకు యెంతో మంగళ ప్రదము. ఈ జ్యోతిశాస్త్రమే లేనినాడు భగవత్కళ్యాణములు, మానవ కళ్యాణములు, తదితర మంగళ కార్యములకు సంబంధించిన సుముహూర్త విచారణలు లేకపోయినపుడు మనదేశము యెంత మంగళ ప్రదముగా వుండునదీ, మంగళవాద్యములు యే మూల వుండునదీ, ఆ జీవనవృత్తులవారు యెట్లుండునదీ మనస్సంటూ వుండి బాగా నాలోచించిన అర్థముకాగలదు. కనుక నవగ్రహ సిద్ధాన్త ఆధారమయిన జ్యోతిశ్శాస్త్రము ప్రజలకెంత అవసరమయినదీ ఈ విధముగా బోధపడుచున్నది. అసత్యపు ప్రచారములు నమ్మవద్దు.

## జ్యోతిశ్శాస్త్రి శాపాదులు - జ్యోతిశ్శక్తి

మానవునకు విజ్ఞానదృష్టియూ, యోగులకు యోగదృష్టియూ అవసరమైనటుల, దివ్యపురుషుడయిన సర్వేశ్వరునకూ దివ్యదృష్టి అతిప్రధానము కాగలదు. ఇట్టి దివ్యదృష్టి శక్తిసంపన్నమైనదే కాలచక్రమనియూ, జ్యోతిశ్చక్రమనియూ పిలువబడుచున్నది. నవగ్రహములూ జ్యోతిశ్చక్రమందే యుండి, జ్యోతిర్దృష్టిగలవి కనుకనూ, ఈ శాస్త్రమునకు ఈ గ్రహములు ప్రధానము గనుక "జ్యోతిషం చక్షుషీచ" అని ప్రసిద్ధముగ భావించెదరు లోకమున కొందరు అనేక కట్టుకధలూ, అభాండములూ ఈ శాస్త్రముపైనవేసి, ఈ శాస్త్రఫలితములు జరిగిన జరుగును-లేకపోతిలేదు. అసలు పార్వతీశాపమే ఈ శాస్త్రమునకు కలదు అనెదరు. పార్వతి వివస్త్రయై స్నానము చేయుచుండ, ఎవరెవరో పందెములు వేసికొని చెప్పి పరీక్షించినటులుగనూ, అందుమీద ఆమె అలిగి శపించినటుల వినికిడి. పౌరాణిక గ్రంధ

ములందు నాకు ఈకథ యెచటనూ కానరాలేదు తెలిపిన, సహృదయ ముతో స్వీకరించి—ఈ అభిప్రాయమును మార్చుకొనెదను. కట్టుకథలు ప్రమాణములు గానేరవు ఇట్టి శాస్త్రమును పార్వతియే, ఈశ్వరుని వల్ల తెలుసుకున్నటుల సంతానదీపికాది గ్రంధములవల్ల తెలియు చున్నది. ఈ గ్రంధమంతయూ పార్వతీపరమేశ్వర సంవాదరూపము ననేయున్నది. ఈ శాస్త్రము బ్రహ్మలోకమునుండి వశిష్ఠాదులవల్ల భూతలమునకు రాబడినది. శ్లో॥ దివ్యం జ్ఞానమతీంద్రియం యదృషి భిర్బ్రాహ్మ్యం వశిష్ఠాదిభిః। పారంపర్య వశాద్రహస్య మవనీం నీతం ప్రకాశ్యం తతః॥ నైతద్వేష్టి కృతఘ్న దుర్జన దురాచారా చినావాసి నాం। స్యాదాయుః సుకృత క్షయో మునిక్ర్తతాం సీమా మిమాముఝితః॥ అని ప్రమాణము. ఈ వశిష్ఠుడు—కృతయుగమున సత్యహరిశ్చంద్రా దులకును 28 త్రేతాయుగమున శ్రీరామచంద్రాదులకునూ కుల గురువుగ యున్నటు శాస్త్రాధారములు గలవు ఇట్టి శాస్త్రమును దూషకులకు కృతఘ్నులకూ, దుర్జనులకూ దురాచారులకూ చెప్ప రాదు చిరంజీవులయిననూ—సత్పురుషులయిననూ ఇట్టి శాస్త్రమును దుర్వినియోగము చేసినచో అయుక్షీణులు కాగలరు. వారి పుణ్య విశేషములూ అంతరించును. శ్లో॥ నైతద్దేయం దుర్వినీతాయ జ్ఞానం గుప్తం తద్ధిసమ్యక్ఫలాయ। అస్థానేహి స్థాప్యమానైవ వాచాం దేవీ కోపా న్నిర్దహేన్నో ఽచిరాయ॥ అని కలదు పరిశుద్ధస్థానమందుండ దగిన సరస్వతి దుస్థానమున వున్ననూ దుష్టులవద్ద వుండిననూ తాను అగ్రహించి వారిని దహించి నిస్తేజస్కులను చేసివేయును. శ్లో॥ అన్యాని శాస్త్రాణి వినోదమాత్రం। న కించిదేషాం భువిదృష్ట మస్తి। చికిత్సితజ్యోతిషమంత్రవాదాః। పదేపదే ప్రత్యయమావహంతి॥ ఈ విధముగా వైద్య, జ్యోతిష మంత్రశాస్త్రములు లోకకళ్యాణ కరములు అనేది నిశ్చయము.

# కృతయుగాది జనన భేదములు

దక్ష స్మృతిః. శ్లో॥ కృతేత్వాధానలగ్నశ్చ త్రేతాయాం జలోద్భవః శీర్షోదయో ద్వాపరేతు కలౌ భూపతనం స్మృతం॥ అనుటవల్ల కృతయుగమున ఆధానలగ్నబలమే జన్మకాల ఫలప్రదమని భాగవతమున హిరాణ్యాక్ష హిరణ్యకశ్యపాదుల జనన వివరములు తెలుపుచున్నవి. సాయంసంధ్యలో సంభోగమును ధర్మపత్ని కోరినందున ఇట్టివారు జననమొందుదురని ముందుగనే తెలిపియుండెను. ఈ కాలమున సులగ్నమున సంభోగానంతరం నవఘడియలకే శిశుజననము కలిగెడిది. ఇక త్రేతాయుగమున జలోద్భవము అయినారు. అనగా నీటియందు పుట్టుట అనియర్థము. ఇది కొందరకు విచిత్రముగ తోచును. కాని యిదికూడ నిజమే. అగస్త్యుడు, ద్రోణుడు జలాధారమైన కుంభ (కడవ) సంభవులేను. ఇక గాంధారి ప్రసవవేదనకాలమునకు ముందుగనే ధర్మరాజ జననమును సహించలేక గర్భతాడనము చేసినందున గర్భపిండము నూరుశకలములయి ఘటాదులందుంచబడి అవి సౌరవరుణ మంత్రాదులవల్లను ఆ కాలమున వారి తపశ్శక్తి ప్రభావాదులవల్ల వీరు జనన మొందిరి. మఱి వీరూ కుంభ సంభవులే. అనగా మృతపిండము, లేక మృతశిశువు కలిగెడివి. ఇట్టి జలాధార ప్రక్రియలు చేయగా దానికి యెపుడు రోదనశక్తి గలిగిన అపుడు లగ్నమును నిర్ణయించెడివారు ఇచట మీకు కొందరు త్రేతాయుగము వారు కొందరు, ద్వాపరయుగాంత్యము వారు అనుసందేహము రావచ్చును. బలవత్ప్రినూతి కారణములచే వారు వారి పూర్వీకుల సాంప్రదాయములు అనుకరించినారు. అమరకోశమునందలి వ్యోమవర్గులోని ఈ శ్లోకము "ధృవ ఔత్తానపాదిస్యాదగస్త్య కుంభసంభవః" అనునది జలాధారమైన ఘటజననముల నిరూపించుచున్నది. సగర

చ[క్రవర్తిభార్య వైదర్భి ఈశ్వర[ప్రసాదమున సొరకాయ [ప్రసవించెను అందలి విత్తనములను నేతికుండలయందుంచి కొంతకాలము పోషణ చేయగా అరువదివేలమంది సగరుకుమారులు కలిగిరి. ఈ విధముగా ఘటజన్మములు సత్యమేనని శాస్త్రాధారములు. అనగా వీర్య[ప్రభావ మునుబట్టి తత్కాలోచిత జన్మస్థానములు మారుచుండును. ఇట్టివారు మరెందరో కలరు. ఇక ద్వాపరయుగము నాటికి పై జననములు తొలగి నవమాసగర్భము, సజీవశిశువులు కలుగసాగిరి. ఈ కాలమున శీర్షోదయమే జన్మలగ్నముగ నిర్ణయించిరి. అభిమన్యుని మరణానంతరము ఉత్తరాగర్భమందలి పరీక్షిత్తును, అశ్వత్థామ [బహ్మాస్త్రమునకు గురికాకుండ సుదర్శనముచే శ్రీకృష్ణపరమాత్మ కాపాడినట్లు కలదుగాన, నవమాసగర్భధారణ ఈ యుగమునుండి మారినట్లు శాస్త్ర[ప్రమాణము కలదు ఇక కలియుగమున భూపతనకాల లగ్నమే జన్మలగ్నముగ నిర్ణయించిరి ఇట్టి ధర్మమును తెలుసుకొనకుండా కొందరు మావాడికి నేను దగ్గరయుండి శీర్షోదయకాలమును [వాశాననుట వారి తెలియనితనమే. వెనుకటి యుగధర్మముగాదు. మనకు యీ యుగధర్మమే అవసరముగ గుర్తించవలయును. లోకమున సత్యముయొక్క [ప్రభావము యుగయుగానుసరణముగ యెట్లు తగ్గిపోవుచున్నదో అటులనే మానవశక్తి [ప్రభావములు, భేదములు మార్పు చెందుచుండును కొందరు శిశువులు యోనియందు కొన్ని గంటలు, రెండు మూడు రోజులుండువారు క రు. మరికొందరు బలవంతమైన ఉదర సంబంధ శస్త్రచికిత్సా విధానములతో అయోని జులుగ కలుగుచున్నారు. ఈ కాలములో ఎన్ని నా లగ్నములు మారిపోవుచున్నవి. కనుక కలియుగమునకు భూపతన విధానమే స[క్రమముగ గుర్తించవలెను.

# యుగాదిగా ప్రాణవశక్తి

హారీతస్మృతిః :

శ్లో॥ కృత త్రేతా ద్వాపరేషు। అస్థిగా ప్రాణసంతతిః। అమితా యుర్భవేత్తేషా। మన్నమాశ్రయతే కలౌ। అనుటచేత కృత, త్రేత, ద్వాపర యుగములవారికి అమితాయుర్దాయము కలిగి, శరీరమందలి యెముకలు చూర్ణమయి నశించిపోవువరకూ జీవించెడివారు చర్మ శక్తి త్వరగా నశించునుగాని యెముకలు త్వరగా నశించేవిగావు. యీనాటికీ మన శాస్త్రజ్ఞులు పరిశోధనలద్వారా కొన్నివందల యేండ్ల నాటి అస్థిపంజరములని నిర్ణయించుచున్నారుకూడను. పాపము ఆ వ్యక్తి శరీరమంతరించినా ప్రాణమంతరించినా, ఈ అస్థిపంజరము మాత్రము అతనిని లేక ఆ జంతువును జ్ఞాపకము చేయుచున్నది. ఆ జీవి యెచట యెన్ని జన్మములెత్తెనో తెలియదుగానీ, పంజరమిచట కలదు. అస్థిపంజరమున కిట్టిశక్తి గలదు గనుకనే దశరథుడు-అరు వదివేల సంవత్సరములు పరిపాలించగలిగెను ఇట్టివారెందరో కలరు కూడను. ఈ మూడు యుగముల తదుపరి కలియుగమునకు వచ్చే సరికి ఆయుర్భావవిషయమున శక్తియంతయు ఒక్కమారు తగ్గిపోయి వందలూ, వేల సంవత్సరములకు బదులు ఒక్క నూరు వత్సరములే ఆయుర్దాయమునూ, అన్నగత ప్రాణశక్తిగలవారుగనూ అయినారు. ఈ విధముగ యుగానుసరణముగ ఆయుశ్శక్తీ, దేహశక్తులునూ తగ్గిపోవుచుండును. ఏదో శక్తులతో చిరంజీవులుగ ఈ యుగమున వుండుట అసంభవమైన విషయము కాగలదు కలియుగమని మరువ కుడు ఇది అసత్యయుగమని నమ్ముకోవలయును

# రాశిలగ్న - చంద్రలగ్న ప్రధానతలం

జన్మకాలమందలి రాశిచక్రము సకల ప్రాణుల, బహుపూర్వ జన్మ కర్మార్జిత పుణ్య—పాపఫల సంబంధమైన శుభాశుభ ఫల సూచకము రాశి కుండలీ ప్రభావము జాతకుని జననాది మరణాంత కాల మధ్యస్థమైన యోగాఽవయోగముల రెంటినీ అద్దమున దలి ప్రతిబింబమువలెనే వ్యక్తపరచును. జన్మకాల పత్రికయందు దైవజ్ఞులు

శ్లో॥ జననీ జన్మసౌఖ్యానాం వర్ధనీం కులసంపదాం
పదవీం పూర్వపుణ్యానాం లిఖ్యతే జన్మపత్రికా॥

అనియే వ్రాయుదురు. ప్రధమమున మాతృగర్భజనితుడగుటచేమాతృ సుఖప్రదాతయైనందుననూ, తదుపరి తండ్రియొక్క పితృ పితామహాది వర్గముల సముద్ధారకుడయి వంశోద్ధారకుడయి నందుననూ ఇట్టి పుత్రుని పూర్వపుణ్య, పాపవిశేషములెట్టివో అవి నిర్ణయించునదియే ఈ లగ్నపత్రిక యని పై శ్లోకార్థము. ఇట్టి లగ్నరాశి గ్రహవిశేష ములచే శరీరవర్ణాది సర్వతత్వములూ తెలియబడును.

— మంత్రేశ్వరఫలదీపికాయాం.

శ్లో॥ లగ్న నవాంశపతుల్యతనుస్యాత్।
వీర్యయుత గ్రహతుల్యతనుర్వా।
చంద్రసమేత నవాంశప వర్ణః। కాది విలగ్న విభక్తభగాత్రః॥

అని కలదు. జన్మరాశి—నవాంశరాసులూ, చంద్రస్థితరాశి—చంద్ర నవాంశరాసులయందలి (చంద్రస్ఫుటగ్రహభాగాలవల్ల వచ్చును). బలీయమైన లగ్నమువల్ల శరీరనిమ్నోన్నతములు, మరుగుజ్జతనమూ, రూపసౌందర్య విశేషములూ, సర్వభోగ—యోగములూ విచారణీ

యములు. ఏ లగ్నము బలీయము అనునది దైవజ్ఞమనోవిదితము. ద్వాదశభావములకు మూలమైనందున జన్మలగ్నమువిలువ అనిర్వచనీయము. ఇది లేనిచో శాస్త్రచర్చయునూలేదు భావవిచారణలునూ యుండవు జన్మలగ్నమందలి శుభయోగసూచిత గ్రహకాలమునందు ఉత్తమయోగజన్మలునూ, మిశ్రమ గ్రహకాలమందు మిశ్రమ జన్మలునూ, నీచగ్రహాది అశుభ గ్రహకాలములందు హీనజన్మలునూ కలుగుచుందురు. "ఏవంహి జన్మసమయే బహుపూర్వజన్మ కర్మార్జితం దురితమస్య వదంతి తజ్ఞాః" అని ప్రమాణము కలదు మరియూ, భారతమున అరణ్యపర్వమున పంచమాశ్వాసమున ఈ విధముగా కలదు.

చ॥ స్థిరమగు పుణ్యకర్మమున దేవభవంబగు బుణ్యపాప సం
కరమున మానుషత్వమగు గల్మషముల్ పశు కీట భావముం
బొరయగజేయు నిప్పగిది ఒట్టుచు జచ్చుచు మోహవార్ధిలో
దిరుగుచునుండుగాని యొకతీరము సేరడు జీవుడెన్నడున్.

అని కలదు. ఇట్టి పుణ్యపాపవిశేషములకు మూలమైనది యీ దేహము. ఈ దేహమునకు సంబంధించినదే జన్మలగ్నము. శ్లో॥ లగ్నం హోరాకల్య దేహోదయాఖ్యం రూపం శీర్షం వర్తమానంచ జన్మ" అని ప్రమాణము కలదు. లగ్నము శరీరసంబంధమైన వర్తమాన జీవిత సౌభాగ్య ఫలాదులన్నిటికీ మూలం. కొన్ని తావులందు ఇట్టి లగ్ననిర్ణయాదులందు కొందరు దైవజ్ఞులుకూడ నన్ను ఈ లగ్న మీ జాతకునిది అవునా కాదా యని యెట్లు నిర్ణయించుదురు? శిశువు పసివాడుగదా? రూపసౌందర్యాదులయినా ప్రస్తుతము పస్ఫుటములు గావుగదా? అని ప్రశ్నించినవారును కలరు ఇచట నా సమాధానము

వివరిస్తున్నాను ఏమనగా—రాశిశీల, గ్రహశీల, భావఫల ఫలాధ్యాయములు, నక్షత్రస్వభావ ఫలములూ మన పూర్వీకులు దైవజ్ఞునకు చాలా సహాయభూతములుగా వ్రాసియుండగా, వివేచించి గ్రహించలేని దైవజ్ఞుడు–దైవజ్ఞుడుగాడు. హంసగ్రోలే నీరక్షీరన్యాయముగా దైవజ్ఞుడు సత్యాన్వేషణమే చేయశక్తి కలిగియుండవలయును ఇది దైవోపలబ్ధము కూడను, లేక ఈ శిశువు యెదిగినపుడే నిర్ణయించవచ్చుననిన చో, అతని తల్లిదండ్రులుగానీ, ఈ దైవజ్ఞులుగానీ ఉండనూవచ్చును, లేకపోవచ్చునుకూడను. దాహము కలిగినపుడే మంచినీటికొఱకు భావి త్రవ్వకము ప్రారంభించినటుల కాగలదు. అటుల నిర్ణయించు శక్తిలేనపుడు దైవజ్ఞత్వశబ్దమూ (జ్యోతిష్కుడు) వ్యర్థమేనని నా తలంపు ఇందుకు ప్రమాణముగా ఈ శ్లోకము కలదు మంత్రేశ్వరఫలదీపికా నవమోzధ్యాయే— "శ్లో॥ రాశేస్స్వభావాశ్రయ రూపవర్ణాన్। జ్ఞాత్వాను రూపాణి ఫలానితస్య। యుక్త్యావదే దత్రఫలం విలగ్నే। యచ్చంద్రలగ్నే పితదేవ వాచ్యమ్॥ ఇచట యుక్త్యా అను శబ్ద పయోగము కలదు జాతకుని జనన ప్రదేశము. దేశభేదములు, భావ, కారక, భావేశాది వివరములు చక్కగ ఆలోచించి యుక్తముగా చెప్పమని ప్రమాణము. జన్మసమయము నిర్దిష్టముగా లేనిచో-ముందు వెనుక రాశిఫలాదులు, అతని వర్తమానఫల పరిస్థితితో సమన్వయపరచి చూడమని 'ఆయుర్దాయదీపిక' అను గ్రంథమున నాల్గవ పేజీలోనూ కలదు. ఇచట కొన్ని విషయములు గుర్తించగోరెదను. నీగ్రో వారు అందరూ నల్లగనే యుందురు. లండను, అమెరికాలందు అందరూ తెల్లవారుగనే యుందురు. అటులే భారతదేశమున కాశ్మీర వాసులు బంగారు చాయతోనే యుందురు. మనము జాతకమందలి ఏ శని, రాహువులో, గురు, శుక్రులో దృష్టిలో యుంచుకొని చెప్పినచో

ఇట్టి చోటుల తప్పిపోయెదము. కనుక దేశభేద వివరాదులెంతయో అవసరము. వీటికి యుక్తాయుక్త జ్ఞానమవసరము అని వెనుకటి శ్లోక మందలి "యుక్త్యా" అను శబ్దార్థము యెంతదూరమైనా స్ఫురించును. ఇటులనే, చంద్రలగ్నాధారముగనూ, రాశి, గ్రహ, భావ ఫలాదులు శాస్త్రనిర్ణయానుసారముగ చూచి ఫలనిర్ణయము చేయుమని శాస్త్రి దేశము రాశి లగ్నముచే చంద్రలగ్న, అంశలగ్న, భావలగ్న, ఇందులగ్న, ద్రేక్కాణ లగ్నాదులెన్నియో కలుగుచున్నవి, ఇక జైమినీ పద్ధతిలోకూడ అనేక లగ్నములు కలవు. వీటినన్నిటినీ సమన్వయపరచి చెప్పుట దుస్తరమైన విషయము కాగఆదుకూడను. ఇచట మరి యే లగ్నములు ప్రధానము? అను ప్రశ్నకూడ కలుగుచున్నది. ఇతర లగ్నములెన్నియున్ననూ రాశిలగ్నమే ప్రధానము అగును. ఇది లేనివానికి, ప్రశ్నకాల లగ్నమూ ఒకవిధముగా ప్రధానమే. శేషలగ్నము లన్నియూ స్థూలదృష్ట్యా మాత్రమే చూడవలసి యుంటుంది—మంత్రేశ్వరఫలదీపికా వింశోZధ్యాయే–

శ్లో॥ ప్రశ్నోదయగ్రహవశా దథవాస్యజన్మ।
రాశ్యాదినావదతు నాస్త్యనయోర్వి శేషమ్॥

అని కలదు. రాశిలగ్నమే ప్రధానమగును. జన్మలగ్నము లేనపుడు, ప్రశ్న లగ్నమూ దైవికమైనందున, రెండవపక్షమున ప్రధానము అగును.

## చంద్రలగ్న ప్రధానము (జన్మనక్షత్రరాశి)

ఇక చంద్రలగ్నము విచారింతము — రాశిలగ్న – చంద్ర లగ్నములకెంతయో అభేద్యమయిన సన్నిహితసంబంధములు మహ

నీయులచే కల్పించబడినవి ఫలసూచకములుగ యున్నవి వధూవర జాతక అష్టవిధయోని పొంతనములూ, వాటి గుణవిచారణకూ ఈ చంద్రలగ్నమే ప్రధానము, అనగా ఇవి తనుభావ (శరీర) గుణ విచారణలగును, ఇక వాస్తు గ్రంథములందూ, గృహకర్త నక్షత్రముతో గృహనక్షత్రము మేళవించి గుణవిచారణ చేయుమనీ (వధూవరులవలె) కలదు. దీనికి దేశవ్యాప్తిగా ప్రచారము యెందుకో లేదుకూడను. గుణములు ప్రధానమయిన అయాదులందు వాస్తు గణిత ప్రతిభంగము కలగును గుణవిచారణకు ప్రధానమైన ప్రమాణములిట్లు కలదుకూడను.

శ్లో॥ నాడీరజ్జుగణోవశ్యోదిన మాహేంద్రయోనయః।
వర్ణోస్త్రీ దీర్ఘగాశీశ రాశివేధా ఇతిక్రమాత్ ।
వర్గాస్యుర్ద్వాదశేవేతే దంపత్యోః పాణిపీడనే।
జన్మభాన్నామభాద్వాపి చింతనీయాః ప్రయత్నతః ॥

అని కలదు. ఇచట మరియొక ముఖ్యవిషయము కలదు. ఒకరికి జన్మనక్షత్రముండి, మరొకరికి లేనిచో యెట్లు చేయవలయును? అను ప్రశ్న కలదు· ఇందుకు ముహూర్తకాలామృతమందు తృతీయ బిందువులోని "జన్మర్క్షేణ వరస్య" అను శ్లోకము ఇట్లు తెలుపుచున్నది. వరుని జన్మనక్షత్రముతో స్త్రీ నామ నక్షత్రము చూడమనియూ– స్త్రీ జన్మనక్షత్రముతో వరుని నామ నక్షత్రము చూడరాదనియూ తెలుపుచున్నది. ఒకవిధముగా ఉభయులకూ జన్మనక్షత్రములచే గానీ, నామనక్షత్రములచేగాని చూడవచ్చును. తదితరవిధముల చూడరాదు. "జన్మనా జన్మకుర్వీత। నామ్నా నామైవకారయేత్" అని ఇతరత్రా కలదుకూడను ఇవన్నియూ జన్మనక్షత్రముతో గూడిన

చంద్రలగ్న విచారణలగును ఇతర లగ్నములన్నియూ యథోచిత ముగానే చూచి సరిపెట్టుకోవలయును. దైవజ్ఞుడు రాశిరీత్యా ఫల నిర్ణయము చేయునపుడు ముఖ్యముగా గోచారసంబంధమైన చంద్ర లగ్నముకూడ సమన్వయపరచిన తప్పక ఫలవంతములగును. లేని యెడల ఫలితములు చెప్పినకాలమునకు నెరవేరక దూరస్థఫలప్రదము లగుటకు కారణములగును మంత్రేశ్వరఫలదీపికా, షోడశోఽధ్యాయే భావసిద్ధికాలమాహ.

శ్లో॥ లగ్నేశయద్భావపయోస్తుయోగో। యదాతదా తత్ఫలసిద్ధికాలః।
భావేశవీర్యే శుభమన్యథాస్యాత్। లగ్నాచ్చ చంద్రాదపి
చింతనీయమ్ ॥

అని కలదు రాశిలగ్నమేగాక, చంద్రలగ్నముగూడ సమన్వయ పరచి చూచిన ఫలప్రదములగును. ఇట్టి రాశి చంద్రలగ్నముల సంబంధవిషయమై, మహాకవి కాళిదాసు రచించిన ఉత్తరకాలామృత మున ద్వితీయ బలసాధన ఖండమున నిట్లు వ్రాసియున్నాడు.

శ్లో॥ సర్వేద్వాదశరాశయ స్సముదితా – లగ్నాదిషట్కంతనో
ర్వామ్యాంగంచతనో స్త్రియ స్తవితరే షట్చోత్తరాంగం భవేత్
లగ్నం ప్రాణమయం శశిస్థభవనం దేహ। స్తయో స్తత్ఫలం।
భావాద్భావ పతేశ్చకారకవశా త్తత్తత్ఫలం యోజయేత్॥

అని కలదు. మరియూ కాళిదాస విరచితమైన, కాళిదాస కేరళి అను గ్రంథమునందు స్త్రీ జాతక ప్రకరణమున "సౌభాగ్యం సప్తమస్థానే, శరీరం లగ్న చంద్రయోః" అనియూ కలదు. వెనుకటి శ్లోకమందలి, మూడవ పాదమున "లగ్నం ప్రాణమయమ్" అనునది—లగ్నము

ప్రాణమనియూ, చంద్రలగ్నము దేహమనియూ నిర్ణయించుచున్నది. మహాకవి : "దేహో దేవాలయప్రోక్తో జీవోదేవో స్సనాతనః" అను పద్ధతివలె కొంచెము తేడాతో రాశి-చంద్రలగ్నములను, శరీరము-ప్రాణము అను భేదముగ నిరూపించినారు. దేహజీవులకెట్టి అన్యోన్యాశ్రయభావము కలదో అటులనే, రాశి, చంద్రలగ్నములకిట్టి అవినాభావసంబంధము కలదని తెలిపియున్నారు. దేహములేనిదే, జీవుడు లేడు జీవుడు లేనిదే. దేహమూ లేనట్లుగనే, చంద్ర నక్షత్రయుతమైన చంద్రలగ్నము లేనిదే రాశిలగ్నము లేదు. రాశిలగ్నము (జననము) లేనిదే, చంద్రలగ్నమూ పనిలేనిదని భావము. ఇట్టి విషయిమున-ఒకవిషయము జ్ఞాపకమునకు వచ్చుచున్నది. కొందరు వార్తాపత్రికలయందలి రాశిఫలితములు, రాశిలగ్న – చంద్రలగ్నములూలేక నామనక్షత్రములం* దేనివిబట్టి చూడవలయునని సందేహపడువారు నేటికీ కలరు. తికమకలు పడుతారుకూడను. ఇట్టి విషయమున జన్మనక్షత్రయుతమైన చంద్రలగ్నములేక, గోచార లగ్నమును దీనివల్లనే చూచుకొనుట ప్రధానవిషయం కాగలదు. మంత్రేశ్వరఫలదీపికా మద్వింశోఽధ్యాయే—

శ్లో॥ సర్వేషులగ్నేష్వపి సత్సుచంద్రలగ్నం।
ప్రధానం ఖలుగోచరేషు।
తస్మాత్తదృక్షాదపి వర్తమాన।
గ్రహేంద్రచారైః కథయేత్ఫలాని॥

అని కలదు. యెన్ని లగ్నములున్ననూ. చంద్రలగ్నమే గోచార విషయ ఫలవంతము అని ఈ శ్లోకము తెలుపుచున్నది. పత్రికల

యందు చంద్రలగ్నమే ప్రధానముగ చూడవలెను. ఇక రాశిలగ్నము జీవితాంత ఫలసూచకము అని గ్రహింపవలెను చంద్రలగ్నము తాత్కాలికముగ గుర్తింపవలెను

శ్లో॥ యథాప్రకాశయేద్దీపః సమీపస్థఘటాదికం।
తథాప్రకాశయే ల్లగ్నాద్దైవజ్ఞో భావికంఫలం ॥

అని యుండుటచేతను, గృహమందలి దీపము ఘటాదులను ప్రకాశింపచేయుచూ, అంధకారమున మార్గదర్శకమై రక్షించునటుల, దైవజ్ఞుడనే దీపము పృచ్ఛకుని అరిష్టాది హీనకారణములచే ఆత్మహత్యాదికములనుండి రక్షించి, భవిష్యద్దివసములనే ఆశాజ్యోతిని వారి హృదయమున వెలిగించి, దారిచూపును భవిష్యత్ఫలములను ఈ రాశి-చంద్రలగ్నములవల్లనే తాను తెలుసుకొని వారికి తెలుపుతూ వచ్చు ఆర్తులకూ విజ్ఞులకూ తెలిపి జీవుల జీవితరక్షకుడుగూడ అగుచున్నాడు జాతకునకూ, జన్మలగ్నమునకూ, జ్యోతిష్కునకు పరస్పర సన్నిహితము కలదు. ఇట్టి జన్మలగ్నరహితుడు చీకటిరాత్రులందు దుర్గమారణ్యముల సంచరించినటుల కాగలదు ఇది తెలియక కొందరు, మా జాతకఫలములు మాకు కన్పడుచునే యున్నవీ, జాతకము లేనిచో మాకు జరుగవిదిలేదు. ప్రపంచమునకూడ జ్యోతిషము లేనిదే లోకపోకడలు నిలిచిపోవనికూడ ననెదరు. నిజముగా వీరు ఒకరకమయిన మనుష్యులుకూడను వీరికి మనము బోధించుట చాలా కష్టముకూడను ఈ విధముగా జన్మలగ్నము యెంతయైనా విలువగలదియూ, సాటిలేనిదియూ అగుచున్నది. జాతకుని సర్వశ్రేయస్సులకూ మూలము. ఒకవిధముగా రాశిచక్రము

సూక్ష్మశరీరలక్షణములు గలదిగనూ, ఇంద్రలగ్నము స్థూలకారణ శరీరలక్షణములు గలవిగనూ చూచుకొనవచ్చునని ఊహామాత్ర ముగా నాకు తోచుచున్నది.

## అంశాలగ్న విచారణ

ప్రతివారూ జన్మలగ్న పత్రికయందు రాశిచక్రము ప్రక్కనే, విధిగా అంశాచక్రము వ్రాయుట సాంప్రదాయ సిద్ధముకూడను. వివాహకాలములందు పెండ్లికుమారుని వేడుక సమయములందు ప్రక్కన కూర్చుండబెట్టు తోడుపెండ్లికుమారునివలెనే చిన్నచూపుతోనే చేర్చెదరు. ప్రక్కన యెందుకు చేర్చుచున్నాము, అని ఆలోచించు వారు చాలా తక్కువమంది యుందురు. రాశిచక్రముపై దృష్టిని కేంద్రీకరించినంతగా—నిజముగా దీనిని చూడరు. చాలా చిన్నచూపు చూచువారూ కలరు ఇది ఒక అలసతాభావమేకూడను. రాశి-చంద్ర లగ్నములతో సమానత్వము దీనికి గలదు. రాశిచక్రమున గ్రహములు సామాన్యములుగాగానీ, స్వక్షేత్రస్థితిగానీ, నీచస్థితులుగాని పొంది, సామాన్యఫలప్రదములుగా కన్పడుచూ, అంశయందలి ఉచ్చస్థితీ, వర్గోత్తమాంశస్థితీ, వర్గోత్తమ లగ్నములు మొదలయిన శుభయోగము లచే మహోన్నతయోగములు పొందిన జాతకములు గలవు. రాశి యందు అతిశుభస్థితి యోగాదులుండి అంశయందు నీచస్థితి, శత్రు క్షేత్రస్థితి మొదలగు కారణములచే అనుకున్నంత యోగఫలములీయక సామాన్యయోగములు పొందిన జాతకములు పెక్కుగలవు కనుక అంశాచక్రము అతిప్రధానమగును. రాశిచక్రము పూర్వరూపముగను (ముందుభాగము) అంశాచక్రము పృష్ఠభాగము (వెనుకభాగము)గనూ భావింపవచ్చని నాకు తోచుచున్నది. ఇందుకుదాహరణము చూడుడు.

ఒక మానవునకు ముందుభాగమునుండి చూడగా, చాలా రూప సౌందర్యాదులుంటవి ఈ వ్యక్తినే వెనుకభాగమునుండి చూడగ అవయవ వంపుసొంపులు చాలా అసహ్యకరముగా నుండు వారు కలరు. దీనిని రాశి పూర్వరూపముగ భావించుడు. ఇటులనే, మరొకవ్యక్తిని సుదూరమునుండి వెనుకవైపున చూడచక్కని నడతయు, సమానమైన కండరబలము, అత్యున్నత దేహుడుగా యుండి, ఆకర్షణీయుడుగా కనబడిన, ఇట్టివానినే ముందుకువచ్చి చూచినపుడు మనము చప్పరించవలసి యుండును. ఏవో కొన్ని అనిర్వచనీయమైన భావములు ముందువెనుకల తేడాతో చూడగా కలుగుట సహజము ముందువెనుకలు సమత్వముగలవాడు తప్పక మహోన్నతపురుషుడే కాగలడు. ఈ జాతకమునందలి రాశి-అంశ లగ్నముల విశిష్టతను చూడగోరుచున్నాను. ఈ జాతకుని జననం స్వస్తిశ్రీ రౌద్రినామ సంవత్సర ఆషాఢ బహుళ నవమీలు శనివారం ఉదయాది ౫౨-౧౩ ఘడియలకు సరియగు రాత్రి గం. 2-58 ని కు భరణీనక్షత్ర ద్వితీయపాదయుక్త వృషభలగ్నమందు జననం. 1920-7-10 తేదీలు.

| | | | |
|---|---|---|---|
| | చం కే | ల | ర శు |
| | రాశి | | బు గు |
| | వృషభము | | శ |
| | | | |

| | | | |
|---|---|---|---|
| ల గు రా | | ర | శు |
| | అంశ | | |
| | మీనము | | శ |
| కుబు | | | |

జన్మకాల శుక్ర దశాశేషము 11 సం. 1 మా 28 రోజులు. 1949-7-11 తేదీలలో గుంటూరునందు నాటక సన్మాన సంఘము వారు ఆంధ్ర ఆస్థాన కవీశ్వరులు, జగద్విఖ్యాతకవులైన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి అధ్యక్షతన జరిపిన నాటకపోటీలలో ఛాలెంజి శ్రీకృష్ణపాత్రధారిగ యెన్నిక కాబడి, గుంటూరు, విడయవాడ మొదలైన ప్రముఖపట్టణములందు ఘనసన్మానములందుకొన్న శ్రీ పీసపాటి నరసింహమూర్తిగారి జాతకమిది. అనేకమంది కృష్ణపాత్రధారుల నిర్ణించుటేగాక నవరసవేత్తలు, కవిలోకవిజయులు అయిన శ్రీ శాస్త్రి గారు వీరిని ప్రధాన కృష్ణపాత్రధారులుగ నిర్ణయించుట చిన్న విషయముగాదు, చిన్న యోగమూకాదు. శ్రీ నరసింహమూర్తిగారి జీవితములో మరువని మహాద్యోగము. అంతవరకు శ్రీ నరసింహ మూర్తి యెవరోకూడ తెలియదు. నటకులకు, తదభిమానులకును. కొందరినిజూచి మనము వాడిది రాక్షసాంశరాయనియు, వారిది దేవతాంశరాయనియు వాడుదుము. ఈ మానవ శరీరమందున్న దేవాంశబలము నాటకపోటీల కాలమునకు తెలియబడినది. ఈ కాలమున వీరికి కుజదశా శన్యంతరము జరుగుచున్నది. 1949-1-24 మొదలు 1950-3-3 వరకు వున్నది ఈ మధ్యకాలమున పోటీలలో పాల్గొనిరి. ఇక వీరి అంశాచక్రబలము చూతము. ఈనాటికి రాశిరీత్యా చంద్రునకు యిరుపార్శ్వముల గ్రహములేకుండుటకే ముద్రుసుయోగము తెలుపును తత్ఫలం.

శ్లో॥ కేముద్రుమే మళిన దుఃఖిత నీచనిస్వః
ప్రేష్యః ఖలశ్చ నృపతేరపి వంశజాతః॥

అని కలదుగాన ఈ యోగమునందు పుట్టిన రాజవంశీయుడైనను, రాజైనను మహాదరిద్రయోగము పొందునని తెలుపును. కాని ఈ

దరిద్రయోగమునుకూడ హరించే మహత్తరమైన పంచాననయోగము వీరికీయోగము పట్టించినది (అయిదు రాసులందు గ్రహములుండుట) తత్ఫలం.

శ్లో॥ యది భవతి గృహేన్ద్రాః పంచారాశౌ నియుక్తాః
అశుభశుభయుతావా నీచశత్రుగ్రహైర్వా
అశుభ మఖిలనాశం నాశకేముద్రుమాదీన్
స భవతు నృపతుల్యో యోగపంచాననోయం.

కేముద్రుమాది మహాదుర్యోగములన్నియు యీ పంచానన యోగము సుదర్శనచక్రమువలె హరించివేయును జాతకగ్రహములే గాక, ఇట్టి గ్రహయోగములు ప్రధానములగును కాని రాశిరీత్యా సామాన్య ఫలములే కన్పడుచున్నవి. అంశాబలము, వర్గోత్తమాంశ గ్రహబలాధికములచే అధికశుభమిచ్చునని తెలుపుచున్నది ఈ జాతకానుభవము. సహజపాపియు. సప్తమ వ్యయమారకాధిపత్యములు రెండూ కలిగిన కుజుడు రోగస్థానగతుడై వ్యయభావమును, లగ్నమును చూచుటచేత ఈ దశాకాలమున సర్వదుర్యోగములు పట్టుట నిశ్చయము. కాని యిందుకు విరుద్ధముగా వీరికి ఈ కాలమున మహాద్యోగము కలిగించినది కుజదశాశన్యంతరమునుండి రాశిరీత్యా వృషభ లగ్నమునకు యోగకారకుడయిన శని రాశియందు శత్రు రాశిగతుడై (ద్విట్ క్షేత్రేల్పం) దశమభావమును చూచుటయేగాక "పాదదృష్టి ర్బలీమందః" అను న్యాయముగా తృతీయవీక్షణము దశానాథుని చూచుటయు, తుల వుచ్చరాశి అగుటయు, మిత్రక్షేత్రమైన (వృషభము) లగ్నమును చూచుటయు, ప్రబలపాపుడైన కుజునిపై ప్రబలశత్రువీక్షణము, మిత్రక్షేత్రములైన వృషభ తులా

రాసులు రెంటినీ 3- 0 వీక్షణములచే సంరక్షించుచు కుజుని పాప ఫలముల అణగద్రొక్కివేసినాడు. అంశయందు మీనలగ్నమై గురువు బలీయుడైనందున అంశరీత్యా కుజుడు ధనభాగ్యాధిపత్యములు కలిగి శుభకరుడగుటయేగాక రాశియందున్న శని అంశయందు సింహరాశి యందుండుటవల్ల "వర్గోత్తమాశ్చర గృహాదిషు పూర్వమధ్యపర్యంతగా శ్శుభ ఫలా నవభాగసంజ్ఞాః" అను సూత్రము నిజముగా వీరి యోగ స్థితిని ధృవపరచినది మరియు మంత్రేశ్వర ఫలదీపికయందు దశమో ధ్యాయమున "వర్గోత్తమాంశస్థిత ఖేచరోపి స్వక్షేత్రసోక్త ఫలాని తద్వత్" అను సూత్రముకూడ వర్గోత్తమ స్థితియోగమును తెలుపు చున్నది. "భుక్త్వా కేంద్రపతే శ్శుభం" అను న్యాయముగా దశమ కేంద్రాధిపత్య ఫలముకూడ నాటకపోటీల నాటికి తోడై శత్రుస్థాన మందలి కుజుని నిగ్రహించి శని మహాద్యోగఫలదాత అగుటచేత పోటీలయందు రంగస్థల నటనాశత్రువులను జయించుటకు తోడ్పడి విజయసారధిని చేసినది. శత్రుస్థానమందలి కుజుని దుర్బలత్వము శత్రువులకు దుర్బలత్వము కలిగించినటుల చతుర్థ స్థానమందలి శని, వర్గోత్తమాది కారణములచే స్థితప్రజ్ఞను ప్రదర్శింపజేసి వీరి విఖ్యాతికి మూలకారణమైనది శ్రీకృష్ణ వేషముతో చూచిన నరశింహ మూర్తిగారిని మనలోనున్నపుడు చూచిన వీరేనా? నరసింహమూర్తి గారు! అని ఆశ్చర్యము కలిగించును మనతో ముండుకాలము (రాశి రూపముగను) శ్రీకృష్ణ వేషధారణాకాలము (అంశారూపము)గను సరిపోల్చుచున్నాను.

తిరిగి వీరికి 1958-10-9 నుండి 1961-8-5 వరకూ ఉన్న రాహు దశా-శన్యంతర మధ్యకాలమున అనగా 1959 మే నెల 13వ తేదీన ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ అధ్యక్షులు

R.B. రామకృష్ణంరాజు M.L.A. గారి సముఖమున ఘనసన్మానము పాలూరులో జరిగినది. ఈ రెండు సన్మానకాలములందు శన్యంతరము విశేష ఫలప్రదమగుటనుబట్టి అంశరీత్యా వీరి బలము తెలియు చున్నది. రాశి చక్రమునలేని విశేషయోగములిందు సమర్థముగ యున్నవి తిరిగి 1974-10-11 నుండి 1977-4-23 వరకూ గల మధ్యకాలమున షుమారు 55, 56 వయసుకాలమున గజోత్సవ ములూ, పండిత సన్మానములూ, అనేక ప్రభుత్వ సన్మానములూ మొదలగునవెన్నియో పొందగలరు. (ఇటీవల 1998లో ఆంధ్రా యూనివర్సిటీ "కళాప్రపూర్ణ" బిరుదముతో సత్కరించినది) ఘన సన్మానములలో ఇదే ఆఖరుది కావచ్చును కనుక రాశిరీత్యా శత్రు క్షేత్రగతుడైనందులకు అల్పఫలములు పొందవలసిన వీరికి శని అంశయందు వర్గోత్తమాంశస్థితియే యెంతయినా దోహదమైనదని నా నిశ్చయము. మఱియొక ముఖ్యవిషయం— శ్రీ నరసింహమూర్తిగారు శ్రీకృష్ణరాయబారం, ఉద్యోగవిజయములందు కృష్ణపాత్రయే గాని- ఇతర వేషములు వేయకుండుట, కీర్తి పొందకపోవుట చూడగా వీరు గాని, వీరి తల్లిదండ్రులుగాని పూర్వజన్మమున శ్రీకృష్ణపూజాఫలమే అధికముగా చేసియుండిరేమోనని భావన. శ్రీకృష్ణపరమాత్మకూ శ్రీ ఛత్రపతి శివాజీలకు జన్మలగ్నమయిన వృషభలగ్నమందే వీరూ జననమందినారు నిజముగ చూచిన శ్రీకృష్ణ వేషధారులయిన సుంద రాతిసుందర విగ్రహులెందరో గలరు. కాని శ్రీ నరసింహమూర్తిగారి అంశాబలమనునది శ్రీకృష్ణ వేషరూపమున రంగస్థలమున నిలచి యిప్పటివరకూ ఈ సుందరకృష్ణ పాత్రధారులనందరినీ నిలువరించి ధిక్కరించి విజయము గాంచుచున్నది వీరి అంశాబలమేదో బ్రహ్మాండ ముగా కృష్ణపాత్ర రూపమున నాటక రంగస్థలంలో స్వైరవిహార

నృత్యం వీరిచే చేయించుచున్నది. ప్రస్తుతము వీరు నాటక కళా పురుషులకు నిలయమూ, ఆంధ్రాప్యారిస్ అనబడు తెనాలియందే స్థిరముగా యుంటున్నారు. వీరి స్వస్థలము విశాఖపట్నం జిలా, బొబ్బిలి తాలూకా రామునివలస గ్రామము. (ప్రస్తుతం తెనాలిలో వుండుటలేదు) బొబ్బిలి నివాసమేను. ఇట్టి అంశా విషయమున ముహూర్తచింతామణీ (నాగరలిపి) 249 పేజీలో వివాహ ప్రకరణ మున ఈ ప్రమాణములు గలవు గ్రహమైత్రి విషయమునను గలవు. ఉదాహరణకు –

శ్లో॥ రాశినాథే విరుద్ధోపి స బలా వంశాధిపౌ
తన్మైత్రేపి చ కర్తవ్యం దంపత్యోః శుభమిచ్ఛతా॥

అని కలదు. ఇటులనే జాతకఫలములందు రాశియందు లేనిదానిని అంశలగ్నాదిగాకూడ ఫలవిధానములు సందర్భోచితమే కాగలవు. మరియూ—

శ్లో॥ రాశినాథే విరుద్ధోపి మిత్రత్వేచాంశనాథయోః
వివాహంకారయే ద్ధీమాన్ దంపత్యోః సౌఖ్యవర్ధనం॥

అనుటచేత వధూవరులకు గ్రహమైత్ర్యాదులు రాశిరీత్యా కుదుర నపుడు అంశ లగ్నమున చంద్రలగ్న నాథుల మైత్రి వున్ననూ గ్రాహ్యము అని తెలియుచున్నది. "అంశనాథయోః" అని ద్వివచన ప్రయోగమున్నందున ఉభయులకూ రాశిరీత్యా కుదురనపుడు అంశ యందైననూ గ్రహించవచ్చని పై శ్లోకములు తెలుపుచున్నవి. ఇటు లనే రాశియందు సందిగ్ధములుగా నున్న విషయములు అంశయందు తేలికగా సునిశ్చయములు చేయుటకు వీలగును. ఈ విధముగా అంశాస్థితికూడ యెంతయినా గ్రాహ్యమని దైవజ్ఞులు గ్రహించ

గోరెదను. ఈ విధముగా రాశియందలి దుర్బలగ్రహము అంశ యందలి వర్గోత్తమాంశాదులచే పూర్ణబలవంతములగును. ఇటులనే రాశి లగ్నము అంశయందూ అదే లగ్నమగుట వర్గోత్తమ లగ్నము అగును.

ఇట్లు జన్మించుటకూడ విశేషయోగ భోగముల కలిగించును. రెండు ఆధిపత్యములుగల గ్రహరాశియందు ఒకదానియందు రాశి లగ్నము, మరొకటి అంశాలగ్నమగుటకూడ వర్గోత్తమ తుల్యయోగ ఫలప్రదమగును ఒకరు మిధునరాశియందు జన్మించి అంశయందు కన్యాంశయైనచో వర్గోత్తమలగ్న తుల్యమగును. ఇట్లే మిగతా రాసులు గ్రాహ్యములగును వెనుకరాశి-చంద్రలగ్నములను సూక్ష్మ స్థూల కారణ తత్వములుగ పేర్కొనియున్నాను. ఈ అంశను కారణ శరీర లక్షణములు గలదిగ గ్రహించవచ్చని మనవి చేయుచున్నాను. ఈ మూడు లగ్నములూ గాక భావచక్రముగూడ ప్రధానమే. ప్రత్యేకమైన ఒక్క భావము విచారించునపుడే ఇది ప్రధానము రాశి యందలి కొన్ని రాశ్యాది – రాశ్యంత్యాది కారణములచే భావచక్ర మున మారుట తటస్థించును రాశి, అంశ, చంద్రలగ్న, భావలగ్న ములను యీ నాల్గింటినీ బాగుగా విచారించవలయును. ఈ గ్రంధ రచనకు దోహదముగా జాతకాది వివరములు యిచ్చినందులకు నా కృతజ్ఞత తెల్పుచున్నాను. వీరికి దీర్ఘాయురారోగ్యములు కలిగి కళా సేవయందు జీవితము ధన్యము చేయుదురుగాక.

## దైవజ్ఞుని ప్రథమ కర్తవ్యము

జాతకుడు యే ప్రాంతమున జన్మించినది. ప్రధమమున తెలుసు కొని, తద్దేశీయ పంచాంగములందున్న నవగ్రహ నక్షత్ర పాదప్రవేశ

ములను, ఆయా దేశీయ స్ఫుటలగ్నప్రయాణములు, ఉదయాస్తమయ గంటలు, విషయములు చూచి రాశిచక్రము వేయుట ప్రథమ కర్తవ్యము లేనిచో ఫలితములు వత్యస్తమగుటకు ప్రధానకారణము కాగలదు. దైవజ్ఞుని అపహాస్యతకు మూలమగును మన ఆంధ్ర దేశీయ జిల్లాల పంచాంగములందే స్వల్పగణిత భేదములుండగా ఇతరరాష్ట్ర పంచాంగములందలి మార్పులకు ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఇచట గమనించదగిన ప్రధానవిషయము చూడవచ్చును. ఒక శిశువు భూమధ్యరేఖకు నలుబది దేశాంతర యోజనములుగల మచిలీపట్టణము (బందరు)న ఉదయాది పదిఘడియలకు జన్మించె ననుకుందాము ఇదే సమయమునకు బెంగుళూరునందు ఒక శిశువు జన్మించెననుకుందాము. అందాజుగా పంచాంగం, గణితభేదములు బందరుకు, బెంగుళూరుకు ఈవిధముగ కన్పడుచున్నవి.

## దేశాంతర యోజనములు (భూమధ్యరేఖనుండి)

| తూర్పుగ | బందరు | బెంగుళూరు |
|---|---|---|
| | 40 | 16 |

## విషువచ్ఛాయ

| బందరు | బెంగుళూరు |
|---|---|
| 3=34 | 2=46 |

## చరఖండములు

| మచిలీపట్టణము | ఆదిచరజ్య | మధ్య | అంత్య |
|---|---|---|---|
| | 36 | 29 | 12 |
| బెంగుళూరు | 28 | 23 | 9 |

ఈ విధముగనే గణిత ప్రధానములయిన విషువచ్ఛాయ అక్షాంశ, రేఖాంశాదులెన్నో మార్పులు కలిగియున్నందున, మేషాది స్ఫుటలగ్న ప్రమాణఘడియలూ, గ్రహనక్షత్ర పాదప్రవేశములూ, సంక్రమణ పుణ్యకాలములూ, అహఃప్రమాణములూ, తిధి, నక్షత్ర, యోగ, కరణములూ, ఉదయాస్తమయ భేదములూ కలిగి, గణిత భేదములచే ఆయా దేశములకూ, రాష్ట్రములకూ సంస్కరించబడిన శుద్ధపంచాంగము లగుచున్నవికూడను. వెనుక వ్రాసిన పదిఘడియల కాలమునకు మన పంచాంగమున అశ్వినీ ప్రథమే శుక్రః అని పాద చారము కలిగియుండవచ్చును. గణిత భేదాదులచే బెంగుళూరు పంచాంగమున రేవతీ చతుర్థములోనే వుండవచ్చును ఈ కాలము నకు. అట్టి సమయమున మనము సమక్షేత్రమయిన మేషరాశి ఫలిత ములనూ, వారు శుక్రునకు (ఉచ్చ) మీనరాశి ఫలములనూ వ్రాయ వలసియుండును. ఇటులే శేషగ్రహచారములూ మార్పులు రావచ్చును ఈ గణితము ఉదాహరణకుమాత్రమే ఇచ్చుచున్నాను. దైవజ్ఞుడు ఇట్టి భేదములను గుర్తించి, ఆయా ప్రాంతీయ పంచాంగములు చూచిగాని, అట్టి వివరములు సంపాదించిగానీ రాశిలగ్నము కట్టుట ప్రధానము. ఇట్టి లగ్నస్ఫుటములూ, గ్రహపాద స్ఫుటచారములూ దైవజ్ఞుడు చెప్పబోవు తన్వాది ద్వాదశ భావఫలములకూ మూల మగును లేనిచో ఫలితములు వ్యత్యస్తమగుటకు కారణమగును ప్రధమమున దైవజ్ఞుడు గుర్తించదగిన మరొక ప్రధానవిషయము గలదు. ఒక వ్యక్తి ఒక జాతకము ఇచ్చి తనకు పలితములు చెప్పు మని అడిగెననుకుందాము. ముందుగ దైవజ్ఞుడు—రాశిస్వభావము లగ్నగత గహ స్వరూప ఫలాదులు చూచియూ, చంద్రలగ్న— నవాంశ లగ్నములందలి బలాధికమును గుర్తించియూ స్థూలముగ

ఆ వ్యక్తిని పరీక్షించి, మానసిక నిశ్చయము కుదుర్చుకొని, ఈ జాతకము 'ఇతనిదేనను' నిర్ణయము కలిగిన తదుపరి ఫలభాగమునకు దిగవచ్చును అట్లుగాక అతను యిచ్చిన రాశిచక్రమునే మనము నమ్మి గుడ్డిగా ఫలకథనమునకు ఉపక్రమించినపుడు అతను. మీ ఫలితములు నాకేమియూ సరిపోలేదని అడుగవచ్చును అతను తెచ్చిన లగ్నపత్రికమాత్రము శుద్ధముగా యున్నదని మనకు నమ్మిక యేమిటి? (అతనికి నమ్మిక వుండవచ్చు) వేయించినవారి లోపమో, వ్రాయువారిలోపయో, గడియారములోపమో తత్కాల ప్రసవగృహ మందలి పెద్దలెవరూ సరిగా జన్మమును గుర్తించక అందాజగ తమ రికార్డులందు వ్రాయుటయో జరుగుచుండును ఇవి అన్నియూ దైవజ్ఞులనూ శాస్త్రమునూ తప్పటడుగు వేయించుటకు ప్రథమసోపానము లగుచున్నవి. భారతదేశమనునది ఒక్కటే అయినా, భూమినిమ్నోన్నతములు ఒక్కటిగ లేవుకూడను. ఇట్టి కారణమున విషువచ్ఛాయ అక్షాంశ, రేఖాంశాది గణితములు మార్పులు జెంది భారతదేశమున పంచాంగములు ప్రాంతీయ భేదములతో భిన్నములుగనే తయారు చేయబడుచున్నవి.

ఇట్టి కారణములున్నందున ఆ పంచాంగము యిట్టులున్నదనియు ఈ పంచాంగ మిట్టులున్నదనియు దైవజ్ఞులను శాస్త్రజ్ఞులను దూషించవద్దని పాఠకులకు విన్నవించుచున్నాను. ఇట్టి విషయములేగాక దేశానుకూలమైన మార్పులు కలిగి సౌరమానం, చాంద్రమానం నక్షత్రమానం బార్హస్పత్యమానం అను భేదములతో నున్నది పూర్వులు యిట్టి భేదముల గ్రహించియే సిద్ధాంత గణిత గ్రంథముల రచించినారు. ధర్మశాస్త్ర గ్రంథములను రచించినారు. కాశీ పంచాంగమునకు మనకు దాదాపు పదమూడు సంవత్సరములు

తేడాయున్నది. మనకు వికారి సంవత్సరమైనవారలకు విరోధికృత్సం వత్సరము కాగలదు. మనము కాశీవెళ్ళినా అక్కడి పంచాంగపద్ధతినే సంకల్పాదులు జరుగును. మన "వికారి" ఇచటనే వుండును. పూర్వులు చేసిన నిర్ణయములు సక్రమములుగానే నమ్మవలయును. మౌఢ్య వాదనతో వాదించుట సమంజసముగాదు. ఇక ఆంధ్రులకు, అరవ లకు ఉగాది భేదములు పది, పదునైదు రోజులు తేడాలోనే వచ్చు చున్నవి. ఇట్లె పంచాంగ సాధనకు కరణగ్రంథ తంత్రగ్రంథాది భేదములు, ధర్మసింధు, నిర్ణయసింధు, యల్లాజీయాది బహు ధర్మ శాస్త్రగ్రంథ భేదములు, ధర్మశాస్త్ర విషయమునను భేదములు కలిగి యుండుట ప్రసిద్ధమేను ఇట్టి భేదములుండుటబట్టి గ్రంథములకు, ఆ గ్రంథరచయితలకు విశిష్టత్వము కలిగినది. ఈ పంచాంగము లంతు నేటికీ దృక్సిదవాదులు, దృక్సిద్ధవ్యతిరేకులు గలరు. ఇక ఫల భాగమున నిరయనవాదకులు, సాయనవాదకులు కలరు. ఇటుల కొన్ని వర్గములవారు యీనాటికేగాక అనాడూ కలరని పైగ్రంథ ములు తెలుపుచున్నవి ఏదో ఒక ప్రమాణగ్రంథము ననుసరించుట ధర్మమే, తప్పుదుకూడను. మరొక ప్రమాణ గ్రంథములవారు మరొకరిపై తమ ప్రమాణగ్రంథముల మార్గమును, తమ ప్రభావ ములనుచూపి బలవత్ప్రయోగము చేయుటగాని, లోకమంతయు వప్పించుటకు ప్రయత్నించుటవల్లను ఈ శాస్త్రముపై గౌరవమేలేని యీ కలికాలములో గ్రహసిద్ధాంతమునే వాదప్రతివాదములతో కించపరచుటయే కాగలదు. ప్రామాణ్య గ్రంథాధారమైనదల్లా ప్రమాణమే. అతని ఫలితములు తప్పినపుడు అతనే ఆ మార్గమును మార్చుకొనును. అందుకు మనము యెదుర్కొని ప్రయత్నించ పని లేదు కాన యిటీవల భారతప్రభుత్వ పంచాంగము కొంత అలజడి

కలిగించినది. క్రమేణ యీ అలజడి తగ్గి యిపుడంతగా అనుకునేవారే తక్కువగా యున్నారు.

భారతమున ఉత్తర గోగ్రహణకాలమున అర్జునని రాకవల్ల తిరిగి పన్నెండు సంవత్సరములు వాగ్దానప్రకారం అరణ్యవాసం చేయవలయునని దుర్యోధనుని విశ్చయం. ఇది దుర్యోధనుని స్థూల దృష్టితో న్యాయముగా వచ్చును. కాని యిందుకు భీష్మాచార్యుడు అధికమాసాలతో గడువు పూర్తయినదని సమాధానమిచ్చెను. అధిక మాసాలు కలుపుకొని చేయుదుమని పాంఠవులు చెప్పలేదు, కౌరవులు కోరలేదు పన్నెండు వత్సరములు అరణ్యవాసము, ఒక సంవత్సర మజ్ఞాత వాసము మాత్రమే దుర్యోధనాదులు కోరినది. ధర్మసూక్ష్మమే ఇంత సున్నితముగానుండ గణితశాస్త్ర, ధర్మశాస్త్ర గ్రంథములందు తేలనిజటిలసమస్యలు అనిశ్చితములైన వనేకములుండవచ్చును. ఇదే నిజమనుటకు నిదర్శనము చూపుటకు కాళిదాసాదులము కాము. గ్రహ రాజైన సూర్యుడే ప్రపంచమంతయు న్యాయముగ ఒక్కతూరిగ ఉదయాస్తమయములు పొందుటలేదు. మనకూ లండనుకు దాదాపు నాలుగు గంటల నలుబది నిమిషములు తేడాయున్నది. అమెరికా మొదలైన యితర దేశములందు యింకా ఎక్కువ తేడాతో ఉదయించ వచ్చును, అస్తమింపవచ్చును. భగవానుని ఉదయాస్తమయము లందే భేదములుండగ, పంచాంగ భేదములను, ధర్మశాస్త్ర గ్రంధ ములను దుయ్యబట్టుట విజ్ఞతాలక్షణము గాదు. పూర్వులు కొన్ని నిర్ణయములు గ్రంధములందు వ్రాసియున్నారు. "శేషాచలస్య దక్షిణ దేశే సౌరమానాబ్దో గ్రాహ్యః" అనియు కలదు. ఇది ఒక హద్దును ఏర్పరచుచున్నది. సింహ గురుదోషాదులందు "వింధ్యస్య దక్షిణదేశే నాస్తి" అనియు కలవు అటు వింధ్యయు, ఇటు శేషాచలము

గ్రంథములకు, ఆచారములకు పొలిమేరలవలె (సరిహద్దులు) నిర్ణయించినారు. ముహూర్తకాలామృతం తృతీయ బిన్దువులోని **52** శ్లోక వ్యాఖ్యానమున "వింధ్యస్య దక్షిణదేశే మీనచైత్రే శుభావహః" అనియు, 57 శ్లోక వ్యాఖ్యానమున "వింధ్యస్య దక్షిణదేశే బాల్య వార్ధశితేజ్యయోః। త్రిదినం వర్జయిత్వాతు తతః కుర్యాచ్చ శోభనం" అనియు వింధ్యహద్దులను గుర్తుచేయుట కలదు. ధర్మశాస్త్ర గ్రంథములందు పెక్కుచోట్ల "వింధ్యస్య దక్షిణే" అనే వాక్యాలు నేటికీ కనబడుచున్నవి. నిర్ణయసింధౌ ప్రథమపరిచ్ఛేదే కాలనిర్ణయః—

శ్లో॥ శుక్రో గురుః ప్రాక్పరాక్పబాలో।
వింధ్యేదశావంతిషు సప్తరాత్రం।
వంగేషు హూణేషుచ షట్పంచ।
శేషేచ దేశే త్రిదినం వదంతీతి॥

అని కలదు. ఈ హద్దులను పరిపాలించుట మన ధర్మము. దేశమునంతయు యేకదృష్టితో నడిపింపవలయునన్న ఈ నిర్ణయములే విచ్ఛిత్తికాగల ప్రమాదము కలదు. కనుక యే ప్రాంతమువారా ప్రాంతీయధర్మము ననుసరించుట శ్రేయోదాయకము. అక్షాంశగల దేశములందే జననభేదములుండగా నిరక్షర దేశములందలి పంచాంగాదిచారములూ మారవచ్చును. ఆయా పంచాంగములందలి గ్రహపాదప్రవేశములు, అస్తంగతము ఉదయము, వక్రత్వము, వక్రత్యాగము, ఋజుగతి మొదలయిన వివరములన్నియు దైవజ్ఞుడు ముఖ్యముగా లగ్నపత్రికయందు చేర్చవలయును. ఇది ప్రథమ కర్తవ్యము.

మేడమెట్లు యెక్కువాడు మొదటిమెట్టు చూచి అడుగువేసినగాని, మేడపై అంతస్థుకు చేరనట్లు, ద్వాదశ భావములకు మూలమయిన భావమును వివేచించి చూడకపోయినచో మిగతా భావములకు ఆధారమేలేదు. కనుక రాశిచక్రమును వేయుట ప్రథమసోపానముగ గురించవలయును. ఉపేక్షాభావముతో ముందుకుపోయి తదితర భావవిచారణలు చేయరాదు. దైవజ్ఞుని శాస్త్రపాండిత్యము, బుద్ధి కుశలత, అనుభవము ఇచట యెంతయినా దోహదములగును. దైవజ్ఞుని విశిష్ఠతను వ్యక్తపరచును ఇట్టి నిర్ణయముల పరిశీలించి నడచిన సాధారణముగా అతని కలమునకు తిరుగంటూవుండదు. ఎచ్చటయినా స్వల్పముగా తప్పినను అది దోషముగా పరిగణించదగి యుండదు. "ప్రమాదో ధీమతామపి" అని కలదు. అనంత శక్తి సంపన్నమైన ఖగోళ ప్రభావమును దృష్టిలో యుంచుకొని వ్రాయు నపుడు జారిపోయే ఒక స్వల్పవిషయం ప్రధానత్వము వహించదు. పుష్కలమైన ధాన్యరాశిదృష్టితో చూడగా, నేల బొరియలలోనికి, వూక (పొట్టు) లోనికి ధాన్యము జారిపోయినంతమాత్రమున ధాన్య రాశి లోపించదు అటులనే అనేక విషయములు చూచునపుడు ఒక విషయం చెప్పనంతమాత్రమునగాని, చూడకపోయినగాని దోషం గానేరదు. దైవజ్ఞుడు క్షుణ్ణముగా రాశిశీల, గ్రహశీల, భావఫలాది విచారణలుచేసి శాస్త్రదృష్టి, ఉపాసనాదృష్టి, ఆత్మవిశ్వాసాదులచే రాశి చక్రము చూడగానే సత్యాసత్యమెరుంగు మేధస్సంపన్నతను కలిగి యుండవలయును. గురుముఖతా ఇట్టి శిక్షను తప్పక పొందినగాని అతను దైవజ్ఞత్వమును సార్థకపరచుకొనజాలడు. ఈ వాక్యములు నేను సమర్థుడనని వ్రాయుటలేదు. యదార్థమని తోచినది వ్రాసితిని "లగ్నమేవ ప్రశంసంతి గర్గనారద కశ్యపాః" అనియూ—

శ్లో॥ జ్యోతిశ్శాస్త్ర ఫలం సర్వం లగ్నాధీనం బుధైః స్మృతం
స్ఫుట ఖేటాశ్రియం తత్తు తస్మాత్ ప్రాధాన్యమేతయోః॥

అను ప్రసిద్ధ ప్రమాణములచే స్ఫుటగ్రహములవల్లను, లగ్న ప్రధానతలవల్లను జాతకఫలితములు ఆధారపడివుండును గాన, యివి-దైవజ్ఞుని ప్రథమకర్తవ్య విషయములగును

## బాలారిష్ట - లగ్నబాగ - చంద్రబాగ దోషములు

జననాత్పూర్వమందలి బహుజన్మములందు బహువిధములుగా సంపాదించిన సుకృత, దుష్కృతాది కర్మవిశేషములచేతనే మానవు లకు ఈ లోకమున అల్పజీవితములుగానీ మధ్యకాలజీవితములుగానీ, చిరకాలజీవితములుగానీ, మరేవిధమైన జీవితములుగానీ కలుగు చుండును. స్వల్పపుణ్యముగల శిశువులు మాతాపితృకర్మల దోషముచే గానీ, బాలారిష్టాదిగ్రహదోషములవలనేగానీ మరేవిధమైన కారణము లచేగానీ జన్మించినకొలది కాలమునకే పుణ్యాలుస్తముచే నశించెదరు. ఇట్టి పుణ్య పాప ఫలానుభవరూపముగనే జననములు కలుగుననేది ధర్మసమ్మతమైన విషయము. ఇట్టి జన్మముగల మానవులకు జ్యోతి శ్శాస్త్రపరముగ 120 సంవత్సరములు పరమాయుస్సు వున్నను, ధర్మశాస్త్ర గ్రంథములందు, వేదమునందు, మానవజీవితము నూరు సంవత్సరములుగనే నిశ్చయించబడి యున్నది. నేటికీ వేదవిదులు ఆశీర్వచనకాలములందు "శతమానం భవతి శతాయుః పురుషశ్శ తేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతి తిష్ఠతి" అనియు "శతంజీవ శరదో వర్ధమాన ఇత్యపి నిగమో భవతి శతమితి శతం దీర్ఘమాయుః" అనియు దీవించుచున్నారు ఇక ధర్మశాస్త్రమైన కాలమాధవీయము

నందు షష్ఠమ ప్రకరణే "శతసంవత్సరాయుషో మనుష్యేవానధి కృత్య ధర్మశాస్త్రస్య ప్రవృత్తత్వాత్" అనియు తెలియుచున్నది. ఇట్టి అయుర్దాయముకూడ మాతాపితృ శిశువుల దుష్కర్మసంపాదనా ఫలములచే బాలారిష్టరూపమునను తదితర విధములవల్లను అయుర్హరణమై గతించిపోవుదురు. ఇందుచేతనే జననాది పన్నెండు సంవత్సరములు శిశువునకు బహువిధ దినగండకాలములతో పూర్తి అగుచున్నది పదమూడు వయసునుండి శిశువు మాతాపితృ కర్మలనుండి విముక్తుడై స్వకర్మానుభవమునకు అర్హుడగును. ప్రథమమున బాలారిష్టగ్రహములను విధిగా చూడవలయును అందలి శ్లోకమిది—

శ్లో॥ చంద్రాష్టమంచ (8) ధరణీసుత సప్తమంచ (7)
రాహుర్నవంచ (9) శనిజన్మ (1) గురుస్తృతీయే (3)
అర్కస్తుపంచ (5) భృగుషట్క (6) బుధశ్చతుర్థే (4)
కేతువ్యయస్తు (12) జనితో మరణాయ సద్యః

అని కలదు. ఇందుకు భిన్నముగా ముహూర్తాంశము అను గ్రంథమున ఈ విధముగా బాలారిష్ట శ్లోకము గలదు

శ్లో॥ చంద్రాష్టమంచ ధరణీసుత సప్తమంచ
రాహుర్నవంద శని జన్మ గురుస్తృతీయే
శుక్రంచ షష్ఠ బుధ సప్తమి (7) జన్మకేతు (1)

అని కలదు ఇందు పూర్వార్ధము ముందు శ్లోకమువలెనే గలదు. కాని, బుధశ్చతుర్థే (4) బదులుగా బుధసప్తమీ (7) అనియు, శని (1) జన్మకు బదులు జన్మకేతు (1) అనియు మారినది. మరొక ముఖ్యవిషయము. ఈ శ్లోకమున ముందు శ్లోకమందున్న అర్కస్తు

పంచ (5) అనునది కేతువ్యయస్థ (12) అనునది యిందు లేనే లేదు. ఈ గ్రంథకర్త నామాదులేవియు లేవు గ్రంథ రచనావిశిష్టతనే అనుమానించవలసి వచ్చుచున్నది. నేను అష్టమ రాహువుకూడ బాలారిష్టమని కొందరముఖతా వినియున్నాను. జాతకానుభవసారే అష్టమభావ విచారః శ్లో॥ శుక్రస్తు షష్ఠ బుధ సప్తమ కేతుజన్మ ద్వాదస్యమద్కా ఇతి జాతక మృత్యుయోగః అని కలదు. ఇతర గ్రంథము లెన్నిటియందు యెన్ని విధములుగ యున్నను మొదట బాలారిష్ట శ్లో॥మే దైవజ్ఞ లోకాంగికారము కాగలదు. ఈ విశేష ప్రమాణములుకూడ కొన్ని జాతకములపై తరచుగా ఫలప్రమాదము లుగా కన్పడుచున్నందున చేర్చితిని. విజ్ఞులైన దైవజ్ఞులు తమ అభీ ష్టానుసారముగ వీటిని సమన్వయపరచి చూడగోరెదను. కొన్ని జాతకములందు బాలారిష్ట గ్రహములుండికూడ అయుర్భావాధిప, భావస్థ, అయుష్కారక గ్రహబలాదులచేతను, కేంద్రకోణాదులందలి శుభగ్రహబలాదులచేతను, బాలారిష్ట దోషభంగములు కలిగి శిశువు జీవించుటకు కారణములగుచున్నవి. మరికొన్ని జాతకములందు బాలారిష్ట గ్రహములేకనే కేంద్రకోణాదులందు శుభులుండికూడ శిశు మరణములు కలిగి శాస్త్రజ్ఞులనే ఆశ్చర్యపరచినవికూడ గలవు దిగువ వివరములను పరిశీలించగోరెదను. బాలారిష్టమనేది వుండి పన్నెండు సంవత్సరములలోపల నష్టముకాకపోయినను, మధ్యవయసునగాని, అపరవయోకాలమునగాని వచ్చినచో మారకప్రదములగును. అయితే యిట్టి కాలమందలి దశలోకూడ ఈ బాలారిష్ట గ్రహముపై ప్రబల శత్రువీక్షణము కలిగినపుడుగాని, ప్రబలశుభవీక్షణము కలిగినగాని మారకములు కలుగవు. బాలారిష్ట గ్రహమేగాక ఇట్టి గ్రహదశకూడ బాల్యమందే (12) వచ్చినచో కేవల దుర్యోగఫలప్రదమై మారకము

కలిగించును. మరికొందరి మతమున శిశువుయొక్క మొట్టమొదటి దశయే బాలారిష్టదశా ఫలప్రదమనియు, తదుపరి దశలు బాలారిష్ట దశాఫలప్రదములు గావనియు అనెదరు. ఇది న్యాయసమ్మతమైన విషయము గాదుకూడను.

జననాది పన్నెండువత్సరములు మాతాపితృ శిశువుల ప్రారబ్దము విధిగా శిశువును వెంబడించునది నిశ్చయం. ఇందుచేతనే పన్నెండు వత్సరములవరకు సంవత్సరమునకొకతూరి శిశువునకు ఆయుష్య హోమాదికర్మలు చేయుచుండుమని జ్యోతిషగ్రంధములందు, వైదిక విధానగ్రంథములందు నిర్ణయములు గలవు. బాలారిష్టభంగములు బహుగ్రంధములందు బహువిధములుగా గలవు ఇట్టి విషయమున ఆయుర్దాయదీపికయందును గలవు. గ్రంధవిస్తరభీతిచే వ్రాయలేక పోవుచున్నాను. ఒక్కొక్క జాతకమున మరికొన్ని వివరములు కాన వచ్చుచున్నవి. రాశిసంధి, నక్షత్రసంధి-ఇట్టి సంధిస్థితులయందుండే ప్రధానగ్రహములయిన రవి, గురు, శని, రాహుగ్రహదశలు ఆయు ర్దాయభంగము, దైన్యయోగాదులను కలిగించును. ఈ విషయము కూడ ఆయుర్దాయదీపికా గ్రంధమున గలదు ఇంతవరకూ అందరూ చూచు బాలారిష్ట గ్రహవిచారణను గురించియే వ్రాసితిని. ఇక రెండవవిషయము ఏమనగా – జన్మలగ్నమందలి మృత్యుభాగలు. అవి ఈ విధమున ఒక్కొక్క రాశియందు గలవు మంత్రేశ్వర ఫల దీపికాయాం త్రయోదశోऽధ్యాయే—

శ్లో॥ దానంథేనో రుద్రరాద్రీముఖేన। భాగ్యోభానుర్గోత్రజాయాముఖేన।
పుత్రీనిత్యం మృత్యుభాగాః క్రమేణ।
మేషాదీనాం తేషు జాతోగతాయుః॥

అని కలదు. మేషరాశియందు (8) వృషభమున (9) మిథునమున (22) కర్కాటకమున (22) సింహ్వామున (25) కన్యయందు (14) తులయందు (14) వృశ్చికమున (23) ధనస్సు (18) మకరం (20) కుంభము (21) మీనమున (10) భాగలయందు జన్మించిన శిశువులకు మారకప్రదములగును. జాతకములందు బాలా రిష్టములేగాక ఈ మృత్యుభాగలయందు జన్మించుటకూడ మారక లక్షణమగును. ఇందులకీ ఉదాహరణము చూడగోరెదను.

స్వస్తిశ్రీ వికారి సం॥ భాద్రపద శుద్ధ ద్వాదశీలు సోమవారం ఉదయాది గం. 9-17 నిమిషములకు శ్రవణానక్షత్రయుక్త తులా లగ్నమున ఆడశిశువు కడపజిల్లా జమ్మలమడుగునందు జననం. ఇది మా వదినగారి కుమార్తె జననం అచటి పంచాంగ పద్ధతిన ఈ తులాలగ్నభుక్తి ఘ. ౨-౩౦. తులా ఏష్యం ఘ. ౨-౫౫ వుండినది. ఈ శిశువు కలిగిన ఒకమాసం ఇరువదిరోజులకు మాతృమారకమును, నాలుగుమాసముల మూడురోజులకు శిశుమరణమును రెండూ కలిగినవి. సం. 1-1-3 రో॥ చంద్రదశా శేషం. లాభమందున్న లగ్నాష్ట మాధిప శుక్రాంతరమున మారకములు సంభవించినవి. అప్పటి గ్రహకుండలి యిది—1959-9-14 తేదీలు.

| | | | |
|---|---|---|---|
| కే | | | |
| | రాశి | | |
| చ | తులా | | ర బు వ(శు) |
| శ(వ) | గు | ల | కు రా |

ముందు శుభయోగముల చూతము. సహజముగా లగ్నాష్టమాధిపతియు, వక్రియైన శుక్రుడు లాభమందు బలీయుడు. "సర్వేగ్రహాః శుభ ఏకా దశస్థాన ఫలదాభవన్తు" అను న్యాయముగనే బలీయుడు. జాతకాను

భవసాతం. అష్టమభావ విచారః "త్రిషడాయగతాః పాపాః" అను న్యాయముగా మాతృస్థానాధిపతియైన శని, భావమునకు వ్యయ మందున్నను, శుభక్షేత్రగతుడై వక్రించినందున, "వక్రం గత స్యోచ్ఛఫలం విదద్యాత్" అను న్యాయముగ ఉచ్చాభిముఖుడగుట భావమునకు బలమే. విష్ణుదేవతా నక్షత్రమున మాతృభావమున మాతృకారకుడైన చంద్రస్థితి బలవంతమేను. "దివా మాతుశ్చ భార్గవః" అనుటచే శుక్రుడు బలవంతుడే అవరోహణా స్థితియందు వక్రించుటవల్ల శుక్రుడు ఉచ్ఛఫలప్రదాత కాగలడు "భావాస్సర్వే శుభపతియుతా వీక్షితావా శుభైః తత్త్ద్భావా స్సకలఫలదాః పాప దృగ్యోగహీనాః" అను న్యాయముగా వుండి భావస్థభావాధిదపచంద్ర శనులు బలీయులైకూడ మాతాశిశువులు గతించుట శాస్త్రనిర్ణయము లను, శాస్త్రజ్ఞులను కొంత ఆందోళన పరచకమానదు. ఇతర కారణము లేవయినా దైవజ్ఞులు సూచించినను సంతృప్తికరముగ నుండవు. ఈ తులారాశియందు పదునాలుగవ భాగయందు జన్మించుటయు శని-కుజుల పరస్పర రూక్షవీక్షణాదులు దోహదములై మాతాశిశు మరణ ములకు మూలకారణమగుచున్నది ఈవిధముగా జన్మలగ్నమందలి మృత్యుభాగలు మరణప్రదములని శాస్త్రనిర్ణయము. ఇక మూడవ విషయము. ఇక చంద్రలగ్నమందలి మృత్యుభాగలు. రాశి చక్ర మందలి విషభాగలవలెనే, జన్మనక్షత్రయుతమైన చంద్రలగ్నము నకు మేషాది మీనపర్యంతము విషభాగలు చంద్రస్థితివల్ల కలుగు చున్నవి. ప్రమాణము చూడుడు

శ్లో॥ చాంద్రం రూపం లోకశూరోవరజ్ఞః
కుడ్యే చిత్రం భాగ్యలోకే ముఖానాం,

మేనేరాజ్యం మృత్యుభాగాః ప్రదిష్టాః
మేషాదీనాం వర్ణసంఖ్యైర్విమాంశోః॥

అని కలదు. చంద్రునకు మేషగాశియందు (26) భాగయూ, వృషభ మున (12) మిధునమున (13) కటకమున (25) సింహం (24) కన్య (11) తులా (26) వృశ్చికమున (14) ధనస్సున (13) మకరం (25) కుంభం (5) మీనమున (12) భాగయు విషభాగ లగుచున్నవి. అమృతకిరణుడైన చంద్రునియందలి జీవశక్తి ఈ విషతుల్య భాగములందున్నపుడు పాలయందలి మజ్జిగ చుక్కలవలె మృతఫలప్రదమగుచున్నది. చంద్రకిరణామృతము వెన్నెలద్వారా ఓషధులయందు, ఆహారధాన్యాదులందు చేరి ఆహారముగ భుజించ బడి, తండ్రియందు వీర్యరూపమున యోనియందు విడువబడి, జీవుని పాలిటి జీవామృతమగుచున్నది. వేదవిదులుకూడ "ఓషధయస్సగ్ం స మోషధయస్సం సంవదంతే వదంతేసగ్ం సంవదంతే వదంతే సోమేన సహ" అని ఆశీర్వచన కాలములందు ఈ రూపముగా సంతానవంతుడవు కమ్మని ఆశీర్వదించెదరు ఈ విషభాగలందు జీవులకు జీవనకారకుడైన చంద్రుడున్నపుడు మృతఫలప్రదములగు చున్నవి. విషభాగలందు చంద్రుడు లేనపుడు మాతృక్షీరమువలె వృద్ధియు విషభాగలందు యున్నప్పుడు ఇతరులు ఒకని హత్యా సందర్భమున యిచ్చు విషమిశ్రక్షీరములవలె మృతఫలప్రదము లగును. ఇక నాల్గవ పద్ధతి చూడుడు ఇది లగ్నాది కేంద్రకోణము లందు చూడతగినది. జాతక చంద్రికాయాం పూర్వభాగే—

శ్లో॥ లక్ష్మీస్థానం త్రికోణంస్యాత్ కేంద్రస్థానంతు వైష్ణవం,
తేషాం సంయోగ మాత్రేణ చక్రవర్తీ నరో భవేత్॥

అని కలదు ఈ శ్లోకమునుబట్టి కేంద్రములు విష్ణుస్థానములూ, కోణములు లక్ష్మీస్థానములని తెలియుచున్నందున, సర్వదుష్టశక్తులు విష్ణుదేవతాశక్తిగల సుదర్శనచక్ర ప్రతాపముచే పలాయితములయి నట్లు విష్ణుశక్తిగల కేంద్రములందు బలాధిక శుభులుండి. ఇక కోణములందు ప్రబలశుభులున్న విష్ణుపార్శ్వమున చేరిన లక్ష్మీదేవతవలె శోభాకరములయి జాతకుని సర్వదుర్దోహముల హరించి ఆయురారోగ్య సౌభాగ్య ఫలప్రదములగును. బాలారిష్టాది సకల దోషముల నుండి సుదర్శనమువలె పాలించును. 'కేంద్రకోణే శుభాకాన్తా' అనుటచేత కేంద్రకోణముల శుభులుండుట సర్వసౌభాగ్య సూచకము కాగలదు. కేంద్రకోణములందలి కేవల పాపగ్రహములచే జాతకునకు సద్యోమరణప్రదములు కాగలవు

శ్లో॥ రవిశ్చ రవిపుత్రశ్చ భూమిపుత్రశ్చ కేంద్రగాః।
దశాహే దశమాసంవా దశవర్షం సజీవతి ॥

అని కలదు. కేంద్రములందు కేవల పాపగ్రహములయిన రవి, కుజ శనులకు తోడుగ రాహుకేతువులు చేరియున్నచో అట్టి జాతకుడు పదిరోజులలోగాని, పదిమాసములలోగాని పదివత్సరములలోగాని తప్పక గతించును. కనీసము కొన్ని శుభగ్రహవీక్షణములయినా వీరిపైనవున్న కొంతకాలము జీవించును. పై శ్లోకమువలె మరికొన్ని అరిష్టశ్లోకములు బహుగ్రంథములందు గలవు మరియు జాతకానుభవ సారగ్రంథమున ఆయుర్భావ విచారణయందు 'సర్వేషాం మారకో యత్ర జీవేద్వర్ష శతాధికం' అని కలదు. గ్రహము లెచటయున్నను అన్ని గ్రహములకు (శుభ-పాపులు) మారకలక్షణయోగము కలిగినపుడే దీర్ఘాయుర్దాయము కలిగించును. ఇది కొంచెము విజ్ఞులయిన

వారు మనోబలాధికముచే నిర్ణయించుకోతగిన విషయము కాగలదు. సందర్భస్థితులనుబట్టి ఇచట నిర్ణయములు మారుటకు అవకాశము లున్నవి ఇది దైవజ్ఞ మనోవిదితము. ఒక్కొక్క శిశువు మాతాపితరుల పూర్వకాల ఋణవిశేషములచే మాతృగర్భమందలి రక్తపానాదుల తోనే తృప్తిపడి మృతపిండముగనూ, మరొక్కడు జాతకర్మ విశేషోత్సవములూ ఆముదములతోడను, మరొక్కడు బాల్యవినోద చేష్టలతోడను జీవితములు ముగించుకొని పోవుచున్నారు ఇట్టి కారణాదులచే యోనిజన్మములయినవారలకు జననాది పన్నెండు వత్సరములూ ఆయుర్దాయనిశ్చయము దుస్తరము అగుచున్నది. పదమూడు వయసునుండి సామాన్యముగా విశేషభయములుండవు. అపుడుకూడ కలిగితే అది యాతని జన్మకాలమందలి అల్పబలగ్రహముల కారణ మగును. పన్నెండు సంవత్సరములలో కలిగే మారకము గురించి ఈవిధముగా ప్రమాణములు గలవు మంత్రేశ్వరే త్రయోదశోఽధ్యాయే

శ్లో॥ ఆద్వాదశాబ్దాన్తర యోనిజన్మనా।
మాయుష్కలా నిశ్చయితుం నశక్యతే।
మాత్రాచ పిత్రాకృత పాపకర్మణా।
బాలగ్రహైర్నాశ ముపైతి బాలకః॥

అని కలదు. మాతా పితృ శిశుకృతములయిన పూర్వకృత కర్మాదుల చేత యోని జననము గలవారలకు ఈ మారకదోషములు బాల్యకాలముననే కలుగునని పై శ్లోకార్థము మరికొందరకు సంతానము కలిగి వెంటవెంటనే నశించిపోవుటయేగాని వంశాంకురము వర్ధిల్లజాలదు అందుకు కారణములు ఈవిధములుగా గలవు మంత్రేశ్వరే త్రయోదశోఽధ్యాయే—

శ్లో॥ ఆద్యే చతుష్కే జననీ కృతాఘైః।
మధ్యేచ పిత్రార్జిత పాపసంఘైః।
బాలస్తదంత్యేషు చతుశ్శరత్సు।
స్వకీయదోషైః స్వముపైతినాశః॥

అని కలదు. జననాది నాలుగు సంవత్సరములలోనే నశించుచుండిన అది మాతృపురాకృత కర్మఫలము, అయి నుండి ఎనిమిది సంవత్సరముల వయస్సులో గతించుచుండిన అది తండ్రి కర్మఫలము, తొమ్మిదినుండి పన్నెండులోగా గతించిన అది శిశువు పురాకృత కర్మఫలములగును మాతాపితరుల కర్మఫలముగాదు అని ఈ శ్లోకార్థమున గలదు. కదళీవంధ్యా కాకవంధ్యాది వంధ్యాభేదములవల్లనూ, మృత ప్రజాయోగాది దుర్యోగములవల్ల భారతమందలి ధృతరాష్ట్ర సంతానము అతని యెదుటనే అంతరించినట్లు నశించిపోవుచుందురు. మహనీయుల శాపానుగ్రహములచే నశించుటయు, పుట్టుటయూకూడ జరుగుచుండును. ఇట్టి సంతాన విషయములందు సంతానదీపికా, సంతానవృద్ధి ప్రదీపికాది గ్రంథములందు కొంత వ్రాయబడినది. కాన ఇట్టి విషయములందు ప్రత్యేకముగా కర్మవిపాకమనే ఉన్నత గ్రంథములు గలవు. అందు చూడనగును. మాతా పితృ జాతకాది లందలి దుర్యోగములవల్లను, శిశువునకు జన్మకాలమందే మారకదశ వచ్చుటయు మౌఢ్యగత గ్రహాదశయు, వక్రగహము అయి, అస్తమయం, నీచస్థితియు, ఖలావస్థ, భీతావస్థాది హీనావస్థలుగల గ్రహదశలూ చాలావరకు మారకఫలములనే యిచ్చును. మొత్తము పన్నెండువత్సరములు ఈవిధములుగా దినమృత్యు గండములతో పూర్తి అగును ఇవియన్నియు తట్టుకున్నపుడే శేషజీవితము గడుపును. ఇందుకు మనవారు యెన్నియోవిధములుగా దోషపరిహార విధానములు చెప్పియున్నారు.

శ్లో॥ తద్దోషకాన్త్యై ప్రతిజన్మతారమా।
ద్వాదశాబ్దం జప హోమపూర్వం।
ఆయుష్కరం కర్మవిధాయ తాతో।
బాలం చికిత్సాదిభిరేవ రక్షేత్॥

అని కలదు పన్నెండు సంవత్సరముల వెళ్ళువరకు ప్రతిసంవత్సరము జన్మదివసమునగానీ, జన్మనక్షత్రమునగానీ ఒకతూరి జపదానములు ఆయుష్కరమైన ఆయుష్యహోమాదులు చేయుమని కలదు. దీనినే మనము పుట్టినరోజు అనుచున్నాము. ఊరక అభ్యంగనము, నూతన వస్త్రధారణ, స్వభోజనము, భోగిపండ్లు, సువాసినీ పేరంటములతో దోషబాధలు తొలగవు. వేదవిధిగా ఆయుష్యహోమం, రుద్రాభిషేకః జప దాన ధర్మకార్యములు, సంతర్పణాది భూతతృప్తులచేగాని తచ్ఛాంతి కలుగదు ఇందుకు ప్రమాణమిట్లు కలదు.

శ్లో॥ యే ధర్మకర్మ నిరతా విజితేంద్రియాశ్చ
యే పథ్యభోజనరతా ద్విజదేవ భక్తాః
యే మానవాదధతి యే కులశీల సీమాం
తేషామిదం కథితమాయురుదారధీభిః

అని కలదు. పంచేంద్రియ నియమముల పాటించుటవల్లను, దాన ధర్మములవల్లను, అన్నదానాది భూతతృప్తులవల్లను, దేవబ్రాహ్మణ పూజావిశేషములవల్లను, కులదేవతా పూజలవల్లను దుర్దోషములు నశించి ఆయుర్వృద్ధి కరములగును సత్కార్యాచరణములచే పునీతత్వము, ఆయుర్బ్రదతలు కలుగునని సత్పురుషుల సత్సలహాలు పరంపరాగతములుగ నున్నవి. ఈ అనుకరణ పెద్దవారూ చేయవచ్చును. ఆయుష్కాములైనవారలకు మంగళ ప్రదములగును. మరియు,

శ్లో॥ ఆయుష్కరం కర్మవిధాయతాతో
బాలం చికిత్సాధిభిరేవ రక్షత్ ॥

అని కలదు శిశువునకు వైద్యచికిత్సా విధానములవల్లను, ఆయుష్య హోమాదివిధులవల్లను గ్రహశాంతి ప్రతివత్సరము చేసి రక్షించు కొనుచుండునని పై శ్లోకార్థము. మరియు యాజుషస్మార్తానుక్రమణిక యందు 421 పేజీ (చల్లావారిది) "హోమశేషం సమాప్యాథ బ్రాహ్మణాన్ భోజయేత్తతః। స్వస్తివాచ్య ద్విజానన్నైర్ధేనుం దద్యాచ్చ దక్షిణాం। ఇత్యాయుష్య హోమః" అని కలదు ఇట్టి ఆయుష్య కర్మలచేత అరిష్టభంగము కలిగి ఆయుర్భద్రత గలుగునని స్మార్త కలాప గ్రంథములందు కలదు ఇట్టి విషయములను ప్రతివారు విధిగా గుర్తించవలయును. ఆచరించుట శ్రేయోదాయకము. గ్రహణ కాల మందలి జననములు విషఘటికా (వర్జ్య) కాలమందలి జననములు తరచు మారకప్రదములగును మరియు ధర్మశాస్త్ర గ్రంధములందు చెప్పబడిన వికృతప్రసవములు. వంశహాని, రాష్ట్రహాని లేక శిశుహాని ప్రదములగును.

శ్రీ శేషాచలేశ్వర కరుణాకటాక్ష లబ్ధ కామకాయన విశ్వామిత్ర గోత్ర పవిత్ర అశ్వలాయనసూత్ర, శ్రీరామకవచ వంశపయః పారావార రాకా సుధాకర బ్రహ్మశ్రీ రామకృష్ణశాస్త్రి, అన్నపూర్ణాంబల జ్యేష్ఠ పుత్రుడూ, జ్యోతిః కంఠీరవ దైవజ్ఞరత్న, ఆదిత్య (పద్మ) మణి బిరుద సన్మానితుడూ, సంశోధిత, జ్యోతిష, వాస్తు గ్రంథరచనా ప్రవీణ, శ్రీ వేంకటేశ్వర శర్మాభిధేయ ప్రణీతంబైన, "దైవజ్ఞ దృష్టి పథము" అను యీ గ్రంథమున ప్రథమ ప్రకరణము సమాప్తము.

# వర్గోత్తమ లగ్నములు - వర్గోత్తమ గ్రహములు

వర్గోత్తమ శబ్దమును గురించి బహుమంది రాశిలగ్నమే అంశ లగ్నముకూడ అగుటగానీ, గ్రహము రాశియందలి స్థితినే అంశ యందూ పొందుట వర్గోత్తమస్థితిగా భావించెదరు కానీ ఉత్తరకాలామృతమున చతుర్థ గ్రహభావ ఫలఖండమున ఇట్లు గలదు. (శ్లోకం 54)

శ్లో॥ స్వర్క్షోచ్చాది సుహృత్త్రికోణసహితే రాశ్యంశ వర్గోత్తమే
సౌమ్యస్సౌఖ్యకరోఽథపాప ఖచరోఽప్యేవం విధశ్చేచ్ఛుభః
యద్భేశస్థితభాంశపా బలయుతాశ్చేత్తద్భావపోలాభకృ
ద్యస్యాంశర్క్షగతోబలీ హితఖగస్స్వామ్యోపి తస్యార్థదః॥

అని కలదు రాశియందలి శుభగ్రహమేగాని, పాపగ్రహమేగాని, సుస్థానాధిపత్యమేగాని, దుస్థానాధిపత్యమేగాని పొంది అంశయందు ఉచ్ఛ, స్వక్షేత్ర, మూలత్రికోణ, మిత్రాంశాదులను పొందుటకూడ వర్గోత్తమాంశగా చెప్పబడి యున్నది. కాని, ఇది అనుభవమున పూర్ణముగా ముప్పాతిక, అర్ధము, పాదఫలప్రదములుగనే యున్నవి. ఈ భేదములవల్లను అనుభవమున రాశిస్థితియే అంశస్థితి అగుటయు, రాశిలగ్నమే అంశలగ్నమగుటయు, వర్గోత్తమాంశముగ మనోనిశ్చయము కలిగించుచున్నది. మరియు శ్రీపతిగ్రంథమున "వర్గోత్తమాశ్చర గృహాదిషు పూర్వ మధ్య పర్యంతగా శుభఫలా నవభాన సంజ్ఞాః" అనియు, మంత్రేశ్వర ఫలదీపికా నవమోఽధ్యాయముగ "వర్గోత్తమారశస్థిత ఖేచరోపి స్వక్షేత్రస్యోక్తఫలాని తద్వత్" అనియు

కలదు. ఈ శ్లోకములందు గ్రహము ఈవిధముగ నుండినగాని వర్గోత్తమాంశగాదని చెప్పబడలేదు. ఫలస్థితిమాత్రమే కలదు వెనుక అంశాచక్రవిచారణలో శ్రీ పీసపాటి నరశింహమూర్తిగారి జాతకమున కొంత వ్రాసియున్నాను ఇచట మిగతా విషయములను వ్రాయు చున్నాను. రాశిచక్రమునుండి గ్రహమును అంశలో వేయుటయందు అంత చిక్కులు రావు. సరిగా జననకాలమునకు పాదప్రవేశమగు నపుడు కొంత సందేహపడుట కలుగును సుమారుగ నాలుగైదు గడియలలో పాదప్రవేశమగుచున్నచో రాబోవు పాదప్రవేశమునే వేయుట మంచిది ఇక వర్గోత్తమ లగ్నవిషయమున అట్లుగాదు కొన్ని విఘడియలలో నవాంశలగ్న భేదములు కలుగుచుండును. ఇట్టి వర్గోత్తమ లగ్నములందు జన్మించినవారుగాని, గ్రహములు వర్గోత్తమాంశ పొందిన జాతకులుగాని కొన్ని ప్రత్యేక లక్షణము లతోగూడిన పురుషులుగను, కీర్తివంతులుగను వారి జీవితములో ఒక కాలమునకు విశేషయోగములు తప్పక పొందెదరు

ఎవరైనను వర్గోత్తమ లగ్నజాతకులుగా భావించుకొని మా జాతకమున ఈ ఫలితములు కలుగలేదనగా వారి వర్గోత్తమలగ్నమే తప్పని తెలుపును. వెనుక అంశగనో, ముందు అంశగనో భావించ వలసియుండును ఇక అంశమందలి గ్రహము యోగించలేదనగా అంశయందు షష్టాష్ట వ్యయాధిపతుల యోగముగాని, శత్రుగ్రహ సంయోగములుగాని సాధారణముగా కలిగియుంటవి. మరియొక్క ముఖ్యవిషయము రాశియందలి నీచస్థగ్రహము, నీచవర్గోత్తమాంశను కూడ పొందిన అశుభ ఫలప్రదములగును. రాశియందు ఉచ్చస్థితితో బాటు అంశయందు ఉచ్చవర్గోత్తమాంశ పొందినచో రాజయోగ

ఫలములనంతములుగా కలుగును. ఈ దిగువ వర్గోత్తమ లగ్నమును చూడగోరెదను. స్వస్తిశ్రీ రౌద్రినామ సంవత్సర ఆషాఢ బహుళ త్రయోదశి బుధవారం అస్తమయాది ౨౦ ఘడియలకు సరియగు రాత్రి గం 2-33 ని.లకు ఆర్ద్రా నక్షత్రమున జననం 1920-7-14 తేదీలు జన్మకాల రాహుదశా శేషం 5-6 21 రోజులు.

| | | | |
|---|---|---|---|
| | కే | ల | ర చ |
| | రాశి | | బుగుశ |
| | వృషభము | | శ |
| | | కు రా | |

ఇవి ప్రముఖ వీణావాద్యకులు శ్రీ అయ్యగారి సోమేశ్వరరావుగారి జాతకము మొన్నటివరకు గుంటూరు జిల్లా బాపటయందు చాలకాలముగడపి నారు. ఇటీవలశనిదశాగుర్వంతమందు 1959-12-31 విజయవాడ సంగీత కళాశాల యందు వీణా ప్రొఫెసరుగ నియుక్తులైనారు. బహు సన్మానములు పొంది, చాలా రేడియో ప్రోగ్రాములు యిచ్చి సంగీతలోకమున మంచి పరిచయగౌరవాదులు సంపాదించుకున్నారు. వీరి జాతకమున రాశిలగ్నమునందు, అంశ యందు వృషభలగ్నమై వర్గోత్తమలగ్నమైనందున ఇట్టి కళాప్రముఖులైనారు. చంద్ర శుక్రులు మినహాయించగా శ్రీ పీసపాటి నరశింహమూర్తి జాతకము, వీరి జాతకము చాల సన్నిహితము పొందినవి వారు నాటక కళాప్రముఖులుగను, వీరు సంగీత వీణావాద్యప్రముఖులు అయినారు ఒకరు నోటిమెళుకువతో, మరొకరు చేతిమెళకువతోను ప్రముఖులైనారు. వీరి జాతకమున కుజుడు వుచ్చాంశ పొంది శుభ ఫలప్రదాత అయినాడు. ఉత్తరకాలామృతమున శుక్రకారకత్వ ఖండమున 128 శ్లోకమునందున్న మొదటి పాదమునందలి "వీణావేణు వినోద చారుగమనాష్టైశ్వర్యచార్వంగతా" అని చెప్పినటుల శుక్రుని

వర్గోత్తమాంశ లగ్నఫలములే వీరికి కలిగినవి. నాల్గవ పాదమందలి "గాంభీర్యాతిశయ స్తత శ్చతురవాద్యం నాటకాలం కృతిః" అనుటచే శ్రీ నరసింహమూర్తిగారికి వర్గోత్తమాంశలగ్నము గాకపోయినను, వర్గోత్తమాంశ, శనిబలముచేతను లగ్నాధిప శుక్రుడు. వర్గోత్తమాంశ పొందినందునను ఈవిధముగా నటనాగ్రముఖ్యులైనారు. ఇట్టి కారణములచే (1) లగ్నములు వర్గోత్తమాంశగానీ (2) లగ్నాధిపతి వర్గోత్తమాంశగాని (3) ఇతర గ్రహములు వర్గోత్తమాంశలు పొందుటగాని యీ త్రివిధకారణములచే గొప్పవారగుదురని అర్థమగుచున్నది మరియొక జాతకము చూడుడు. ఇది ఛత్రపతి శివాజీ జాతకము

1627-4-25వ తేదీలకు సరియగు ప్రభవ సం॥ర వైశాఖ శుద్ధ పంచమీ మంగళవారం ఉదయాది ౨-౩ ఘడియలకు జననం 1680-4-5 సరియగు సిద్ధార్థి సం॥ చైత్రపూర్ణిమ భానువాసరమున పగలు పదునైదు ఘడియలకు నిర్యాణమొందిరి. అప్పటి జాతకమిది ఆర్ద్రా నక్షత్రము. వృషభలగ్నము.

| | | | |
|---|---|---|---|
| | రబు | ల | చం |
| కుజ | రాశి | | రా |
| కే | వృషభము | | |
| | గు | | శ |

ఇతను యెట్టివీరుడైనది హిందూ జాతికే గర్వకారణము. రాశ్యంశలు రెంటియందు వృషభలగ్నమై నందునను, వర్గోత్తమలగ్నమై. గురువుకూడ వర్గోత్తమాంశ గ్రహమైనందున ఇట్టి యోగములచే ప్రసిద్ధి పొందియున్నారు "చంద్రేణ గౌర్యాం" అనుటచే చంద్ర లగ్న బలాదులచే ఇతను భవానీ

(గౌరి) భక్తుడైనాడు. ఇది మహాకవి గడియారం వేంకటశేషశాస్త్రిగారి శివభారతమునుండి ఆధారముగ తీసుకోబడినది. ఇక శివభారత గ్రంధ రచయితలైన శ్రీ శేషశాస్త్రిగారి జాతకమునందలి వర్గోత్తమాంశ గ్రహ బలము చూడవచ్చును 1894-4-6న విజయ సం॥ ఫాల్గుణ బహుళ అమావాస్య శుక్రవారం ఉదయాది నాలుగు ఘడియలకు రేవతీ తృతీయ చరణయుక్త మేష లగ్నమున జననము. ఈరోజున సూర్య గ్రహణము కలదు. 8-4-3 రోజులు జన్మకాల బుధ దశాశేషము. అమావాస్య జననమైన లోకములో యేమేమో అనుకొందురు అది యెంతవరకు నిజమైనది వీరి జాతకము తెలుపుచున్నది. వీరి జాతక చక్రము చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| రచ రా | ల | గు | |
| బుశు | రాశి మేషము | | |
| కు | | | |
| | | శ | కే |

రాజ్య లాభాధిపతియైన శని రాశియందు ఉచ్చగతుడై అంశయందు వాక్స్థానమున వర్గోత్తమ స్థితికలిగి విశేష యోగకరులైనందునను, రాశి యందలి శుక్ర శనుల పరివర్తనా యోగము స్వల్ప తారతమ్యముతో అంశయందు కలిగి వుండుటచే వాగ్ధారతోగూడిన కవితాసుధాధారను పొందినారు ఇట్టి శుక్ర శనుల పరి వర్తనాయోగమును (౪) వర్గోత్తమ పరివర్తనాయోగ మనవచ్చును. రాశియందు రేవతీ తృతీయ చరణమందేయున్న రవిచంద్రులు అంశ యందు రాశి వేరైనను, ఏకత్రస్థితిచే (౫) దీనిని ఏకపాదరాశి సంయోగ వర్గోత్తమాంశగా పేర్కొనవచ్చును. వీరి జాతకమున యిట్టి వర్గోత్తమాంశ గ్రహమైన శని బలముచే వీరు "రాహు భాస్కరి

జీవాస్యుః అంత్యభాగ ఫలప్రదాః" అను న్యాయముగా ఈ భుక్తి అంతమందు "భుక్తౌ కేంద్రపతే శ్శుభం" అని వుండుటచేతను, ఇటీవల (19[illegible])లో రాహుదశా శన్యంతరకాలమున M.L.C.గా గవర్నరుచే నియుక్తులైనారు శాసనపరిషత్తుకు ఈవిధముగా పలు రకములైన వర్గోత్తమాంశ భేదములచేత మానవులకు మహా యోగములు, శక్తులు కలుగుచున్నవి మరొకజాతకము చూడగోరెదను. 1881-6-17న శ్రీ సర్వజిత్ సం॥ర జ్యేష్ఠ బ॥ ఏకాదశి గురువారం ఉదయాది ౨౩ ఘడియలకు జననం 15-9-28 జన్మకాల శుక్రదశా శేషము—

| | | | |
|---|---|---|---|
| | చం | కు | రబు |
| | రాశి | | రాహు శ |
| కే | తులా | | |
| | | లగు | |

ఈ జాతకము నెల్లూరునందలి ప్రముఖ న్యాయవాదులు, శ్రీ తూములూరి శివరామయ్య B.A., B.L గారిది నెల్లూరు ప్రాంతములందు వీరికున్న కీర్తిప్రతిష్ఠలు మరొక న్యాయవాదికి లేవనుటలో అతిశయోక్తిగా నేరదు. వీరి జాతకమందలి విద్యా, భూస్థానాధిపత్యములుగల శని అంశయందు విద్యాభావాధిపతియై, వర్గోత్తమాంశ కారణమున ఉన్నత విద్యాయోగము, సిరిసంపత్తులు, బహుసన్మాన యోగములు కలిగించెను. ఈవిధముగా బహుయోగములు ఒక్కొక్క జాతకము పరిశీలించినకొలది కన్పడుచున్నవి. ఈ భేదములు నాకు తోచినవరకు వ్రాసితిని. మిగతా యోగములు మీరును కృషి చేయవచ్చును. విజ్ఞానమే ప్రధానము. ఉత్తరకాలామృతమున చెప్పినట్లు చూడవలయునన్న ఏ జాతకమునకైన అంశయందు ఉచ్ఛ మూల

త్రికోణ, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర స్థితులు సహజములుగానే ఉంటవి గ్రహములకు మరి వీరందరు వర్గోత్తమాంశ ఫలవిశేషయోగము అనుభవించుచున్నారా? అనే ప్రశ్న కలుగుచున్నది. అన్ని గ్రహములు అంశయందు శత్రుక్షేత్ర, సమక్షేత్రము లందుండుట చాలా అరుదు. ఇట్టివాడు జన్మించినపుడు యే హిరణ్యగర్భాది రాక్షసాంశ గలవాడో కావచ్చును. కాన కాలామృతమందలి వర్గోత్తమాంశ నిర్ణయములకన్నను నేను నిర్ణయించిన ఫలితములు చాలా జాతకములపై యోగవంతములుగనున్నవి. రాశియందలి దుస్థానాధిపత్యగ్రహయులు అంశయందు వర్గోత్తమాంశస్థితిచే శుభఫలప్రదము అగును. దశానాధుడు దుష్టఫలదాతయైనపుడు యీ దుస్థానాధిపత్య వర్గోత్తమాంశ గ్రహము కొన్ని సుఫలిత దుష్ఫలితముల నిచ్చును. మారకము చేయును దీనావస్థ భీతావస్థ వికలావస్థాదులు పొందిన గ్రహము. వర్గోత్తమాంశ పొందినను దుర్యోగప్రదమే కాగలదు.

## కొన్ని తమిళ జ్యోతిష సూక్తులు

1) ఉచ్చనై ఉచ్చన్ పార్తాల్ ఖండిపాహ భిక్షైయెడుప్పాన్
2) కెట్టవన్ కెట్టానాగిల్ కిట్టుడుం రాజయోగం
3) నీచనింద్రరాశినాథన్ అట్టి ఉచ్చమేడిదిల్ రాజయోగం
4) నీచనింద్రరాశినాథన్ కిట్టుడుం రాజయోగం

ఈ తమిళ జ్యోతిష సూక్తులు ఆ దేశములో అనేకమందికి వాడుకలో వున్నవి. వారు చెప్పిన అనుభవ సారాంశములనుబట్టి పరిశోధనాత్మకంగా ఆంధ్రదేశములో ప్రముఖమైనవారి కొన్ని జాతకములు పరిశోధించి యీ గ్రంథములో చేర్చుట జరిగినది అనుభవానికి సరి

పోతున్నందున విశ్వసించుట జరిగినది యీ సూక్తులు ఆంధ్రప్రాంత జ్యోతిష గ్రంథాలలో కనుపించవు. మన ప్రాచీన జ్యోతిష గ్రంథాలలో వున్నట్లుగా కనుపించవు. వుంటే అట్టి గ్రంథములు యింత వరకు చూడలేదు.

## కేంద్ర నీచస్థితి - క్షీణచంద్ర యోగములు

ప్రథమమున నీచభంగ రాజయోగపద్ధతులలో యేదో ఒక విధముగ దోషపరిహారమును విధిగా చూడవలయును. అట్టి దోష పరిహార శ్లోకములలో యే ఒక్క విధమున భంగము కలుగనిచో దుష్యగ ఫలప్రదమగును "స్వనీచభవనే వక్రీబలం తుంగజం" అని యున్నందున నీచరాశియందు వక్రించిన గ్రహము పరమనీచభాగలు అతిక్రమించి పునః వక్రత్వమందినచో నీచఫలములనే యిచ్చును. అపుడు నీచభంగ రాజయోగములు వుండికూడ వ్యర్థమగును. తన నీచరాశియందే వున్న ఉచ్చస్థ గ్రహసంయోగము వ్యర్థమగును. పరమనీచభాగయందుగాని అంతకుపూర్వమందుగాని వక్రించినపుడే ఫలవరితములగును. సుస్థానాధిపత్యముగల శుభగ్రహ దృష్టిగాని. సుస్థానాధిపత్యముగల తన మిత్రగ్రహ దృష్టిగాని కలిగినపుడు మాత్రము తన పరమనీచ భాగానంతర వక్రత్వదోషము పట్టదు, ఇటులనే పరమోచ్చభాగానంతర వక్రగ్రహము అతిశుభకరము పూర్వ వక్రత్వమువెనుక రాశిఫలముల నిచ్చును. ఉచ్చఫలమీయదు ఇట్టి గ్రహముపైనకూడ సుస్థానాధిపత్యములుగల మిత్రగ్రహదృష్టి, సహజ శుభగ్రహదృష్టులును ఫలప్రదములగును ఒకపుడు కేవల పరివర్తనా యోగములవల్లనే రాజయోగఫలములు కలుగును కేంద్రములందున్నపుడు జాతకానుభవసారే దశమభావవిచారే

శ్లో॥ లగ్న ద్విత్రి చతుర్థైకాదశభాగ్యగతా శ్శుభాః
షష్ఠాష్టమవ్యయే నీచదశా నైచ్యవిధాయినీ

అని కలదు. లగ్నాదిగా 1-2-3-4-11-9 స్థానములందలి నీచ గ్రహదశలు శుభయోగప్రదములనియు 6.-8-12 స్థానములందలి నీచస్థగ్రహదశలు అవయోగప్రదములనియు కలదు శుభాధిపత్యములుగల నైసర్గిక శుభ. పాపగ్రహములు 6-8-12 రాసులందు నీచస్థితిచే దుర్యోగమేను. ఇదే స్థానమున వీరు వక్రించిన శుభత్వము కలుగును. కేంద్రములందలి నీచగ్రహములు నీచభంగములు పొందకనే శుభాధిపత్యములుగల నైసర్గికశుభుల సంయోగ విలోకనాదుల వల్లను శుభాధిపత్య పాపులగు మిత్రగ్రహములవల్లను రాజయోగము కలుగును. నైసర్గికశుభుడు (6-8-12) అధిపత్యపాపిగా కేంద్రములందుండి నీచగ్రహమును చూచినను, ఈ కేంద్ర నీచస్థదశ దైన్యయోగమే కలిగించును. ఈ ఆధిపత్యపాపియైన శుభునిపై ప్రబల శత్రువీక్షణ సంయోగములు కలిగి. ఇట్టి శత్రుగ్రహము, దశానాధుడైన నీచస్థకేంద్రగ్రహమునకు మిత్రుడైనను, శుభత్వమే కలిగించును. పై శ్లోకమున నవమలగ్నకోణములేగాని. పంచమకోణము చెప్పబడలేదు కాని ఉత్తరకాలామృతమున చతుర్ధ భావఫల ఖండమున ౨౩ శ్లోకమందలి "పాపా నీచగతాశ్శుభయుతాః కేంద్ర త్రికోణ స్థితాః" అను చరణమువల్ల 1-5-9 కోణములుగూడ గ్రాహ్యములగును. వెనుకటి శ్లోకమునందలి 2-3-11 స్థానములు ఈ శ్లోకమున లేవు. కాని త్రిషడాయ గతాః పాపాః" అను న్యాయముగ ఈ గ్రహములు యోగవంతములగును గాన మొదటి శ్లోకమును తప్పక తీసుకొనవచ్చు? ఈ 6 8-12 భావాధిపతులే కేంద్రకోణములందుండి లగ్న,

చతుర్థ, దశమాధిపతులు షష్ఠాష్టమవ్యయభావగతులైనపుడు దుర్యోగ ప్రదమగును యిందుకు ప్రమాణం :

శ్లో॥ ఛిద్రారివ్యయనాయకాః ప్రబలగాః కేంద్రత్రికోణాశ్రితాః
లగ్నవ్యోమచతుర్థభావపతయ షడ్రంధ్ర రిప్ఫస్థితాః
నిర్వీర్యాః విగతప్రభాయది తదా దుర్యోగ యేవస్మృతః॥

అని మంత్రేశ్వర ఫలదీపికా షష్ఠోధ్యాయమున గలదు. ఈవిధముగా కేంద్రములందలి నీచభంగరాజయోగములను బాగుగా పరిశీలించవలయును మరికొన్ని నేను వ్రాసియుండకపోవచ్చును దైవజ్ఞులు సందర్భమునమసరించి సవరించుకొందురుగాక. ఇంతవరకు కేంద్ర కోణాదులందలి నీచగ్రహముల విచారించితిని. ఇక క్షీణచంద్రి విచారణ చూతము. ఈ క్షీణచంద్రి దోషము ముహూర్తభాగము నందుమాత్రము దోషముగాని, జాతక భాగాదులందు శుభయోగ ప్రదముగానే ఉంటున్నది. ఈ అనుభవములను చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| | | | |
| కే | రాశి కటకం | | లర కుశు |
| | | | చబు రా |
| | | గు | శ |

స్వస్తిశ్రీ రుధిరోద్గారి సం॥ ఆషాఢ బహుళ అమావాస్య ఆదివారము ఉదయాది ౫౮-౭౨ ఘడియలకు పుష్యా ప్రథమచరణయుక్త కర్కాటక లగ్నమున జననము 1923-8-12/13 తేదీలు 5-7-16 రోజులు కేతు దశా శేషం. ఇది నా జాతకము.

ప్రస్తుతము నాకు (ఆనాడు) చంద్రదశయే జరుగుచున్నది. క్షీణచంద్రుడైకూడ శుభుడుగనేయున్నాడు చంద్రదశా గుర్వంతరమున రాహు కేతువులు అను గ్రంథము వ్రాయుటయు, తిరుపతి, కంచి మొదలైన దక్షిణదేశయాత్రలు కలిగినవి. తిరిగిఇపుడు(1960)

చంద్రదశాశన్యంతరకాలమున ఈ గ్రంథమును వ్రాయుట కలిగినది. ఇప్పుడూ యాత్రాదృష్టితోనే యున్నాను. ఇటీవల శ్రీశైల దర్శనము కలిగినది. (రుద్రయాగ కాలమునందు) ఇకముందు ఈ క్షీణచంద్ర దశయోగ ప్రదమేనని నా ఆత్మవిశ్వాసముకూడను పూర్వము సన్నని దేహముగల నేను జలరాశి జననమూ జలతత్వగ్రహదశ అయిన కారణమున కొంచెము స్థూలశరీరముకూడ అబ్బినది. మరొక ప్రముఖ జాతకము చూడవచ్చును. శ్రీ విజయ సం॥ర ఫాల్గుణ బహుళ అమావాశ్యలు శుక్రవారం ఉదయాది నాలుగు ఘడియలకు 1894-4-6 తేదీ మహాకవి శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారి జాతకము వెనుక

| | | | |
|---|---|---|---|
| ర చం రా | ల | గు | |
| బుశు | రాశి | | |
| కు | మేషం | | |
| | | శ | కే |

వర్గోత్తమవిచారణయందు వీరి జాతక పూర్తి వివరములు ఇచ్చి వున్నాను కూడను చతుర్థాధిపతి (హృదయాధిపతి) చంద్రుడు క్షీణుడయివందున విద్యావిహీనతగాని. హృదోగ్రాదికములుగానీ కలుగలేదు. ఇందుకు వ్యతిరేకమైన శుభలక్షణములే కలవు లోకవిదితము. "బుధః పాపయుతః పాపః క్షీణచంద్రస్త్వథైవచ" అను న్యాయముగానూ, క్షీణత్వమూ పాపియైన రవి సంయోగము కలిగి, పాపుడయిన చంద్రుడు పాపియై "కేంద్రకోణాధిపతయో రైక్యతే యోగకారకౌ" అను న్యాయముగా యోగవంతుడై అనంతశుభయోగములూ, గజారోహణాది మహత్తర సన్మానములన్నియు కలిగినవి. చంద్రదశకూడ యోగమే కలిగించినది. అష్టావధానాదులు అధికముగా చేసిరి. ఈ కాలమునందు క్షీణచంద్ర ఫలముగానీ, వ్యయస్థాన ఫలముగానీ వీరికి పట్టలేదు ఇట్టి అనుభవములను చూడగా క్షీణచంద్ర దోషము జాతకాదులందు పట్టదని విశ్వాసము. ఇట్టి క్షీణచంద్రుడు

షష్ఠాష్టమాధిపతుల సంయోగ విలోకనములుగానీ, 6-8-12 భావ స్థితి కలిగిననూ, ప్రబల పాపుల దృష్టివల్లనూ తాను దుస్థానాధిపతియై దుర్బలుడైన జలతత్వరోగములనూ, క్షయరోగాదులను కలిగించును లేనిచో శఠత్వమే కలుగును. తదితర కారణములు వుండవచ్చును. దైవజ్ఞులు సమయస్థితి గుర్తించుచుండవలెను యెప్పటికప్పుడు పై నిర్ణయములతోనే అవకాశవాదన చేయవద్దని తెలుపుకొనుచున్నాను.

## కేంద్రమందలి ఉచ్ఛగత సమసప్తక శత్రుగ్రహ ఫలములు

తమిళ సూత్రము :- "ఉచ్ఛనై ఉచ్ఛన్ పార్తాళ్"

రవి - శనులు నైసర్గిక పాపగ్రహములుగాన, సమసప్తక కేంద్రములందు ఉచ్ఛస్థులయినపుడు, వీరి దశలందు లేక వీరి సంయోగ విలోకనాదులుగల గ్రహ దశలందుగానీ సంపూర్ణారిష్ట యోగములనంతములుగా కలుగును ఇట్టి రవి-శనులలో యే ఒక్కని పైనగానీ, తనకు నైసర్గిక మిత్రుడైన శుభాధిపత్య పాపునియొక్క గానీ నైసర్గిక శుభుడయిన శుభాధిపత్యముగల శుభగ్రహదృష్టిగానీ, సంయోగముగానీ కలిగినపుడు ఈ యోగము పట్టదు. కానీ అనంత కష్టములు కలిగి తదుపరియోగము కలుగును రవి-శనులచే కలిగే ఈ యోగము మేష, కటక, తులా, మకరరాశి జననములు గలవార లకే యెప్పటికైనా కలుగును ఇందు జన్మించిన రాజాధిరాజయినా, కోటీశ్వరుడయినా, అతిదరిద్రతా హీనయోగములు తప్పక పొందును. పై నాలుగు లగ్నములకూ 1-7 లేక 7-1 లేక 4-10 లేక 10-4 కేంద్రములందు రవి-శనిలుండుట కలుగును. ఇతర లగ్నములకు ఇట్టి పాపగ్రహస్థితి కలుగదు ఉదా॥ మేషలగ్నమునకు సప్తమస్థిత

శనియూ, దశమయందలి కుజుని (మకర) ఉచ్చస్థితి అపయోగము కలుగదు, శుభయోగమేను సమసప్తక కేంద్రోచ్చస్థితిగాక, భిన్న కేంద్రోచ్చస్థితి అగును. విశేషమేమనగా పరస్పరదృష్టి లేకపోవుట మేను. ఇందుకు ఉదాహరణ. వెనుక క్షీణచంద్ర విచారణయందు వ్రాసిన మహాకవి గడియారం వేంకటశేషశాస్త్రిగారి జాతకమందలి శని-కుజుల చూడవచ్చును. మరియొక ముఖ్యవిషయము. నైసర్గికముగా ఒక గ్రహమునకు మరొకగ్రహము పూర్ణశత్రువయిననూ, తిరిగి యీ రెండవ గ్రహమునకు మొదటిగ్రహము సముడుగా వచ్చును. అపుడు ఈ దుర్యోగము పట్టుకొనడను ఇక సమసప్తక కేంద్రోచ్చస్థితిగల నైసర్గిక శుభుల జాతము ఇటి యోగము కన్యా బుధుడు మీన శుక్రులవల్ల కలుగును. ఈ యోగము మిధున కన్యలూ, ధనుర్మీన జాతకములకే కలుగును. ఈ యోగము అఖండ యోగ ప్రదమేను కేవలము రవి శనుల సమసప్తక కేంద్రోచ్చస్థితివల్లనే పై దుర్యోగము కలుగును అనేది నిశ్చయం ఇతర లగ్నములకు ఇట్టి రవి-శనుల సమసప్తక కేంద్రోచ్చస్థితివంటిది రానేరదు. మరియు జ్యోతిషార్ణవ నవనీత గ్రంధమున చెప్పిన "ద్విగ్రహౌత్చేతు సామంతః" అను శ్లోకము ఇట్టి రవి-శనుల సమసప్తక ఉచ్చస్థితిగల కేంద్రస్థితి ఫలవిషయమున వ్యర్థమగును. మహాదుర్యోగమగును. మంత్రేశ్వర ఫలదీపికా సప్తమోధ్యాయమున ఇట్లు కలదు.

శ్లో॥ ద్వౌవాత్రాద్యాదిగ్బలయుక్తా యదిజాతః
క్ష్మాభృద్వంశే భూమిపతిః స్యాజ్జయశీలః
(హిత్వామన్దం) పంచఖగా దిగ్బలయుక్తా
శ్చత్వారో వా భూమిపతి రన్యాన్వయజోపి

అని కలదు స్థానాది షడ్బలయుక్తులయిన రెండుగానీ, మూడుగానీ, నాలుగుగానీ అయిదుగానీ గ్రహములు ఉచ్చగతులయినపుడు రాజ వంశీయుడు చక్రవర్తిగనూ, సామాన్యవంశీయుడుగూడ రాజుగనూ అగుదుర: అని తెలుపుచున్నది. కాని పై శ్లోకమున "హిత్వామందం" అనుటలో శనిమాత్రము పై ఉచ్చగ్రహములలో ఒకడుగా వుచ్చస్థు డగుట పనికిరాదని తెల్చిచెప్పినందున, నేను వ్రాసిన రవి-శనుల సమసప్తక కేంద్రస్థితియందలి ఉచ్చత్వ నిషేధమును ఈవిధముగా బలపరచుచున్నదికూడను. (మరియు వెనుక వర్గోత్తమాంశ విచారణ యందు మరచిన ఒక విషయము జ్ఞాపకము వచ్చినందున ఇచట వ్రాయుచున్నాను. రాశియందున్న గ్రహము అంశాచక్రమునను అదే రాశియందుండుట వర్గోత్తమాంశ అగును అనే విషయము

| | | | |
|---|---|---|---|
| శుబు | ర | | |
| కే | | | ల గుచం |
| కుం | | | రా |
| | | శ | |

జాతక చంద్రిక బలపరచు చున్నది అని తెలుపుచున్నాను). ఈ జాతకము చూడుడు సృష్ట్యాదిగా 28వ త్రేతా యుగమున స్వస్తిశ్రీ సుభాను సంవత్సర చైత్రశుద్ధ నవమీలు శనివారం పునర్వసు నక్షత్ర చతుర్థ చరణయుక్త కర్కాటక లగ్నమున జగదభిరాము డయిన శ్రీరామచంద్రమూర్తి జననం. రవి శనుల కేంద్రోచ్చస్థితి కలదు. ఇందుచేతనే శ్రీరాముడు బహుక్లేశములు పొందినట్లు జ్యోతి శ్శాస్త్రాధారముగ కన్పడుచున్నది. దశమ కేంద్రమందలి రవిపై శని-కుజుల దృష్టియున్నందున · శని బలప్రయోగముతో గూడిన కైకేయీ వరప్రదానదండనచే అరణ్యసంచారము రాజ్యాపట్టాభిషేక విఘాతము కలిగినది. ఇక కర్మాధిపతియైన కుజుడు వుచ్చస్థుడైన గురుబలము పొంది మిత్రుడైన రవిని చూచుటచేత హనుమంత,

సుగ్రీవ, విభీషణాది మిత్రబలముచే తిరిగి రాజ్యసంపాదనయూ కలిగినది. ఈ కాలమున రాహు-కేతువులు జ్యోతిశ్శాస్త్రఫలభాగమున తీసుకొనబడలేదుగాన, రాముని జాతకమునలేదు. కొందరు వ్రాశారు. శ్రీరామచంద్రమూర్తికి సుఖమనునది బాల్యాది పట్టాభిషేక విఘాత తుది ఘడియలవరకే యున్నది. అపైన తాతా అల్పముగాయున్నది. పట్టాభిషేక విఘాతము తదుపరి అరణ్యవాసము. పత్నీ వియోగముతో బహువర్షములు దుఃఖక్లేశముల జంట పారితంతమయి, రావణ కుంభకర్ణ హననముతో పూర్తి అయినదని అందరమూ బావించెదము. ఇది నిజముగాదు. పట్టాభిషేకానంతరం కొలది కాలమునకే రజకదంపతుల కలహకారణమున కలిగిన అపనిందాభయముచే రాముని ఆగ్రహమునకు గురియైన జానకి - వాల్మీకాశ్రమాది చేరికతో, తిరిగి పత్నీ వియోగమునూ, ఆశ్రమమున పుత్రోత్సవమైననూ, పుత్రదర్శన భాగ్యహీనతాది వ్యధయూ, పత్నీభాగ్యము కలిగికూడ పత్నీహీనముగ బంగారు ప్రతిమతో అశ్వమేధ యాగారంభమూ, లవ కుశలచే యాగాశ్వ హరణమై, యాగభంగ క్లేశమూ, తుదకు పుత్రులతో యుద్ధమునకు పాల్పడి పుత్రదర్శన, కళత్రదర్శనములు క్షణికముగా యుండి, రాముని పరీక్షాదృష్టికి నిలబడలేక, హృదయవ్యధను భరించలేక సీతామాత భూగర్భ ప్రవేశము చేయుటయు, రాముడు ఇక నిర్వేదనాభావముతో పుత్రులకు పట్టముగట్టి తాను సరయూ నదీ గర్భమునచేరి అవతార వివరణ చేయుటయు కలిగెను. ఇవి అన్నియూ చూడగా శ్రీరామమూర్తి శాంతగంభీరమూర్తిగ లోకముచే పైకి చూడబడుచున్ననూ, రాముని హృదయమున అగ్నిపర్వత తుల్య మనో వేదదలు సాగర గర్భమందలి తిమింగలాదులవలె ప్రక్షిప్తములుగ యున్నదని ఈవిధముగా ఋజువగుచున్నది. రాముని జాతకమున

హృదయస్థానమందలి (చతుర్థకేంద్రము) ఉచ్చగత శనిపైగల రవి క్రూరదృష్టియే కారణము. ఇక దైవజ్ఞులూ పౌరాణికులు యేవో కొన్ని వాదనలు చేయవచ్చును ఇచటను. ఇతను త్రేతాయుగమువాడని భావించినచో, కలికాలములో ఈరోజువరకు జీవించియుండి రవి-శనులు పరస్పర సమసప్తక ఉచ్చగల ఈ జాతకము చూడుడు. స్వస్తిశ్రీ దుర్ముఖి నామ సంవత్సర వైశాఖ బహుళ త్రయోదశీలు ఆదివారం రాత్రి నాలుగు గంటలకు 1896–5–10 తేదీ జననము. అశ్వినీ తృతీయ పాదము. కేతుదశాశేషం 2–10–17 రోజులు.

| | | | |
|---|---|---|---|
| కు | ల ర శ చ | బు | |
| రా | రాశి మేషము | | గు |
| | | | కే |
| | | శ | |

విజయవాడ తాలూకా పోరంకి గ్రామం శ్రీమాన్ వేదాంతం శ్రీనివాసాచార్యులుగారిది. ప్రస్తుతం 1960లో వీరు బాపట్లయందు శ్రీభావన్నారాయణ స్వామి దేవస్థాన వేదపాఠశాలాధ్యాపకులుగా నున్నారు ఆదియందు వీరికి యేబదియకరముల దివ్యమైనభూవసతి కలిగియున్నది. రవి, చంద్ర దశలందు క్రమముగా ఈ భూవసతి అంతరించిపోయి ప్రస్తుతము ఐదు యకరములు మాత్రము మిగిలినది. వీరికి మిగిలినది యెవరూ దోచుకొనలేని వేదాభ్యయనమే చతుర్థమంటున్న అధిపత్యపాపి గురుదశయు రాలేదు కేంద్రస్థానముల సమసప్తక ఉచ్చస్థితిగల రవి శనులే ఈ యోగమునకు కారకులైనారు. "ద్విగ్రహోచ్చేతు సామంతః" అనునది ఈ విధముగా వ్యర్థమైనది. ఇక కళత్రము సదా రోగపీడితురాలు. కుజుని అష్టమవీక్షణము శనిపై యున్నందున (శత్రుదృష్టి) కళత్రమారకము చేయలేదు. ఉచ్చస్థుడైన గురువుపై ఉచ్చుడైన శనివీక్షణము పడినందున గురు

బలము హీనమైనది. పాపునిపై శుభవీక్షణ యెంతవచ్చునుగాని. శుభునిపై పాపవీక్షణము దోషకరము. "కేంద్రస్థానం తు వైష్ణవం" అని కలదుగాన రవి, శనుల ఉచ్ఛస్థితి క్రూరవేధలవల్ల విష్ణుశక్తి తగ్గిపోవునుగాన అమంగళములకు మూలమగుచున్నది ఈవిధముగాను

## రవి-శని సమసప్తక నీచగ్రహ రాజయోగములు

| | | | |
|---|---|---|---|
| గు (R) | శ (R) కే | | |
| శు | రాశి కటకం | | ల/ |
| | | | |
| | బు శు | రరా | చ |

S.C.R రైల్వే ఇంజనీరు శ్రీ బొమ్మకంటి గోపాలక్రిష్ణమూర్తి గారి జననం. ప్రస్తుతనివాసం విజయవాడ దగ్గర గొల్లపూడి. 1939-11-8న రాత్రి గం. 10-45 నిమిషములకు జననం C/o (లేటు) కూచిపూడి సుబ్బారావుగారి గృహము. D. No. 2-10, ఫోన్-413549 ప్రమాదినామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశిలు బుధవారం హస్తా నక్షత్ర తృతీయ చరణయుక్త కర్కాటకలగ్న జననం. చంద్రదశాశేషం షుమారు 3-9-27 రోజులు. వీరు చిరకాలపరిచితులు వీరి కుటుంబ జాతకాలు వగైరా, నా ద్వారానే వివాహాదులు, ఉద్యోగాదివిషయాలు చూడబడుతూ వుండేవి. వీరి జాతకముతో శనిదశలోని రాహ్వంతరములోనే (1999) గొల్లపూడిలో నూతన గృహనిర్మాణం చేశారు. నేనే ముహూర్తనిర్ణయాలు వగైరా చూచినాను. చక్కని ఆదర్శదాంపత్యం సత్సంతాన సౌభాగ్యాలతో వారివారి ఉద్యోగాలతో అంతా సంతోషమయంగానే వున్నది. యిటీవలనే వీరుకూడ 1999లోనే పదవీ విరమణ చేశారు. సంసారం సుఖజీవనం చేస్తున్నది రవి శనుల ఉచ్చస్థ జాతకమునకూ, రవి

శనుల నీచస్థ రాజయోగములకున్న భేదము స్పష్టముగా ఫలాను భవముగా దృశ్యమవుతున్నది. తమిళ జ్యోతిష సూత్రాధారముగానే ఈ జాతకమును సేకరించాను

## సమసప్తక నీచగ్రహ రాజయోగము

## శ్రీ పాదవారు - రాజమండ్రి

తమిళ సూత్రము: "నీచ నిండ్రి రాశినాథన్ కిట్టుడుం రాజయోగం" రెండు గ్రహములు పరస్పర సమసప్తకముగా, నీచరాసులలో వుంటడం మహారాజయోగముగా వుంటుంది. యిట్టి జాతకులు విశిష్ట మైన వ్యక్తులుగా రాష్ట్రస్థాయిలో భారతదేశస్థాయిలో అత్యంత ప్రముఖులవుతారు అనేక ఘనసన్మానములు, భోగభాగ్యములు పొందుతారు. లక్ష్మీసంపన్నులుగా కీర్తివంతులుగా, పత్యజపత్యు లుగా రాణించుతారు పై సూత్రము తమిళ దైవజ్ఞులకు బహుళ ప్రచారములో వున్నది యిట్టి సూత్రము మన తెలుగు సంస్కృత జ్యోతిషగ్రంధాలలో వున్నట్లుగా కనుపించదు నీచలో వక్రగ్రహ స్థితి వక్రగతి ఉచ్చగ్రహ సంపర్కముతో నీచగ్రహ భంగము. మరికొన్ని నీచభంగ రాజయోగముల వివరణలూ వున్నవి సమసప్తక నీచగ్రహ రాజయోగము చెప్పబడిలేదు. నా పరిశీలనలో కనుపించ లేదు ఈ యోగముగురించి కొన్ని ఉదాహరణలు చూడగలరు.

| | | | |
|---|---|---|---|
| కే | | | ల/చ |
| | రాశి | | కు |
| గు | మిధునం | | |
| | బు శు | రశ | రా |

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవి పండితులు మహామహోపాధ్యా యులు మహాకవులు శతావధానులు (లేటు) శ్రీ త్రిపాఠి కృష్ణమూర్తిశాస్త్రి గారి జననం. క్షయనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ షష్ఠీ సోమవారం పునర్వసూ నక్షత్రయుక్త మిధున

లగ్నము. 1866-10-29న జననం. జననకాలం గురు మహాదశ. షుమారు 150 గ్రంథరచనలు చేశారు. 1933 రాజమహేంద్రి వరములో గండపెండెర సన్మానము 1936 ఒరిస్సాలోని మయూర భంజ్ సంస్థానములో సంస్కృతం శతావధానం చేశారు. శ్వేత(తెల్లని) గజారోహణ సన్మానం పొందారు. 1936 బొబ్బిలిదగ్గరి సాలూరులో కూడ గజారోహణం సన్మానం పొందారు 1945 విజయవాడలో మణికిరీట సన్మానం పొందారు. వీరికి పరిచయమున్న రెండు మూడు భాషలలో, యెవరయిన ఉపన్యసిస్తున్నపుడు. తానూ అదే భాషలో, అతనిని అనుకరిస్తూ ఉపన్యసించే ప్రతిభ కలిగినవారు. అనగా ఆ ఉపన్యాసము ఆ యిద్దరిలో యెవరు ఉపన్యసిస్తున్నారో. చూపరులకు అర్థమయ్యేదికాదట. సమిష్టిగా వేదపండితులు వేదము చెప్పినట్లుగా, అద్భుతంగా ఆశ్చర్యకరంగా వుండేదట ఆకస్మికంగా సభలోనికి వచ్చిన వ్యక్తి, అసలు ఉపన్యాసవ్యక్తి యెవరో తెలియ నిచ్చేవారుకాదట. అపార మేధాసంపన్నులు. యిది నేను విన్న విషయము నేనుగా చూడలేదు.

## సమసప్తక నీచరాశి విచిత్రగ్రహములు

సమసప్తకస్థితిలో నీచస్థితి పొందుట మకర గురువు, కటక కుజులవల్లను, కన్యా శుక్రుడు, మీన బుధుడు వున్నపుడుమాత్రము కలుగును యే లగ్నములవారలకైనను షష్టాష్టమ వ్యయభావము లందున్న వీరి అంతర్దశలుగాని, దశలుగాని మిగుల దుష్ట ఫలప్రద ములు అయితే, ఈ సమసప్తక నీచగ్రహములు వారి నీచరాసులందు వక్రించినపుడుమాత్రము యోగవంతములగును 6-8-12 భావము

అందు, ఉదాహరణ చూడవచ్చును. సింహలగ్న జాతకునకు షష్ఠమ స్థానమందలి నీచగురువు వక్రించినందున పంచమ.భావ ఫలమిచ్చును అష్టమములో నీచబుధుడు సప్తమభావమునకు వ్యయభావమందలి నీచకుజుడు లాభ ఫలితములను యిచ్చును. ఇటులే మిగతారాశి తార తమ్యముల గుర్తించవలయును. ఎట్టి పాపిగాని, శుభుడుగాని 6-8-12 భావములందు వక్రగతితో శుభులగుదురు సమసప్తక నీచస్థితి గల రెండు గ్రహములు వక్రించుటవల్లగాని లేక ఒక్క గ్రహమే వక్రించినను శుభయోగములు 6-8-12 భావములున్నందునను కలుగును నైసర్గిక పాపిగాని తాత్కాలికపాపిగాని ఆధిపత్యపాపి గావి, సమసప్తక నీచస్థితులయందున్న గ్రహములు వక్రత్వముచే శుభులగుదురు. ఈ జాతకము చూడవచ్చును. 1902-9-23 తేదీకి సరియగు స్వస్తిశ్రీ శుభకృత్ సంవత్సర భాద్రపద బహుళ షష్ఠి మంగళవారము ఉదయాది ౧౫-౧౦ ఘడియలకు సరియగు పగలు 12-4 నిమిషములకు రోహిణీ నక్షత్రయుక్త ధనుర్లగ్నమందు జననం. జన్మకాల చంద్రదశాశేషం సం. 4-6-19 రోజులుమాత్రం

## పద్మశ్రీ తెనాలి స్థానంవారు - తెనాలి

| | | | |
|---|---|---|---|
| | కే | చం | |
| | రాశి | | కు |
| గు వ | ధనస్సు | | శు |
| లశ (వ) | | బురా | ర |

నటకావతంస, పద్మశ్రీ స్థానం నరసింహారావు గారితో నాటకరంగంలో స్త్రీ పాత్రధారణలో, ఆంధ్ర దేశములో వీరిని మించినవారు లేరని ప్రతీతి భారతప్రభుత్వముచే పద్మశ్రీ అవార్డు పొందారు హైదరాబాద్ మహానగరములో, మహామహా ప్రము

ఖులచే 1962లో షష్ఠి పూర్తి సంవత్సరముగా గజారోహణాది ఘన సన్మానములు పొందారు. పొందినవి కోకొల్లలు. మైసూరు మహారాజ సన్మానం పొందారు 38 బంగారు పతకాలు పొందారు 20 వెండి కప్పులు 176 సన్మానపత్రాలు పొందారు. వీరితో నాకు చాలా సన్నిహిత పరిచయముండేవి. తెనాలి పట్టణమునకే వకశోభ! పేరు ప్రతిష్ఠలు గడించి పెట్టారు. నాటకరంగములో స్త్రీ పాత్రధారణలో వీరితో మరొకరు సాటిరారు తొందలోవున్నా యీ స్థాయి అందుకో లేకపోయినారు చరమదశలో "నటస్థానం" అన్న గ్రంథం వ్రాశారు. నాటకరంగ స్త్రీ వేషధారణలో శిరోమణిగా ప్రకాశించి యశఃకాయులు అయినారు. వీరి జాతకములోని గురు-కుజ సమసప్తక నీచస్థిత రాజ యోగమును గుర్తింపగలరు 1971-2-21న తెనాలిలో దివం గతులయినారు

ఈ జాతకము నాలుగు దశాబ్దముల నుండి నేటివరకు నాటక కళారంగమున "స్త్రీ పాత్రధారణయందు" అసమానఖ్యాతి, సిరి సంపదలు, బహురాజయోగములు పొంది, స్త్రీలచేతనే ఔననిపించు కొన్న స్త్రీ పాత్రధారి పద్మశ్రీ శ్రీస్థానంనరశింహారావుగారిది (తెనాలి) వీరిని 'నటకానతంస' అని బహుకాలమునుండియూ పిలిచెదరు. ఈ మహాపురుషుని జాతకమున గురు కుజులు సమసప్తక నీచత్వములు కలిగి మహారాజ యోగకరులైనారు గురువు నీచయందు పరమ నీచాభిముఖుడై వక్రించిగూడ రాజయోగకరుడైనాడు లగ్నధనాధి పతుల పరివర్తనాబలముచే నీచాభిముఖమైనను యోగకారణమైనది. ఈవిధముగా నుండుటచే పరమనీచభాగలకు పూర్వమే వక్రించుట వల్లను, పరమనీచభాగానంతరము వక్రించిన పరమనీచాభిముఖ

గ్రహమునకు పరివర్తనాదికారణములు ప్రబలశుభగ్రహ, మిత్ర గ్రహదృష్టి యోగాదులవల్లను యోగమే కలుగును. వీరి జాతకము లోని మరికొన్ని విశేషములను చూడగోరెదను. (1) వెనుక వుదహరించిన వర్గోత్తమాంశలవలె ఈ జాతకమున శని బుధులు వర్గోత్తమాంశ పొందుటయు (2) లగ్న ధనాధిపతుల పరివర్తనాయోగములు ప్రముఖములు. నీచభంగయోగములలో ఏవక్కటియు పట్టకపోయినను కేవలం పరివర్తనాయోగముచే మరి నీచాబిముగ వక్రించియు కూడ శుభయోగములకు మూలకారణమైనది పరివర్తనాయోగ ఫలముల ప్రమాణము చూడుడు.

శ్లో॥ లగ్నాధీశేర్థగేచేర్థనభవనపతౌ లగ్నయాతేర్థవాన్స్యాత్.
బుధ్యాచారప్రవీణః పరమసుకృత కృత్సారభృత్భోగశీలః॥

గోపాల రత్నాకరే - నవమభావే-

శ్లో॥ లగ్నేశే ధనసంయుక్తే। ధనేశే లగ్నసంయుతే
జాతఃప్రోష్యతు సహస్రంతు। పూష్టాత్యేవ నసంశయః.

జాతకపారిజాతము-లగ్నద్వితీయ భావఫలములు 56 శ్లోకం

శ్లో॥ విత్తాధీశే లగ్నగే లగ్ననాధే। విత్తస్థానేZయత్నతో విత్తమేవ
యద్భావస్థౌ లగ్నవిత్తేశ్వరౌచేత్।
తస్మాలాత్తు(ద్రవ్యవిత్తం నరాణాం.

అని కలదు. ఇట్టి లగ్న ధనాధిపతుల పరివర్తనాయోగమున పుట్టిన వారు సుకృతవంతులునూ, అప్రియత్న ధనసంపాదనకలవారునూ, బుద్ధివిశేషము, సదాచారము, ప్రవీణులుగను. బహుజనపోషకులుగను అగుదురని పై ప్రముఖ జ్యోతిష గ్రంథ శ్లోకములు తెలుపు

చున్నవి. ఇతే వాగ్భావాధిప శని భావాధిపతుల పరివర్తనాయోగ ముండుటవల్లనే, నాటకరంగస్థలమున. శరీరము వాక్కు యేకోన్ము ఖత్వముకలిగి ఇంతటి బ్రహ్మాండయోగములకు మూలమైనది. ఇతర నటులవలె కేవలం ప్రజాభిమానమేగాక. ఉన్నతాధికార అనధికార వర్గములలోకూడ సగౌరవ హుందాతనము నకు తోడైన స్థాయీభావ లక్షణములు వీరిలో బాగా గోచరిస్తవికూడను. నటులకు ఇది లభ్య మగుట దుష్తరమైనవిషయము. వీరు రంగస్థలమునచేయు వస్త్రధార ణాదులు స్త్రీలుగూడ చేయలేరని ప్రతీతి. స్త్రీ, స్త్రీపాత్ర ధరించి మెప్పు పొందుట గొప్పగాదు. పురుషుడు స్త్రీ వేషధారణచేసి మెప్పిం చుటలోనే విశేషతగలదని ఛాలెంజిగా స్త్రీ జాతినే సవాలుచేసిన మేటి కళాపురుషరత్నము. తాను స్త్రీ వేషముచే మెప్పించినటుల స్త్రీలను పురుషవేషములువేసి మెప్పించుమని వారి అభిప్రాయము గావచ్చును ఇటీవల పురుషుల స్త్రీ పాత్రధారణలు తగ్గి స్త్రీలచేతనే వేయించు చున్నారు. ఈ కీర్తి వీరితోనే తొలగునని అందోళనయు కలిగించు చున్నది. వీరితర్వాత కొంతకీర్తి సంపాదించితే ప్రొద్దుటూరునందలి కొండపేట కమాల్ అనేవారొకరు కనపడుచున్నారు. వీరికి రాయల సీమలో మంచి కీర్తి గలదు ఇంతకుమినహా మరెవరూ కానరారు. ఉన్నవారు లెక్కలో లేరుకూడను. ఆంధ్రలో బుర్రా సుబ్రమణ్య శాస్త్రిగారు మరొకరున్నారు. ఇక వర్గోత్తమాంశ గ్రహములు చూడ వచ్చును ధన-రాజ్యాధిపతులైన శని-బుధులు వర్గోత్తమాంశ గతు లగుటకూడ యోగమేను ఇట్టి వర్గోత్తమాంశ శనిగ్రహ దశ నేడు నడచుచున్నదికూడను. జాతకచంద్రికాయాం

శ్లో॥ చరభవనేష్వాద్యంశా స్థిరేషు మధ్యాః। ద్విమూర్తిషు తథాం
త్యాః వర్గోత్తమా ప్రదిష్టాస్తేష్విహజాతాః కులేషుతే ముఖ్యాః॥

అని కలదు గాన పరిముఖయోగ గ్రహములయినవి. ఇట్టి యోగ గ్రహములు ఇచ్చిన రాజయోగవివరములు చూతవచ్చును. 1933లో గురుదశా — గురు అంతరకాలమున బర్మాదేశ ముఖ్యపట్టణమయిన రంగూన్ నాటకములలో సువర్ణకిరీట యోగలాభం, బహువిధ సువర్ణాభరణాది ఘనసన్మానములు కలిగెను. జీవితమున సామాన్య సన్మానములు లెక్కలేదు. ఇటీవల అనగా శనిదశా — శుక్రాంతర కాలమున అనంత రాజయోగములు కలిగెను. 1956-1-26న రాజేంద్రప్రసాదు గారిచే పద్మశ్రీ బిరుదార్హులుగ ప్రకటించబడిరి 1956-8-7న నెల్లూరు జిల్లా సూళూరుపేట వద్దగల యల్లాయపాళెంలో అబాల గోపాలం నివాళులిచ్చి గొప్ప రథోత్సవము చేసిరి. ఇవి మరపురాని విషయం. 1956-10-1న తాత్కాలిక కర్నూలు రాజధానియందు అప్పటి గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీచే ప్రభుత్వము తరపున రు. 1101/- రూపాయలు రొఖ్ఖము, 500 రూపాయలు ఖరీదుగల కాశ్మీర్ శాలువయు నొసగి ఘనముగా సన్మానించబడిరి. 1956-10-6న సాయంత్రము అయిదు గంటలకు రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ చే కేంద్రప్రభుత్వమునుండి పద్మశ్రీ బిరుదము పొందిరి. 1957-4-6న మద్రాసునందు ఛీఫ్ జస్టిసు శ్రీ పి.వి. రాజమన్నారుగారి అధ్యక్షతన సినీఆర్టిస్టు బి.యన్. రెడ్డి మొదలయిన వారిచే అసోసియేషను తరపున సువర్ణ కంకణాది బహుసన్మానములు పొందిరి. 1957-7-10 నుండి ఆలిండియా రేడియోలో (హైదరబాద్) ఉద్యోగము నేటికీ చేయుచున్నారు ఈ యోగములన్నియు శనిలో-శుక్రాంతరమున కలిగినవి. మరియు,

శ్లో॥ పరస్పర దశాయాంచ స్వ భుక్తౌ సౌరిభార్గవౌ
ప్రదిశేతాం వ్యత్యయేన విశేషేణ శుభాzశుభం.

అనినట్లు ఫలితములు పూర్ణములుగా రుజువగుచున్నవికూడను. ఇక 1961-62 సంవత్సర మధ్యకాలములయందు షష్ఠిపూర్తి మహోత్సవాదులూ. తిరిగి శనిదశా – గురు అంతరకాలమున అనగా 1965-10-1 నుండి 1967-4-12 మధ్యకాలమున గజారోహణాది అనేక సుభయోగములు, బహుసన్మానములు ఘనములుగా యుండును. ఇట్టి వీరికి గురుదశా-శుక్రాంతర కాలమున 1941-5-5న బెజవాడ రైల్వే ప్లాటుఫారమున ప్రమాదమున కాలుజారి రైలుకూ—ప్లాటుఫారమునకు మధ్యను పడి యెట్లో దైవవశమున గండము తొలగినది. ఇదియు మరువని విషయమేను ఇతను ఆ గండము పాలయినచో ఆంధ్రిల ప్రతిభకూ – నాటక కళామతల్లికీ యెంతటి కొరత కలిగెడిదోకూడను. యేమైననూ పద్మశ్రీ స్థానం నరశింహారావు గారు పూర్ణమయిన కళాధన్యజీవులయినారు 1971-72 సంవత్సరములందు వీరికి మరొక గండము బుధదశా – శుక్రాంతరమున కలుగునని తోచును. అంధ్రప్రదేశ్‌నందు నాటక కళాపురుషులుగా యుంటూ ఇండియా గవర్నమెంటుచే పద్మశ్రీ బిరుదమందిన మహా యోగము వీరికే కలిగినది. నాటకరంగమందు పద్మశ్రీ బిరుదము పొందినవారు తెలుగునాడులో వీరుతప్ప మరెవరూ కానరారు. ఇట్టి వీరని పరమేశ్వరుడు ఆయురారోగ్య సిరిసంపదలతో సదా సంరక్షించుగాత (శ్రీపాదవారు 1960-12-2 దివంగతులయినారు)

## పంచగ్రహముల సమసప్తకోచ్ఛస్థితి

ఈ సమసప్తక గ్రహోచ్ఛస్థితి అనేది లగ్నాది కేంద్రములందు మాత్రమే అధిక ఫలప్రదమగును తదితర భావములందు పరిమిత ఫలప్రదములతోకూడిన రాజయోగములనేగానీ, దుర్యోగ

ములనేగానీ యిచ్చును. "లక్ష్మీస్థానం త్రికోణం స్యాత్। కేంద్ర స్థానం తు వైష్ణవం" అనుటనుబట్టి లగ్నాది కేంద్రములందు సమ సప్తకస్థితియే ప్రాధాన్యమగును తదితరభావములకు ఇట్టి ప్రాధాన్యత లేదు. ఇందుచే ఇతరత్రా ఈ యోగములు పరిమితఫలప్రదములే అగుచుండును తరచుగాను. ఇక ఈ జాతకము చూడగోరెదను. స్వస్తిశ్రీ ప్లవంగనామ సం॥ర భాద్రపద బహుళ త్రయోదశీలు శనివారం ఉదయాది ౨౮-౩౦ ఘడియలుకు జననం.

| | | | |
|---|---|---|---|
| ల | | | రా |
| శ(వ) | రాశి | | గు |
| కు | మీనము | | చ |
| కే | | బు | రశు |

పుబ్బా చతుర్థ పాదం 1-4-1 జన్మకాల శుక్ర శేషం 1907-10-5 తేదీలు వెల్లాల లక్ష్మీనరసయ్యగారు కడప జిల్లా ప్రొద్దుటూరు తాలూకా అరకట వేముల గ్రామం. ఈ జాతకమున సమసప్తక మిత్ర గ్రహోచ్చస్థితి కుజ-గురువులకు గలదు. పంచమ లాభ భావములలో కలిగినందున గురుదశ యోగించిననూ పరిమిత ఫలములే కలిగినవి. గురుదశయందు పుత్రపుత్రీ వివాహాది కార్యములూ వారలకు శుభయోగములు కలుగుటయూ వీరికి స్థితిగతులు వృద్ధి అగుటయు, బ్రహ్మజ్ఞానాది విశేషయోగములు అనేకములగా కలిగినవి. సమసప్తక గ్రహోచ్చఫలితములు, ఉచ్చ, నీచ, మిత్ర గ్రహముల విషయమున ఈవిధములుగా యుండునవి నా అనుభవమున తెలుసుకున్నాను. ఈ జాతకమున మరికొన్ని విశేషములు గలవు. (1) క్షీణచంద్ర దశయందు మారకం కలుగకపోవుట (2) కుజదశయందు మంచి భూస్థితీయోగము. (3) రాహుదశ అంతయూ అనేక మార్పులు చేయించుటయు. (4) గురుదశ పై

నుదహరించిన శుభఫలితములు కలిగించినవి. (5) ప్రబల శత్రువు లయిన రవి శుక్రయుతి కలిగి, (6) సప్తమాధిప అష్టమస్థితి, (7) శుక్రుని అస్తంగతము కళత్రభావమున కలిగీ ద్వికళత్రయోగము గానీ, కళత్రభంగముగానీ కలిగించలేదు. (8) బుధ శుక్రుల క్షేత్ర పరివర్తనాయోగ బలముచేత, (9) అష్టమాధిప సప్తమస్థితి (10) సప్తమాధిప అష్టమస్థితి (11) శుక్రుని అస్తంగతము, (12) షష్ఠాష్ట మాధిపతుల సప్తమస్థిత దోషాములన్నియు తొలగిపోయినవి పరి వర్తనాయోగబలము యెంత గొప్పదయినదీ ఈవిధముగా ఋజువగు చున్నది.

## అభినవనారద - T. రామకృష్ణశాస్త్రి, తెనాలి

| | | | |
|---|---|---|---|
| ర | శు | శ | |
| బు రా | రాశి తులా | | కు |
| గు | | | కే |
| | | ల / | చ |

ఇంటిపేరు త్రిపురారిభొట్లవారు తెనాలిదగ్గర పెదరావూరులో, ఆనంద నామ సంవత్సర చైత్రశుద్ధ పౌర్ణమీలు శుక్రవారం 1914-4-10న రాత్రి గం. 7-30 నిమిషములకు చిత్తా నక్షత్రయుక్త తులా లగ్నమందు జననం 4-7-23 కుజదశా శేషము.

ప్రస్తుతం చాలా వయోవృద్ధులుగా వుంటూ తెనాలిలో శేషజీవితం గడుపుచున్నారు బహుధాన్య వైశాఖ బహుళ నవమీలు గురువారం 1998-5-21 దివంగతులయినారు. వీరితో నాకు చిరకాలపరిచయ మున్నది పెదరావూరులో వీరి యింటిప్రక్కనే వున్న, మా గురు దేవులు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారివద్ద సంస్కృతం చదువుతున్నరోజులవి. వీరి జాతకములోకూడ, గురు-కుజ సమసప్తక నీచస్థ రాజయోగమున్నది తెనాలి నాటకరంగములో, నారదపాత్రలో

వీరిని మించినవారు లేరు యీ పాత్రలోనే లబ్ధప్రతిష్ఠులయినారు. చక్కని వైదిక సాంప్రదాయికమైన నిరాడంబర వేషధారణావ్యక్తిగా వుండేవారు. గురుశిక్షణలో నేర్చిన తరంగాలతోబాటు. కొద్దిపాటి నాట్యచాతుర్యముతో నారద పాత్రను చాలా చక్కగా పోషించి, ఆ నాటకానికే యెంతో నిండుతనం తెచ్చి జనాన్ని తన్మయులను చేసేవారు. ఆనాటి నాటక కంట్రాక్టర్సులోనూ, నటకులలోనూ, ప్రజలలోనూ, నారదపాత్ర అనగానే శ్రీ T. రామకృష్ణశాస్త్రిగారే మనసులలో దర్శనమయ్యేవారు. యిది వారి పూర్వజన్మ తపో భాగ్యము. కొంతకాలము సినిమాలలో రాణించారు. బహుసన్మానాలు పొందారు. లబ్ధప్రతిష్ఠులయిన నాటకరంగ మహాశయులుగా ప్రాస్తే యెంతయినా వున్నది. ఆనాటి నాటకరంగ వైభవమే యెంతో తన్మయంగా వుండేది. అది మరపురాని మనోజ్ఞమయినకాలము—

## V. B. రాజు (వల్లూరు బసవరాజు)
## మాజీమంత్రి M. P. హైదరాబాద్

| | | | |
|---|---|---|---|
| | రబు | శశ | |
| ల/రా | రాశి | | కు |
| గు | కుంభతి | | చ కే |
| | | | |

ఆనందనామ సంవత్సర వైశాఖ శుద్ధదశమీలు మంగళవారం 1914-5-5 ఉదయాది ౫౧-౩౧ ఘడియలకు ఉత్తరా ఫల్గునీ నక్షత్రయుక్త కుంభ లగ్నములో జననం. రవి దశాశేషం 5-4-22. వీరు రాజకీయరంగంలో మహాప్రముఖులు. మహామేధావులు రాజకీయరంగంలో వీరిపేరు తెలియనివారులేరు. హైదరాబాదు నివాసిగా, V. B. రాజుగా ప్రసిద్ధులు. కాంగ్రెసుపార్టీలో కరు

వృద్ధులుగా, M. L. A.గా, M. P.గా అలిండియా కాంగ్రెసుపార్టీ ప్రధానకార్యదర్శిగా పలురంగాలలో ప్రకాశించారు. విదేశసంచారాలూ చేశారు. వీరి జాతకములోనూ, గురు–కుజ సమసప్తక నీచస్థ రాజయోగం వున్నది. యెవరిది యే లగ్నమయినా. యీ యోగము వున్న వకరు సంస్కృతాంధ్ర సాహిత్యకవితా శతావధానాది ప్రపంచములోనూ, మరోయిద్దరు నాటకరంగ స్థలములలోనూ, మరొకరు రాజకీయరంగంలోనూ రాణించి లబ్ధప్రతిష్ఠులయినారు మహాయోగవంతులుగా జనాదరణా పండితాదరణలు పొందినవారుగా, తమతమ కీర్తిపతాకల నెగురవేసి, ఆంధ్రజాతికే గర్వకారకులయినారు. దైవజ్ఞులు యీ యోగమును గుర్తిస్తారని గుర్తు చేస్తున్నాను. యీ సమసప్తక గురు కుజ నీచస్థిత రాజయోగ ప్రభావము మరపురానిది. బహువిధ రంగాలలోని ప్రముఖులు జన్మిస్తూ వుంటారు. వీరు ప్రస్తుతం లేరు.

వివరణ :- (1) ఈ సమసప్తక నీచగ్రహ రాజయోగము కటక, మకర రాసులలో విశేష ఫలప్రదముగా వుంటుంది. (2) యిటువంటి యోగము బుధ శుక్రులకు మీన, కన్యారాసులలో యేర్పడడము వుండదు (3) మేష తులా రాసులలో రవి శనుల సమసప్తక నీచస్థయోగము యేర్పడినా యిట్టి మహాయోగ జాతకులుగా లేరు. మరోవిధంగా యోగిస్తుంది అంతమాత్రమేను. కటక–మకర రాసులలో యేర్పడే గురు-కుజ సమసప్తక నీచగ్రహయోగము మాత్రమే యోగకరంగా వారివారి జీవితాలను నడుపుతుంది. నాకు లభించిన యీ నలుగురూ బ్రాహ్మణులే అయినారు. ఇదే ప్రధానం కాదు యెవరు యే కులములో పుట్టినా, యే లగ్నములో పుట్టినా యోగమే ప్రధానవిషయము. యిట్టి యోగజాతకులు 64 అరువది

నాలుగు కళలలో ఏదోవక కళలో మహాప్రముఖులవుతారు. ఓ వెలుగు వెలుగుతారు. అతీతమైన ప్రజ్ఞాపాటవాలు. అతీంద్రియ శక్తు లున్న మహాపురుషులవుతారు.

మరోవిశేష వివరణ :- పైన చూపిన ఈ నాలుగు జాతకముల వారికి పుత్రసంతాన భాగ్యములేదు. ఆస్థాన కవిగారికి వక పుత్రికా సంతానమేను శ్రీ స్థానంవారికి వక పుత్రికాసంతానమేను శ్రీ టి. రామకృష్ణశాస్త్రిగారికి యిద్దరు పుత్రికాసంతానమేను. శ్రీ V. B. రాజు గారికి ఏ సంతానమూ లేదు. సోదర పుత్రికను పెంచుకొన్నారు. యిది యీ యోగప్రభావ ప్రత్యేకత అనవలసి వుంటుంది. పాఠకులు యిటువంటి జాతకులను ప్రత్యేకించి వెతికి చూడవలసి వుంటుంది. అనుభవ సమన్వయం చేసిచూడండి. అయితే అది (కరక్టు) సక్రమ మైన యదార్ధజాతకం అయివుండాలి

శ్లో॥ అనుక్తమన్యతో గ్రాహ్యం। అనిరుద్ధం యదన్య చ
సర్వం ఫలవిచారేతు। యోజనీయం ప్రయత్నతః

(ఉడుదశా ప్రదీపికా – సంజ్ఞాధ్యాయః) అన్న ఆధారముగా, ఈ తమిళ జ్యోతిష సూత్రాధారముగా నేను పరిశోధించిన కనుగొన్న యీ గురు–కుజ సమసప్తక నీచ గ్రహ రాజయోగ ఫలితవిధానమును మీకందిస్తున్నాను. రవి–శనుల సమసప్తక నీచగ్రహ పరిశోధనకూడ అందించాను స్వస్త్యస్తు.

## మంగళ గ్రహయోగము

1) గురుమంగళ యోగము 2) చంద్రమంగళ యోగములనేవి జాతకభాగములో అత్యంత శుభయోగములనేది అందరకూ తెలిసిన

విషయమేను. యీ రెండు యోగములవలెనే, మంగళకరమైన మంగళ కారకయోగమనేది మరొకటి వున్నది

శ్లో॥ చంద్రాత్ కేంద్రగతే భౌమే। యోగో మంగళ కారకః
మంగళాఖ్యే నరోజాతః। నిత్యశ్రీ ర్నిత్య మంగళం

(రాజయోగములు చల్లావార ఫల్రగంధము (1951) పేజి 65) చంద్రునకు సప్తమ (7) కేంద్రములో కుజగ్రహ మున్నపుడు, ఈ మంగళకారక యోగము యేర్పడుతున్నది. చంద్రలగ్నాది సప్తమ కేంద్రములోనే కుజుడు వుండాలి కుజ గురువులూ, కుజచంద్రులూ కలియుటవల్లనే పై యోగములు శుభఫలితాలు యిస్తున్నట్లుగా, ఈ మంగళ కారకయోగములో, చంద్రునకుకూడ సప్తమంలోనే కుజుడు వుండాలి. "పశ్యన్తి సప్తమం సర్వే" అను న్యాయముగా ఈ యోగములో సప్తదృష్టి విధిగా వుండాలి. యితర కేంద్రములతో సంబంధములేదు. యిట్టి యోగమున్న జాతకుల విషయంలో కుజదోష పరిగణనము వుండదు. కుజదోషము వున్నవారిని వివాహము చేసుకొనవచ్చును. యిదొక గొప్ప శుభయోగంగానే చూడవలసి వుంటుంది. ఈ యోగజాతకులు నిత్య లక్ష్మీకటాక్షమున్నవారుగా. నిత్యశుభములనేకం పొందేవారుగా వుంటారు ఈ యోగం వున్నదని చాలా మందికి తెలియకపోవచ్చును. యిది మూడవ మంగళకారకయోగము సదా రక్షణకరముగా వుంటుంది. భర్తృనష్టముగానీ, భార్యానష్టముగానీ మధ్యవయస్సులోగానీ రాదు. అపరవయసులో రావడం సహజసిద్ధము

## శని-రాహు గ్రహముల సంబంధము

కొన్ని జాతకములందు శని యెట్టి శుభుడుగాగానీ యెట్టి పాపఫలప్రదాతగాగానీ వుండునో, అటులనే, రాహువుగూడ యెట్టి గ్రహ

సంయోగ విలోకనాదులు లేనపుడు శనివత్ఫలదాయకుడగును కేతువు కుజవత్ఫలదాయకుడు అగుచున్నాడు. ఈ రాహు-కేతువులు శుద్ధ గ్రహములుగా యున్నపుడే ఈ ఫలితాలు కనపడును. ఇందుకు ప్రమాణములు చూడవచ్చును. మంత్రేశ్వరఫలదీపికాయాం అష్టమోఽధ్యాయే.

1. శ్లోకము (౩౪) ఉత్తరార్థము.

శ్లో॥ శనివద్రాహుః కుజవత్కేతుః। ఫలదాతాస్యాదిహ సంప్రోక్తః॥

2. దైవజ్ఞ కర్ణామృతము – రాహు–కేతు వేధా ఫలములు.
"రాహో హ్యుదోగ" అను శ్లోకమందలి చతుర్థచరణము.

శ్లో॥ శనివత్కుజ వచ్చైవం। రాహుకేత్వో శుభాఽశుభే.

3. పద్మపురాణాంతర్గతమయిన రాహ్వష్టోత్తర శతనామ స్తోత్రము నందు.

శ్లో॥ కిరీటీ నీలవసనః శనిసామన్త వర్త్మగః అనియు.

శ్లో॥ శనివత్ఫల దశ్చాలోఽపసవ్యగతి రేవచ అనియు కలవు.
ఇట్టి ఫలములు ఈ గ్రంథములందు చెప్పబడియున్నవి.

"యద్యద్భావగతౌ వాపి। యద్యద్భావేశ సంయుతౌ" అను శ్లోకమును రాహు-కేతువులు ఇతర గ్రహముల సంయోగ విలోకనాదులు కలిగినపుడే చూడవలయును శుద్ధగ్రహములు అవగా యే ఒక్క గ్రహసంయోగ విలోకనాదులు పొందనపుడు మాత్రమేను. ఇట్టి స్థితులందు శనివలె రాహువును, కుజునివలె కేతువును ఫలప్రదులగుదురు. ఈ సూత్రము చాలా జాతకములపై నాకు అనుభవమున సరి

పోవుచున్నది. వెనుకవ్రాసిన "మిత్రగ్రహముల సమస్తకోచ్ఛస్థితి" ప్రకరణమున వుదాహరణగా యిచ్చిన శ్రీ వెల్లాల (శాస్త్రులవారి) లక్ష్మీనరసయ్యగారి జాతకము చూడవచ్చును. మిధునమందలి రాహువు శుభక్షేత్రగతుడై భూస్థానమందు శుద్ధగ్రహముగా యుండి యే గ్రహసంయోగ విలోకనాదులు లేక యుండి శుభయోగమునకు బదులు వ్యయాధిప శనివలె ఫలప్రదుడయి అనేకమైన భూక్రియ విక్రయాదులు చేయించినారు. అయితే శని వ్యయమందుయున్ననూ లాభభావమునకు వక్రించినందున మార్పులు అనేకములు రాహు దశలో చేయించిననూ నష్టజాతక ఫలములుగాక, లాభజాతక ఫల ములుగానే చివరకు మారినవి. రాహువు బుధ క్షేత్రమందు బుధ వత్ఫలదాయకుడుగాలేదు. బుధుడు పరివర్తనా గ్రహమగుటచేత బుధ వత్ఫలదాయకుడయినపుడు మహదోగ్యమే కలిగెడిది. ఈవిధముగా రాహువు శనివలెనూ - కేతువు కుజునివలె ఫలదాతలని వెనుకటి ప్రమాణ గ్రంధ శ్లోకములు గలవు. రాహ్వష్టోత్తర శతనామస్తోత్ర మున "క్రూరో ఘోర శ్శనేర్మిత్రం। శుక్రమిత్రమగోచరః అనియూ కలదు. ఇట్టి రాహు - కేతు గ్రహములకు శత్రు మిత్ర గ్రహ విచా రణలు. ఉచ్ఛ స్వక్షేత్రాది విచారణలు నేను వ్రాసిన రాహు - కేతు వులు అను గ్రంధమున చాలావరకు వ్రాసియున్నాను. రాహు - కేతువులు గ్రహములు అవునూ, కాదు, అను విషయముగూడ కొంత విచారణచేసి "రాహుః కేత్వోర్గ్రహత్వ మస్తి" అను ప్రత్యేక నిర్ణ యమూ చేసియున్నాను. మరికొంత విచారణ ఇచ్చట శాస్త్రజ్ఞుల ఉప యోగార్ధము వ్రాయుచున్నాను. ఒక దైవజ్ఞుడు తనవద్దకు వచ్చిన దైవజ్ఞునితో ఇవి శుద్ధగ్రహములుకావు. ఛాయామాత్ర గ్రహములు. అదృశ్యములూ అవి వాదించుచూ, సాయంత్రమువచ్చిన పృచ్ఛకు

నకు నీకు రాహువు చాలదు. జపదానములు చేయుమని మరువాటి వుదయం మూషదానములు స్వీకరించుట మరుపురానివిషయము. ఇందు మన ఆత్మపరిశోధనావశ్యకత కలదుకూడను. ముహూర్త కాలామృతమందలి శ్లో॥ "కూ్రరా భానుతమశ్శని ధ్వజ కుజాః, రాహ్వేందు శక్రా ప్రియః" అని శిష్యపాత ప్రబోధము చేయుట యెంతవరకు సమంజసము? ఈ రాహువును గురించి భాగవతమున అష్టమస్కంధము నవమోZధ్యాయమున క్షీరసాగరమధన ఘట్టము నందు సంస్కృత భాగవతము రచించిన వ్యాసమహర్షియూ, తెలుగు భాగవతము రచించిన భక్తపోతనాదులు రాహువును శుద్ధగ్రహమునే వ్రాసినారు. వేదమునందు రాహు మంత్రము కలదు. నేటికీ నవ గ్రహార్చనలే చేయుచున్నారు. ఇవి గ్రహములు కావనినవారు సప్త గ్రహార్చనలు చేయించెదరా? ఇక భారతమున అదిపర్వమున దేవ దానవ ప్రముఖుల యుత్పత్తి క్రమమున ఇట్లు కలదు. వచనము॥ పదంపడి యేబండ్రు కూతులం బుట్టిన వారల నెల్ల దక్షుండు అపుత్రకుండు గావున బుత్రికరణంబుసేసి, యందు కీర్తి, లక్ష్మి, ధృతి మేథా, పుష్టి, శ్రద్ధ, క్రియా, బుద్ధి, లజ్జామతులను, వదితల బదుండ్రను ధర్మండను మనువునకిచ్చె. నశ్విన్యాదులైన ఇరువదేడ్వు రను జంద్రునకిచ్చె. నదితి, దితి, దను, కాలా, నాయు, స్సింహికా, ముని, కపిలా, వినతా, క్రోధా, ప్రాధా, కూ్రరా, కద్రువలను పద మువ్వురను గశ్యపునకిచ్చె అని కలదు. దీనిక్రింద "దితి యనుదానికి" అను పద్యము కలదు. పద్యముక్రింద వచనము॥ మరియు సింహిక యనుదానికి రాహువు పుట్టె అని కలదు. దీనిని విచారించగా దక్షు నకు మనుమడనియూ, కశ్యపునకు పుత్రుడనియూ తెలియుచున్నది. ఈ కశ్యపుడు సప్తఋషులలో మొదటివాడు. రాహ్వష్టోత్తర శతనామ

స్తోత్రమున "మానః ప్రియః కాశ్యపటుషినందనో భుజగేశ్వరః" అనియూ గలదు. రాహువు గ్రహము కాదనువారు ఇందుకు యేమి సమాధానమిచ్చెదరు? "కృత్తికాది క్రమేణ" అను నక్షత్ర దశను యేవిధముగా సరిపుచ్చెదరు? భారత భాగవతములందు ఇట్లు వ్రాసిన వ్యాసమహార్షి, భక్తపోతనాదులను ఆంధ్రభాషా సముద్ధారకులయిన నన్నయ, యఱ్ఱాప్రగడ, వాగనుశాసకులైన తిక్కనాదులకన్న వీరు అధికులేమో? మానసికంగా ఒక్కమారు పర్యాలోచన చేయగోరు చున్నాను. విజ్ఞానఘనులైన దైవజ్ఞులుగాయుంటూ, వీరు గ్రహములు కాదనుట చాలా అసమంజమైన విషయము కాగలదు. గ్రహమే కానిచో, సూర్య చంద్రాదుల నెట్లు గ్రసించును? ఇది గ్రహణ విషయము. ఇవి గ్రహములు కావని వాదించినచో పంచాగచారము లందు వీరిని చూపుటయు, గ్రహణాదులందు వినియోగించుటయు, యెంతవరకు నిటము? ఈ గ్రహణవిషయమున ధర్మశాస్త్ర గ్రంధ మయిన నిర్ణయసింధు ప్రథమ పరిచ్ఛేదము కాలనిర్ణయమునందు ఇట్లు కలదు.

శ్లో॥ సర్వేషా మేవ వర్ణానాం సూతకం రాహు దర్శనే।
స్నాత్వా కర్మాణి కుర్వీత శృతమన్నం వివర్జయేత్॥

అని కలదు. జనన మరణాశౌచము అనెడి కొందరికే పరిమితము. రాహు గ్రహణముచే ప్రపంచములోని సర్వవర్ణముల వారికీ సూతకము కలుగుచున్నది అని తెలుపుచున్నది. మంత్రానుష్టానసిద్ధికి ఇది చాలా బలీయముకూడను. ఈరోజు అబ్దికములే చూచి పెట్టుమనియు, ఇట్టి కాలమందలి జననములు దోషములనియు, ఈ కాలమందలి జన్మరాశి వారలకు జప దాన విధానములు కలవు. అరుమాసములు ఈ గ్రహణ

నక్షత్రము వివాహ కార్యములందు ఉపయోగించకూడదు. తదితర మంగళకార్యములకు పనికిరాదు. గ్రహణ కాలమున అబ్దికాదులు చేయమనియు ఇట్టి రాహువువల్ల కలిగే గ్రహణకాలము అతి పుణ్య వంతముగా ప్రముఖ ధర్మశాస్త్ర గ్రంధములు పేర్కొనియున్నవి. కనుక రాహువు, గ్రహము కాదనుటకు ఈ నిర్ణయములు యెంతవరకు యెదుర్కొనునో చూడవచ్చును. సిద్ధాన్త గ్రంథములందు రాహు - కేతువులవల్ల దేశారిష్టసూచకముగ కాలసర్పయోగము అనేది చెప్ప బడియున్నది.

శ్లో॥ అగ్రే రాహు రధః కేతుర్మధ్యేచ గ్రహసప్తకం
కాలసర్పాఖ్య యోగోయం నృపాణాం సమరం భవేత్॥

అని కలదు. అర్ఘప్రదర్శినియందు వేరు శ్లోకములు గలవు. యే ఒక్క గ్రహముగానీ రాహు - కేతువులతో కలియరాదు. రాహువునకు అభి ముఖముగా గ్రహములన్నియూ యుండి వెనుక కేతువు యున్నపుడు మాత్రమే కాలసర్పయోగమునే ఈ దేశారిష్టయోగము కలుగును. సర్పహతుడైన వాడెట్లులుండునో దేశము కాలసర్పారిష్టము పొంది నపుడు ఇట్టులగుట కలదు. ఇందుకు శాంతి విధానములు వైదిక విధానముగానీ చాలా గ్రంధములందుగానీ కనపడదు. కానీ జ్యోతి ర్మయూఖమనే గ్రంధమున వున్నట్లు వినియున్నాను. నిర్ణయసింధ్వాదు లందులేదు. ఈ రాహుగ్రహమును గురించి ప్రముఖ నాగరలిపి గ్రంధములయిన ముహూర్త చింతామణీ, ముహూర్త మార్తాండ గ్రంధములందు (1) రాహు గోచారఫలము (2) రాహు - కేతు ఫలవిచారము (3) పంధా రాహు చక్రఫలం (4) అర్ధ యామ రాహువు (5) ముహూర్త రాహువు (6) రాహు ముఖచక్రం అను

అనేక విషయములు వ్రాయబడి యున్నవి. ఇక జ్యోతిష గ్రంథము లందు కావలసిన విషయములన్నియు గలవు. కనుక యిట్టి విషయ ములన్నియు సాకల్యముగ పరిశీలించిన ఆత్మ పరివర్తన కలుగును. ఇందుకు పై ప్రమాణగ్రంథములూ లోకమనేది సాక్ష్యముగా కలదని, రాహు - కేతువులు గ్రహములు కాదనేవారికి వినయపూర్వకముగా తెలుపుకొనుచున్నాను. యదార్థమును గుర్తించండి. ఈ రాహువు వల్ల రాహుకాలమనేది కలదు. నేటికి ప్రతివారూ చూచుచున్నారు కూడను. పంచాంగకర్తలూ తమ పంచాంగములందు రాహుకాలము నకు ప్రముఖస్థాన మిచ్చుచున్నారుకూడ. ప్రత్యక్షవాదనలో అవి గ్రహములుకావు. ఛాయాగ్రహములని మరేవో వాదనలు చేయుచూ ఉన్ననూ, ధర్మభీతిచేత గ్రహణకాలములందు స్నాన జప, హోమ, దాన, తర్పణ, శ్రాద్ధాదిక్రియలు చేయుటచేత పరోక్షమున గట్టిగా నమ్మియే వున్నారనేది నిర్వివాదాంశముకూడను. ఈ రాహు - కేతు వులు లేనిది గ్రహణములురావు. స్కాందపురాణే

శ్లో॥ గోదానం భూమిదానం చ స్వర్ణదానం విశేషతః
(1) గ్రహణక్లేశ నాశాయ దైవజ్ఞాయ నివేదయేత్
(2) గ్రస్యమానే భవేత్ స్నానం గ్రస్తే హోమే విధీయతే
ముచ్యమానే భవేద్దాం ముక్తే స్నానం విధీయతే.
(నిర్ణయసింధు)
(3) రాహు దర్శన దత్తం హి శ్రాద్ధమా చంద్ర తారకం
ఇదం చామాన్నేన హేమ్నా వా కార్యం నత్వన్నేన॥

అనియు కలదు. నిర్ణయసింధు ప్రథమ పరిచ్ఛేదం. కాలనిర్ణయము నందు తదితర ధర్మశాస్త్ర గ్రంథములందు ఈవిధముగా రాహువుచే

కలిగే ఈ ఫలితములు అనేకములుగ వ్రాసియున్నారు. అస్తికబుద్ధి కలవారలకు ఈ ప్రమాణములు చాలును. రాహువును గురించి రాహుమంత్రము, రాహుకవచము, రాహుస్తోత్రము. రాహ్వష్టోత్తర శతనామ స్తోత్రాదులుగల నవగ్రహ స్తోత్రమునందుకూడ పూర్ణముగా తెలుసుకొనవచ్చును. సూర్య సిద్ధాన్తమున "అదృస్య రూపాః" అని యున్నది. వీరికి రూపమనేది వున్నది. కాని మనకు ఇది దృశ్యము కానిది. దీనినిబట్టి చర్మదృక్‌చే తెలియలేనిదనియు, అంతర్దృష్టిచే చూడతగినదనియు తెలియుచున్నది. సిద్ధాంత గ్రంధములెట్లున్ననూ భాగవత, భారతాది గ్రంధములు రాహు స్తోత్రాదులందు రూప గుణ సంపత్తులు వున్నందున రాహువు శుద్ధగ్రహమనేది నిశ్చయం. శేష గ్రహములకు ఇతర శక్తులున్నట్లు ఇతనికి ఛాయాశక్తి గలదు. ప్రస్తుతము ఇంతటితో రాహు విషయమును విరమించుచున్నాము.

## మహాద్యోగములు

(1) నక్షత్రదశాక్రమాగతమైన ఒకటి రెండు శుభయోగ గ్రహ దశలకన్ననూ (2) కొన్ని గ్రహముల పొందికలచే కలిగే మహాద్యోగములు చాలా గొప్పవి. (3) ఈ రెండు యోగములనుమించిన అధియోగములనేవీ కలవు. ఇట్టి యోగబలముల గురించి జాతక పారిజాతము మంత్రేశ్వర ఫలదీపికా శతయోగమంజరి. బృహజ్జాతకము, జ్యోతిషామృతసారము, జాతకానుభవసారము మొదలయిన అనేక గ్రంధములందు అనేకవిధములుగా చెప్పబడియున్నవి. లగ్నాదిగా గానీ, చంద్రలగ్నాదిగాగానీ శుభగ్రహములన్నియు ఆరు. యేడు, యెనిమిది స్థానములందుండి పాపగ్రహ సంయోగ విలోకనాదులు లేకుండుటచే,' చంద్రాధి యోగమనియు, లగ్నాధి యోగమనియు

కలుగును. ఇట్టి యోగమున పుట్టినవారు బహుశాస్త్రవేత్తయు, విద్యా విషయ విత్త బలాధిక్యములు, ప్రపంచ కీర్తిగలవారు, మహాత్ములు గను, దైవ వరప్రసాద జన్ములుగను అగుదురు. ఇది ప్రతి జాతకు నకుపట్టు యోగముగాదు. బహుజనమున యే ఒక్కరో కనుపడుతారు. రెండవ యోగమును చూచుదము. శుభగ్రహములేగానీ పాపులేగానీ, కలిసిగానీ, విడిగాగానీ యుండి యోగ శ్లోకములందు చెప్పబడిన నిబంధనలకు లోబడి యుండుటవల్ల అనేకవిధములయిన యోగములు కలుగుచుండును. ఇవిగాక ద్విగ్రహ, త్రిగ్రహ చాతుర్గ్రహాది యోగములనేకములు సారావళియందు చెప్పబడి యున్నవికూడను. ఇచట ఒకటి రెండు యోగముల వ్రాయుచున్నాను. మరొకరికి యే రైలు గండమో, వ్యాధిగండమో పశుగండమో అది యేవిధ గండమైననూ కలిగి తప్పిపోయినపుడు యే వేంకటేశ్వరుడో యే అంజనేయుడో యే శంకరుడో మావాడిని కాపాడినాడనీ, నా పసుపుకుంకుమ నిలిపారనీ నైజమైన మానవ స్వభావముతో అనుకుంటూ. మ్రొక్కుబడులు మ్రొక్కుటయు, తీర్చుటయు కలుగుట నిజము. కాని. జ్యోతిశ్శాస్త్ర దృష్టితో చూడగా గ్రహదశాంతర్దశా యోగములచే దుర్యోగమనేది కలిగిననూ అతని జాతకమందలి మహద్యోగమేదో యుండి ఈ విపత్తును రక్షించును. ఇందులోనే అ దైవశక్తి ఇమిడియుంటుంది. మనము గ్రహయోగమనుచున్నాము. వారు దేముడు అడ్డుపడినాడని అందురు. అంతియే తేడా. ఈ గ్రహ యోగమనేది మంచి దశాయోగము అందేగానీ, ఛిద్రదశా కాలములందేగానీ నారాయణాస్త్రమువలె సదా సంరక్షించును. ఈ యోగము పనిఅల్లా ఆపత్తులయందు రక్షించట మేను. ఇట్టి యోగములు ఒక్కొక్క జాతకములో మూడు, నాలుగు యోగములు కలుగవచ్చును. ఉదాహరణకు ఈ యోగము చూడ

వచ్చును. మంత్రేశ్వర ఫలదీపికాయాం షష్ఠోZధ్యాయః శ్లో॥ 28 శ్రీ కంఠయోగము—

(1) లగ్నాధీశ్వర భాస్కరామృతకరాః। కేంద్ర త్రికోణాశ్రితాః
స్వోచ్చస్వఋక్ష సుహృద్గృహానుపగతాః। శ్రీకంఠయోగోభవేత్॥

అని కలదు. (1) లగ్నాధిపతి (2) రవి (3) చంద్రులు ముగ్గురూ కేంద్ర కోణ స్థానగతులై అస్థానములు ఉచ్చ - స్వక్షేత్ర - మిత్ర స్థానములుగ యుండిన ఈ శ్రీకంఠయోగము పట్టును.

(2) శ్రీకంఠయోగఫలము—

రుద్రాక్షాభరణో విభూతి ధవళచ్ఛాయో మహాత్మా శివం
ధ్యాయత్యాత్మనిసన్తతం సునియమః శైవవ్రతే దీక్షితః॥

అని కలదు. ఇట్టి యోగమున బుట్టినవాడు రుద్రాక్షధారణ, విభూతులు ధరించి శుభకాంతి కలిగి సదా శివధ్యాన తత్పరుడై శివవ్రతదీక్షాపరుడై సునియమములు కలిగి అపర మార్కండేయుడుగా యుండును ఇట్టివానిని సమీపించుటకు మృత్యుదేవతకూడ వెరుస్తుంది. ఇట్టి మహాపురుషునకు వచ్చే గ్రహపీడలుగానీ, దశాఛిద్రవిశేషములుగానీ, అపకారము తలపెట్టు ద్రోహులుగానీ. ఈ యోగబలము ముందర అగ్నియందుపడు మిడుతలవలె పత్తాలేకుండా తొలగిపోవుచుందురు. యోగబలము ఇట్లుండును.

ఇచట మరొకయోగము చూడగోరుచున్నాను. ఇది బుధాదిత్య యోగము. సహజముగా రవి బుధులు సన్నిహితముగానే వుందురు. యెప్పుడోమాత్రము దూరమగుచుందురు. ఇట్టి రవి బుధుల కలయి నుక ప్రతివారూ నా జాతకమున బుధాదిత్యయోగము గలదని ఆత్మ

సంతృప్తిని పొందుచుందురు. ఈ బుధాదిత్యయోగము (1) మేషము (2) మిధునము (3) సింహము (4) కన్యలయందు వున్నపుడే కలుగును. తదితర రాసులందు రవి బుధులున్నా యీ యోగఫలముండదు. పై నాలుగు రాసులూ షష్టాష్టమ వ్యయస్థానములుగ యున్ననూ, ఈ యోగఫలము అతనిని సుదర్శన చక్రమువలె కాపాడును. షష్టాష్టమ వ్యయభావములుగాక, సుస్థానస్థితి కలిగినపుడు ఈ యోగబలము చెప్పనలవిగానిదిగ యుంటుంది. మరొక మహాయోగము వ్రాయుచున్నాను. ఇది గజకేసరీయోగము. జాతక పారిజాతమున "గజకేసరీ యోగం" 213 పేజీలో—

శ్లో॥ కేంద్రస్థితే దేవగురౌ మృగాంకాద్యోగస్తదాహుర్గజకేసరీతి
దృష్టేసితార్యేందుసుతైశ్శశాంకే నీచాస్తహీనైర్గజకేసరీస్యాత్॥

అని కలదు. గురువు చంద్రునకు కేంద్రమందు యుండి (స్థానాది షడ్బలము అవసరము) నపుడుగానీ, నీచాస్తంగతములు పొందని పూర్ణశుభులయిన బుధ, గురు శుక్రులచేగానీ, చూడబడినపుడుగానీ ఈ యోగము పట్టును. ఈ యోగమును గురించి గ్రంధములలో భిన్నాభిప్రాయములు గలవుకూడను.

## సమసప్తక నీచగ్రహ రాజయోగము

తమిళ సూత్రములలో రెండు ఉచ్చగ్రహములు–సమసప్తక స్థితిగా వుండడం యెంతో మహాదోషకరముగా చెప్పబడినది. 62-64 పేజీలలోని జాతకములు ఉదాహరణగా యివ్వబడినవి. యిదే విధముగా రెండు నీచగ్రహములు సమసప్తకరంగా వున్నపుడు, మహారాజయోగమని 66-68-75-76 పేజీలలోని జాతకములు

ఉదాహరణలుగా యివ్వబడినవి. "నీచనై నీచన్‌పాత్రాశ్ కిట్టుడుం రాజ యోగం" అని చెప్పుకొనవలసి వుంటుంది (యిది నా పరిశీలనా నుభవము)

శ్లో॥ గజకేసరీ యోగఫలం—

కేసరీవ రిపువర్గ నిహన్తా ప్రౌఢవాక్ సదసి రాజసవృత్తిః
దీర్ఘజీవ్యతియశాః పటు బుద్ధిస్తేజసా జయతి కేసరియోగే॥

అని మంత్రేశ్వర ఫలదీపికయందు షష్ఠోధ్యాయమున గలదు. ఈ యోగమున జన్మించినవారు సింహ్వమువలె శత్రుసంహారకులను గంభీరవాక్కు, రాజస జీవనమూ, బహుకాలము జీవించువారు, యెక్కువ కీర్తిగలవారు. బుద్ధి పాటవముగలవారు అమితతేజో మూర్తులుగను జయస్వభావముగలవారును అగుదురు అని అర్థము. ఉదాహరణకు ఈ జాతకము చూడవచ్చును. 1861 సంవత్సరం మే నెల 7వ తేదీ తెల్లవారుఝామున గం. 4-42 నిమిషములకు అశ్వినీ చతుర్థ చరణయుక్త మీనలగ్నమందు జననం (కలకత్తా).

| | | | |
|---|---|---|---|
| ల చ | రబు శు | | కే కు |
| | రాశి | | గు |
| | మీనము | | శ |
| రా | | | |

జన్మకాల కేతు దశాశేషం. సం. 1 మా 0 రోజులు 27 మాత్రము పై నుదహరించిన గజకేసరీ యోగమందు చెప్పినటుల చంద్రునకు కోణమందు గురువు యుండి నీచాస్తంగతములు పొందకనే యున్నాడు. ఇది విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్ జాతకము.

చంద్ర గురువుల పరివర్తనా యోగముగాక. జ్ఞానకారకుడగు గురువు ఉచ్ఛస్థుడై బుద్ధి స్థానాధిపతి చంద్రుని తన లగ్నమునూ చూచుట చేతను, మనోకారక చంద్రునకు బుద్ధి స్థానమందలి బృహస్పతికీ

పరిపూర్ణబలముకలిగి ఆత్మశుద్ధి కాయశుద్ధి పొందుటకు దోహదమైనది. మరియు ద్వితీయమందలి రవి బుధుల బుధాదిత్యయోగము కలిగి నందున, ఈవిధముగా ఆత్మకారక రవిబలము, మనోకారక చంద్ర బలము, బుద్ధిస్థానమందలి బృహస్పతిబలము యేకమయినందుననే శ్రీ రవీంద్రనాధఠాగూరు విశ్వకవి బిరుదము పొందకలిగినారు. శత్రుస్థానమందలి శనియు శత్రుసంహారకు డయినందున వీరు అజాతశత్రువుగనే యున్నారు. వెనుక వ్రాసిన గజకేసరీ యోగఫలము లన్నియు పూర్తిగా వీరియందు మూర్తీభవించి యున్నవికూడను. ఈ విషయములను మనస్సులో యుంచి రవీంద్రుని పటముముందు నిల్చొని ఆ మహాకవి ముఖావలోకనచేస్తే అన్నియు అచ్చుగ్రుద్దినట్లు వారి ముఖంలో ద్యోతకమగుతవి. రవి, చంద గురు బలాదులచే వాక్శుద్ధి, ఆత్మశుద్ధి కాయశుద్ధులను పొందినారు. యోగబలమనేది ఈ విధములుగా యుండునుగాన, ముందు జాతకమందలి యోగములను చూడవలయును. ఇక సామాన్య జాతకములందు ఒకటి రెండు దశలు బాగుండుటవల్ల సుఖజీవనాదులూ, ఒకటి రెండు దశలు వ్యత్యస్తములు గను యుంటవి. ఇవి అంత కీర్తిప్రతిష్ఠలు పొందజాలవుకూడను. ఈ గజకేసరీయోగమే స్త్రీ జాతకమున చూడవలసినపుడు చంద్రుడు గురువునకు కేంద్రమందుండ వలయును. మంత్రేశ్వర ఫలదీపికా యాం షష్ఠోధ్యాయే—

"స్త్రీణాం తద్వ్యత్యయేస్యా చ్ఛ సిని సురగురోః కేంద్రగే కేసరీతి" అని ప్రమాణము కలదు

## మంద్రికా యోగము

ఇదే గురు చంద్ర కేంద్రస్థితితో శుక్రునికూడ కేంద్రమందు చేర్చి జాతకానుభవసారమున దశమభావమున ముద్రికాయోగముగ చెప్పబడినది.

శ్లో॥ విధోః కేంద్రగతే జీవే। జీవాత్కేంద్రగతే భృగౌ
ముద్రికాయోగ మాప్నోతి। జాత ప్రత్రి నసంశయః॥ అనికలదు.

ఇంతమాత్రముననే ముద్రికాయోగము కలుగుట దుస్తరము. చంద్రు నకు కేంద్రమందు గురువూ, గురువునకు కేంద్రమందు శుక్రుడు యుండి స్థానాది షడ్బల యుక్తులై బలీయులైన రవి కుజుల బలము గాని శని, రాహు బలాఢ్యులుగానీ, దశమాధిపతి పూర్ణబలుడుగాగానీ యున్నపుడే ముద్రికాయోగమునకు బలము కలుగును. పై శ్లోకమున చెప్పినటుల కేవలము చంద్ర, గురు శుక్రులు క్రమాగత కేంద్ర గతులయినపుడు మహత్తర విద్యాయోగములు ఉన్నత గజారోహ ణాదియోగములు, బహువిధ సన్మాన యోగములుమాత్రమే కలుగును. ముద్రికాయోగము కలుగదు. కొందరి మతమున ముద్రికాయోగమనేది యే ఉన్నత న్యాయమూర్తిదిగనో భావించుదురు. ఈ కలికాలమునకు ఇది సరిగాదు. ఇట్టి ముద్రికాయోగము ఉన్నత న్యాయస్థాన న్యాయ మూర్తులకేగాక గవర్నర్లు, రాష్ట్రశాసన సభాస్పీకర్లు, పార్లమెంటు స్పీకర్లు ఇండియా ప్రెసిడెంటు మొదలయిన వారలందరకూ వర్తిం చును. కనుక అతను న్యాయమూర్తిగనే వుండనక్కరలేదు. ఈ యోగమునకు కాలక్రమాగత మార్పులనూ మనము గుర్తించ వలయును.

## అన్యబీజోత్పత్తి సంతానములు

పరబీజ సంతానము ఈ కాలమున అధికులుగనే యున్నారు. ఇది శిశువును గనిన తల్లియొక్క లోగుట్టు రహస్యము. ఇది నిజముగా ఆ మాతృమూర్తికే తెలియవలెను. ఈ రహస్యము తెలియని తండ్రి ఆ శిశువును యెంతగనో ప్రేమించును. యిట్టిస్థితులలో కోర్టులవరకూ

వెళ్ళినవారు గలరు. ఇట్టి యోగములను శాస్త్రజ్ఞులు అనాటికే గ్రంథము లందు వ్రాసియున్నారు. బృహజ్జాతకం జన్మకాల లక్షణాధ్యాయ మున ఇట్లు గలదు.

శ్లో॥ నలగ్న మిందుం చ గురు ర్నిరీక్షతే।
నవా శశాంకం రవిణాసమాగతం
సపాపకోఽర్కేణయుతోఽథవా శశీ।
పరేణ జాతం ప్రవదంతి నిశ్చయాత్॥ 1

పశ్యతి న గురు శ్శశినం లగ్నం దివాకరం సేందుం(సారావళి)
పాపయుతౌ వా సూర్యాచంద్రమసౌచ యదిజార జాతస్యాత్॥

అని ఈ యోగములు చెప్పబడినవి. మనము గుర్తించవలసివ విషయము ఇందు ఒకటి కలదు. పై శ్లోకమున జన్మలగ్నమునుగానీ, చంద్రలగ్నముగానీ, గురువు చూడకపోయినచో అన్యబీజ సంతానము అని చెప్పుచున్నది. మరియూ యేకరాశి సమాగతులయిన రవి, చంద్రులను గురువు చూడకపోయినను జారజుడనియే తెలుపుచున్నది. రెండవ శ్లోకము సారావళియందు ఇదే అర్థము చెప్పుచున్నవి. కాని ఈ యోగము నూటికి తొంబది జాతకములకు పట్టుటలేదు. ఈ యోగము నిజమయినచో చాలా పెద్దపెద్ద వారలే తమ ఆత్మలో శంకించుకోవలసి వస్తున్నది. కనుక ఈ యోగము బృహజ్జాతకమున చెప్పబడిననూ అంగీకరించ తగినదిగాలేదు. ఈ గ్రంథముపైనున్న అభిమానముతో ఇట్టి ప్రమాణములను నమ్మి ఫలితాలు చెప్పిన విషమ పరిణామ ఫలితములు తప్పక కలుగును. కనుక కాలాను గుణ్యమయిన విధానముగా నడచుట అవసరము. ఇట్టి విషయము

లను వదలి అవసరమయినవాటినే సేకరించవలయును. ఇందుచేతనే బృహజ్జాతకమును కొందరు గ్రంథకర్తలు అంగీకరించలేదు.

శ్లో॥ వృద్ధపరాశరీ–
వరాహమిహిరా చార్యై ర్జైమిన్యాది భిరేవచ
ఫలదా బహవః ప్రోక్తాస్తైకలౌ ఫలదా నహి.

అనగా వరాహమిహిరుని బృహజ్జాతకము, జైమినీ సూత్రములు, కలియుగమున ఫలవంతములుగావు అని చెప్పియున్నారు. మరియూ,

శ్లో॥ కాలజ్ఞై ర్బహుధా ప్రోక్తాః శాస్త్రజ్ఞాన వివర్ధకా
తే యుగాదిషు జ్ఞాతవ్యాః। కలౌ పరాశరి స్మృతా.

అని చెప్పియున్నారు. అనగా శాస్త్రజ్ఞాన వివర్ధకములయిన బహు గ్రంథములు దైవజ్ఞులవల్ల చెప్పవలసియున్ననూ అవి యుగానుసరణముగా గ్రహించుమనియు, కలియందు పరాశరీ మతమే అనుసరణీయమనియు అర్థము. పరాశరులవారు కలియుగానుసరణముగ నిర్ణయించినారని అర్థమగుచున్నది. అమరకోశమున ద్వితీయకాండము మనుష్యవర్గున ఇట్లు గలదు. "అమృతే జారజః కుండో భర్త బ్రతికియుండగా జారునివలన కలిగినవాడు "కుండుడు" అనబడును. మృతే భర్త రిగోళకః" భర్త గతించిన తదుపరి జారునివలన కలిగినవాడు "గోళకుడు" అనబడును. ఇంకా భేదములు ఇతరత్రా ధర్మశాస్త్ర గ్రంథములందు గలవు. గురువు మందగతి గ్రహము అయి ఒక్క సంవత్సరమునకు ఒక్క రాశి దాటుట కష్టము. అది చారాదులచే యెక్కువ కాలము నిలచును. చంద్రుడు అట్లుగాక షుమారుగ రెండు న్నరరోజులోనే ఒకరాశి విడచి మరొకరాశి ప్రవేశించును. నెలఅగు

సరికి షుమారుగ మేషాది మీన పర్యంతం ఒక అవృతి తిరుగును. బృహజ్జాతకమున చెప్పినట్లు విధిగా లగ్నముగాని, చంద్రలగ్నము గానీ రవి చంద్ర సమాగమమునుగానీ, గురువు చూచుచునే వుండ వలయునవిన చో చంద్రగతి-భంగమయి వ్యర్కేంద వుచే కలిగే తిథి వార నక్షత్రయోగ కరణములే భంగమయి సృష్టి విధానమునకే భంగము వాటిల్లును. ఇట్టి యోగము లేనంతమాత్రమున జారజుడనుట శుద్ధ అబద్ధముకూడను. కలియుగమున ఈ విచారణ అనవసరము కూడను. వారి ప్రారబ్దమునకనుసరించి ఇట్టి సంతానములు కలుగుతవి. యుగానుసరణముగా మార్పు అవసరముకూడను.

## అనాయాస మరణము - ఆయాస మరణములు

మంత్రేశ్వర ఫలదీపికాయాం - చతుర్దశోZధ్యాయే – శ్లోకం (21)
సౌమ్యాంశకే సౌమ్యగృహేZథ సౌమ్య సంబంధగే వా క్షయభేక్షయేశే
అక్లేశ జాతం మరణం నరాణాం వ్యస్తే తదా క్రూరమృతిం వదంతి.

అను ప్రమాణమువల్ల క్షయ (12) భావముగానీ, క్షయాధిపతిగానీ సౌమ్యులయిన పూర్ణచంద్ర. బుధ గురు. శుక్ర గ్రహముల సంయోగ విలోకనాదులు పొందినపుడుగానీ, క్షయస్థానము వున్నపుడుగానీ సునాయాస మరణము మానవులకు కలుగును. ఈ శ్లోకార్థమునకు తగినట్లుగనే "రామనాడీ" అనే నాడీగ్రంథమునను ఇట్లు గలదు.

### పద్యము (రామనాడీ)

మోక్షస్థానమునందున యుక్తులుగా శుభులయున్న ముక్తియు కలుగున్
ముక్త్యంధు పాపులున్నను ముక్తివిహీనుండు యిలలో ముదముగ

రామా. అని తేటతెల్లముగ చెప్పినాడు. పై శ్లోకమున చెప్పిన "క్షయ భేక్షయేశే" అను శబ్దమునననుసరించి క్షయస్థానమనగా ఏ భావము అనేది విచారింతము. ఇదే గ్రంథకర్త ద్వితీయోఽధ్యాయమున 16 శ్లోకమున ఇట్లు చెప్పినారు.

శ్లో॥ దుఃఖాంఘ్రి వామపయ నక్షయ సూచకొన్త్య
దారిద్ర్య పాపశయన వ్యయ రిప్ఫబంధాః॥

ఈవిధముగా క్షయభావమనగా పన్నెండవ యిల్లు (ద్వాదశభావం) అని కలదుగాన, క్షయస్థానముగానీ, మోక్షస్థానముగానీ ఈ భావ మేను. ఇట్టి వ్యయాధిపతి పాపుడయి శుభసంయోగ విలోకనాదులు లేనపుడు ప్రబల పాపసంయోగ విలోకనాదులు పొందినపుడు దీర్ఘ కాలరోగ మరణములు. ఆయాస మరణములు సమూహ మరణములు అగ్నిమరణ, జలమరణాదులు ప్రబల శత్రువులచే చిత్రవధతో కూడిన పలువిధములగు దుర్మరణములు పాపులకు సంభవించును. వారి పూర్వకర్మానుసారముగను. కనీసము వ్యయాధిపతి, అంశయందైనను శుభక్షేత్ర, శుభసంయోగములను పొందినగాని అనాయాస మరణము కలుగదు. ప్రబల పాపస్థితి సంయోగ విలోకనాదులచేత రైల్వేప్రమాద ములు, విమానప్రమాదములు, ఓడప్రమాదములు, కారు సైకిలు ప్రమాదములు, బండ్ల ప్రమాదములు కలుగును.

## పూర్వజన్మ-వర్తమానజన్మ-భవిష్యజ్జననములు

శ్లో॥ ధర్మేశ్వరేణైవహి పూర్వజన్మ వృత్తం భవిష్యజ్జననం సుతేశాత్
తదీశజాతిం తదధిష్ఠితరుక్షందిశం హి తత్రైవతదీశ దేశం॥

అనుటచేత నవమాధిపతి ననుసరించి పూర్వజన్మ సంస్కార విశేష మును, లగ్నము ననుసరించి వర్తమాన జన్మస్థితినీ, పంచమాధిపతి ననుసరించి "బుద్ధిః కర్మానుసారిణీ" అనుటవల్ల రాబోవు జన్మ సంస్కార విశేషాదులు చూడవలయును. యే జన్మమును గురించి తెలుసుకొనగోరుచున్నామో ఆ భావ గ్రహముయొక్క కులమును, ఆ గ్రహముయొక్క దేశాధిపత్యము, ఆ గ్రహరాశి దిక్కువల్ల స్థాన మును, ఆ గ్రహ కారకత్వము వృత్తివిచారణలు చేయుమని కలదు. నవగ్రహ ముఖములో ఈ వివరములు ఆయా గ్రహములకు చెప్ప బడేయున్నవికూడను. ఉదాహరణకు చూడుడు. ఒక మేషలగ్న జాతకుని పూర్వజన్మ వృత్తాంతమును విచారింతము. పూర్వజన్మస్థాన మైన నవమాధిపతి గురువగుటచే పూర్వమున సత్కులీన బ్రాహ్మణు డనియు, ఉత్తరదేశమందు వాయువ్య దిక్కునందున్న రాష్ట్రమున తూర్పుదిక్కున గలదనియు వూహగా వూహించవచ్చును. వీటిని దైవజ్ఞుడు గ్రహస్థితిలో కలిపి తన మనోనిర్ణయానుసారముగ చెప్ప వచ్చును. ఇట్లే మిగతా జన్మములను స్థూలముగ గుర్తించవచ్చును. ఇట్టి ఆధారములతోనే నాడీగ్రంథకర్తలు ఈ నిర్ణయములు వ్రాసి వుండవచ్చును. నేటికీ చాలమంది ఈ నాడీగ్రంథ ప్రచారకులకు అధిక ధనమిచ్చి తమ జన్మకాల వివరాదులు చెప్పుకొనుచున్నారు కూడను. ఈవిధముగ వర్తమానజన్మ పరజన్మలనువిచారించవచ్చును.

## ఊర్ధ్వలోక - అధోలోక - మధ్యలోక ప్రాప్తి నిర్ణయములు

శ్లో॥ స్వోచ్చే స్వమిత్రేపతి సౌమ్యవర్గం
వ్యయాధిపేZచోర్ధ్వగతిం స సౌమ్యే

విపర్యయేZధోగతిమేవ కేచిదూ
ర్ధ్వాస్య శీర్షోదయరాశి భేదాత్॥

అని కలదు. వ్యయాధిపతి శుభుడై తన ఉచ్చ స్వక్షేత్ర మిత్రక్షేత్రములు మరియు సౌమ్యగ్రహరాశిస్థితీ, అధికులైన శుభులతోగాని, సంయోగస్థితుల పొంది ఊర్ధ్వముఖమైన శీర్షోదయరాశిని పొందినపుడు కాని, వ్యయభావమును చూచుటగాని కలిగినపుడు ఊర్ధ్వలోకప్రాప్తి కలుగును. ఇచట ఊర్ధ్వరాసులు యేవియో చెప్పలేదు. ముందు వీటిని తెలుసుకొనుట అవసరముకూడను. మిథున, సింహ, కన్య, తుల, వృశ్చిక, కుంభరాసులు శీర్షోదయములగును. ఈ రాసులలో ఒకటి వ్యయభావమై అందు శుభగ్రహములుండిన (ఆధిపత్య పాపాదుల విచారణ అక్కరలేదు) ఊర్ధ్వలోకములైన స్వర్లోకాదినివాసములు కలుగును. వ్యయభావము మేష, వృషభ, ధను, కర్కి, మకరములైనచో యివి పృష్టోదయరాసులైనందున ఇందలి శుభగ్రహస్థితిచే తిరిగి మర్త్యలోక (మానవ) పాతాళలోకాది స్థానగతి పొందును. ఇక మీనరాశి ఉభయోదయమైనందున ఇంతలి శుభస్థితిచే కొంత కాలము స్వర్గలోకాదిస్థితిగలిగి తిరిగి అధోలోకములకు పొందును. ఈ యోగము ఒక్క మేషరాశివారికే కలుగును. కాషాయ, కౌపీన, దండ కమండలుధారులందరు మేము ఆత్మవిచారణతోనే మోక్షము పొందుతాము అనెదరు. అతనెంతటి స్వాములవారైనా వారి జాతకమున వ్యయభావము శీర్షోదయరాశియై శుభగ్రహాదులున్నగాని—బ్రహ్మలోకప్రాప్తిగానీ మరేదిగానీ రానేరదు. నిస్సంశయము. ఈ యోగము లేనివారి ఆలోచనలు ఆకాశసౌధ నివాసములగును.

## పునర్జననాదులు యెచట?

శ్లో॥ కైలాసం రవి శీతగూ భృగుసుతః స్వర్గం మహీజో మహీం
వైకుంఠం శశిజో యమో యమపురం సద్బ్రహ్మ లోకం గురుః
ద్వీపాన్ భోగివరః శిఖీతు నిరయం సంప్రాపయే త్ప్రాణినః
సంబంధా ద్వ్యయనాయకస్య కథయే త్తత్రాంత్యరాశ్యంశతః॥(1)

స్వోచ్చే తదీశేసతి దేవ భూమిం ద్వీపాన్తరం నీచరిపుస్థలస్థే
స్వరేక్ష సుహృద్భే సమభేస్థితేవా సంప్రాప్నుయా
ద్భారత వర్షమేవ॥ (2)

ఆర్యావర్తం గ్రహ్నతేః పుణ్యవద్యః॥
కాన్యేన్ద్వోశ్చజ్ఞస్య పుణ్యస్థలాని
పంగోర్వింద్యా మ్లేచ్ఛభూస్త్రీష్ణభానో।
శైలారణ్యం కీకటం భూమిజస్య॥

వ్యయభావమందున్న రవిచంద్రులవల్ల కైలాసప్రాప్తియు. శుక్రుని వల్ల స్వర్గప్రాప్తియు, అంగారకునివల్ల భూలోకప్రాప్తియు, బుధుని వల్ల వైకుంఠప్రాప్తియు. శనివల్ల పరలోకప్రాప్తియు, గురువుచే బ్రహ్మలోకనివాసము, రాహువుచే ద్వీపప్రదేశములు – పశ్చిమదేశ జన్మములు, కేతువుచే నరకము కలుగును. వెనుక కేవలము శుభ గ్రహములకే ఫలితములుచెప్పి ఇచట పాపులకు ప్రత్యేకఫలములు ఈవిధముగా చెప్పియున్నారు. దీనినిబట్టి శుభపాపుల సంబంధా సంబంధస్థితి మేళనముచే సమయోచితనిర్ణయములు చేయుమనియు ధ్వనించుచున్నది. కేవల వ్యయభావమందలి గ్రహములనేగాక బుద్ధిస్థాన కర్మస్థాన గ్రహాదులనుకూడ చూచి సమన్వయాదులు చేయ

వలసియుంటుందని తెలియుచున్నది. బ్రహ్మజ్ఞానాదిచింతలు పంచ భావమునకును. సత్కర్మ క్రియాసిద్ధులు దశమభావమునకు పరిమిత ములై ఈ రెండు మానవుని మనుగడకు ప్రధానములుగాన వ్యయ భావములతో వీటిని సమన్వయపరచి పరలోకాదులు నిర్ణయించవలసి యుంటుంది. వ్యయాధిపతి తన ఉచ్చయందున్నపుడు ఆ గ్రహము నకు చెప్పబడిన ఉత్తమలోకప్రాప్తి కలుగును. ఈ వ్యయాధిపతి నీచశత్రుక్షేత్రగతుడైనపుడు, ద్వీపాన్తరములైన అమెరికా, రష్యా, లండను వగైరా దేశజననములు కలుగును. వ్యయాధిపతి స్వక్షేత్ర మిత్రక్షేత్ర. సమక్షేత్రాదులందున్నపుడు తిరిగి అతను భారతదేశ మందే జననమొందును. వ్యయభావము శీర్షోదయ రాశిమాత్రముకాక యుండి పృష్ఠోదయ, ఉభయోదయ రాసులైనపుడు గురువు స్వక్షేత్ర, మిత్రక్షేత్రాదులు పొందియున్నపుడు ఆర్యావర్తమునందే మరల జన్మించును. వింధ్య పర్వతములకు హిమాలయ పర్వతములకు మధ్యనున్న ప్రదేశము ఆర్యావర్తమనబడును. ఇటులనే శుక్ర చంద్రులచే మహాపుణ్య నదీతీర దేశములందు జననమగును. బుధు నిచే ప్రసిద్ధ పుణ్యక్షేత్రములందు జననమగును. శనివల్ల తురుష్క రాజ్యములైన ఈజప్టు, అరేబియా, టర్కీ మొదలగు దేశజననము పొందును. రవివల్ల పర్వతములు, అరణ్యములతో గూడిన ప్రదేశ జననము కలుగును. అంగారకునివల్ల ముండ్లపొదలు అతికటుప్రదేశ ములు, ఊసరక్షేత్ర ప్రదేశములంధు జననమొందును. ఈవిధము లుగా పునర్జన్మవిధానములు మన హిందూ జ్యోతిశ్శాస్త్రమున గలవు. ఇట్టి నిర్ణయాలు పాశ్చాత్య (ఇంగ్లీషు) జ్యోతిశ్శాస్త్రమున లేవుకూడను. ఇందుకు మనవారెంతటి కృషి యీ శాస్త్రమున చేసియున్నదీ, ఈ విధముగ తెలియుచున్నది.

# స్త్రీ జాతక విశేషములు

శ్లో॥ యద్యత్ఫలం నరభవేక్షమ మంగనానాం
తత్తద్వదే త్పతిషవా సకలం విధేయం
తాసాంతు భర్తృ మరణం విధనే వపుస్తు
లగ్నేందు గం సుభగతా_స్తమయే పతిశ్చ॥

బృహజ్జాతక స్త్రీ జాతకాధ్యాయమున గలదు. స్త్రీలకు చెప్ప బడిన మహాద్యోగములన్నియు భర్తలకు సమకూరుననియు, అష్టమ స్థానముచే మాంగళ్యబలము, లగ్నముచే శరీర సౌందర్యాదులు, చంద్రునిచే సౌభాగ్యలక్షణములును, సప్తమముచే భర్త శుభలక్షణ ములు గ్రహించుమనియు కలదు. ఆడవారిలోకూడ అధికయోగము లను పొందినవారు గతములోను ఈనాడూ గలరు. భర్తలుగాక ఆడవారే అనుభవించుటను మనము విచారించవలయును. వీరు విద్యావంతులగుటయేగాక రాజ్యస్థాన (కర్మభావ)మందు యే కేంద్ర కోణాధిపతుల యోగములో యేర్పడి యుండియుండుటయు, భర్తృ జాతకమున యోగప్రాబల్యాదులు తక్కువయి, వీరే రాణించుటకు కారణములగును. ఇంతేగాక యోగములందలి సరస్వతీయోగ, వీణా యోగ, వల్లకీ యోగాది మహత్తర శుభయోగములుకూడ ఆడవారి జాతకమందుండగా భర్త యెట్లు రాణించగలడు? స్త్రీ జాతకమున దశమ భావమునకు పట్టినవిగాక మిగతా భావముల విషయములు భర్తకు అనుకూలించి యోగించును. ఈనాడు శ్రీ విజయలక్ష్మీ పండిట్ ఇందిరానెహ్రూ, ఇండియా విదేశాంగశాఖ ఉపమంత్రిణి శ్రీమతి లక్ష్మీమీనన్, గుమ్మడిదల దుర్గాబాయమ్మ మొదలయిన ప్రముఖ మహిళామణులు గలరు. వీరు యెంతో ఉన్నత ఉద్యోగములు చేయు

చున్నారుకూడను. ఈవిధముగా వారి జాతకములే అధికమని అనుభవ మున కన్పడుచున్నవి. వీరి భర్తలకు ఈ యోగములున్ననేమో ఆలోచించవచ్చును. వీరితో సమానయోగముగల భర్తలు యే ఒకరిద్దరికో యుంటారు. అరుదయిన విషయమిది. స్త్రీ జాతకములందు యుగ్మ రాశి జననమూ, చంద్రుడు యుగ్మరాశిగతుడై యుండుటయూ ఎక్కువ శుభయోగము. ఇట్లున్నపుడు జాతకమందలి దశారిష్టాది ఫలములు కూడ సామాన్యంగా యేమియూ చేయవు. బృహజ్జాతకమున "యుగ్మేషు లగ్న శశినోః" అనియు, మంత్రేశ్వర ఫలదీపికా ఏకాదశోధ్యాయ మున "ఉదయె హిమకరౌ ద్వాయుగ్మగౌ సౌమ్యదృష్టౌ" అనియు, చెప్పబడియున్న శ్లోకములచే ఇట్టి లగ్న చంద్ర లగ్నములు వృషభ, కటక, కన్య వృశ్చిక మకర, మీన రాసులలోయుంటూ ఈ లగ్నములందు శుభులుండుటగానీ శుభులచే చూడబడుచూగానీ యున్నపుడు బహు సౌభాగ్యలక్షణములు కలిగి, కులకీర్తికరులగుదురు. ఒకటి ఓజిరాశియు మరొకటి యుగ్మరాశియు అయినచో సమగుణములు కలవారూ. స్వేచ్ఛాసంచారులు అగుదురు. ఇట్లున్నను ఒక్కొకపుడు గ్రహయోగములచే మారుటకలదుగాన ఇవియే ప్రధానముగా చూడగూడదు. ఇవి నైజముగా చెప్పబడినవి మాత్రమేను. ఉదాహరణకు మిధున లగ్న జాతకురాలికి లగ్నము బేసియు, తులయందలి చంద్రులచేతను, రెండూ ఓజరాసులగుచున్నవి. ఇట్టిలగ్నమనకూడ శుభగ్రహము లున్నపుడు ఓజఫలితములుగాక శుభమే కలుగును. ఒక్కొకచోటులందు ప్రధానమైన యుగ్మరాశి నిర్ణయముతో బాటు గ్రహస్థితులనుకూడ చూడవలెను. మంత్రేశ్వర ఏకోదశోZధ్యాయ మున మూడవశ్లోక చివరపాదమున —

"అపిధనేస్వయం స్త్రీ మృతిః" అనియు బృహజ్జాతకమున "సత్ఫ్వర్ధగేషు మరణం స్వయమేవ" అనియున్న ప్రమాణములచే ద్వితీయభావమందలి ప్రబల పాపస్థితులచే సువాశినీ మరణము చెందును. ఇట్టి పాపులను స్వల్పముగా శుభగ్రహములు చూచినచో మరి కొంతకాలము జీవించును. ఇక సుఖస్థానమునకూడ పాపులుండుట సుఖమునకు ప్రతిబంధక మగును. మంత్రేశ్వరే "సుఖే పాపైర్యుక్తే భవతి కులటా మందకుజయోః" అనికలదు. శత్రుగ్రహములై చతుర్థమందుండిని శని కుజులచే కులటా లక్షణములు గలుగును. ఇచట గమనించదగిన విషయ మొకటిగలదు. ఈ శని కుజులలో ఒకరు స్వక్షేత్ర ఉచ్చ మూలత్రికోణాదులు పొందియుండగా రెండవ వారిచే కలిగే సంయోగము చతుర్ధ కేంద్రమున కులటాయోగ మీయదు. చేరినవారి భావసంబంధ ఫలములు తగ్గిపోవును. తత్సంబంధ రోగాదులు కలుగును. ఇట్టి శని కుజులకు శుభవీక్షణాదులున్నపుడు వ్యాధులు వగైరా కొంతకాలము తగ్గుటయు, మరికొంతకాలము పీడనాధులు కలుగును. యిక పంచమభావమును చూతము. సహజముగా పంచమభావమే పుత్రస్థానముగ చూచెదము జాతక పారిజాతమున స్త్రీ జాతకమునందు 6వ శ్లోకం రెండవ పాదమున "పుత్రం పంచమ భావతః" అనియు, మంత్రేశ్వరమున "సుతాంశ్చనవమాత్" అనియు భేదములు గలవు గాన పంచమభావమున దోషాదులేవయిన వున్నచో నవమభావమునుకూడ విధిగా చూచి సమన్వయము చేయవలయును. పుత్రస్థానాది పుత్రస్థానము, (9) తపోస్థానముకూడ అయి వున్నది. ఇక సప్తమభావము చూచెదము స్త్రీ జాతకమునకేగానీ పురుష జాతకమునకేగానీ ఈభావమునకున్న ప్రాధాన్యము యెంతయో చెప్పనలవిగానిది. భావకారకత్వమే కాలామృతముననూ తదితర గ్రంధము లందిట్లు గలవు.

ఉత్తరకాలామృతము 104 పేజీ—

శ్లో॥ (1) ఉద్వాహ వ్యభిచారకాముక జయా నష్టాంగనా ద్వేషతా
మార్గభ్రంశ సుగంధ గీత కుసుమామృష్టాన్న పానాదికం
తాంబూలంచ ప్రయాణభంగ దధి విస్మృత్యంబరాద్యాగ మో
రేతో భర్తృ పవిత్రదారయుగళం గుహ్యంచ మూత్రంగుదః.

(2) వాణిజ్యంచ తథాపయో మధుర సౌధస్నాపకాజ్యా శనం
దానం శౌర్య వినష్ట శత్రువిజయాస్థా తాంతరస్థం ధనం
వాదో మైథున దత్త పుత్ర మృతజాస్త్రీ యాన్యదేశే తథా
జాయా మన్మధజం రహస్య మఖిలం చౌర్యం వదే
త్సప్తమాత్.

మంత్రేశ్వరఫలదీపికాయాం - ప్రథమోZధ్యాయే—

(3) జామిత్ర చిత్రోద్ద మదాస్తకామాన్
ద్యూనాధ్వలోకాస్పతి మార్గభార్యాః.

(4) రామనాడీ గ్రంథమున పద్యము—

భార్యలు గామంబు పరసతి కూటంబు। పెండ్లిండ్లు దేవతాప్రీతి ఐక్తి దధిఘృతక్షీరాన్న మధురస సూపంబు।పరిమళాలంకార సరసగుణము వ్యభిచారయోగంబు వెనుకటి పెండ్లిండ్లు।పరసతి గమనంబు పరులుగ వయు। పుత్రులు దాస గోపురశాల దుఃఖస్థానంబు। కన్యకాదారగుణము భోగలక్షణ వర్ణ సంభోగ, యోని, స్తన్య చుంబన । అధరోష్ఠసౌర మంత్రఫలము లన్నియు సప్తమభావంబున గాంచిరి మునులు। ఈ రీతిగ వినుము రామా.

ఇట్లు బహువిధ ఫలములు ఈ భావమునకు చెప్పబడినవి. సప్తమ భావము ననుసరించి ప్రథమ కళత్రమును, అష్టమ భావము వల్ల ద్వితీయ కళత్రము, తృతీయభావమున తృతీయ కళత్రమును

ఆ యా భావములందలి పాపగ్రహాది విచారణచే చూడవలయును. ఇట్టి సప్తమాధిపతి బలీయుడయి సపమునగానీ, లాభమునగానీ యున్నపుడు జూదములయందు ధనలాభములు కలుగును సప్తమాధి పతికి శత్రుత్వములేని ధనాధిపతి ధనకారకులతో (గురువు) కలసి లాభరాశి గతుడయినపుడుగానీ, సప్తమమునగానీ, ద్వితీయమునగానీ యున్నచో, లాటరీ ధనములు, పరస్త్రీ ధనములు, అకస్మికధనలబ్ధములు కలుగును. స్త్రీ పురుషాను లెవరకేగాని మరియు సప్తమ భావమునకే ఉద్యానవన విహార, తటాకాదులు జలక్రీడలూ, లలితకళలూ, సినిమా విషయాలు కలుగుచున్నందున స్త్రీలకు జూదములవల్లగాకపోయినా ఈ రూపముగా లాభించును. ప్రతి స్త్రీకి పుణ్యలబ్ధాను సారముగ భర్తృ సుఖాదులు, దీనిపైన ఆధారపడియున్నవి. భర్తృ సుఖమూ, అలనా లాలనలులేని నారీజీవితమే. సర్వసుఖములున్ననూ నరకజీవితముకాగదు. యెందరో స్త్రీలు పసుపు కుంకుమలు పంచి పెట్టునదీ, వ్రతాదులు చేయునదీ ఈ సుఖము కొరకేను. సప్తమస్థానమందలి శుభగ్రహస్థితిచే విద్యావంతుడూ అనుకూలుడైన భర్తలభించును. సప్తమమందలి కేవల పాపులచే కుపురుషుడునూ. దురాచారపరుడు లభించును. అయితే ఈ పాపులలోకూడ ససమాధిపతి పాపియై స్వక్షేత్రగతుడయిన సద్భర్త కలుగును. లగ్నాధిపతికీ ఈ సప్త మాధిపతికీ నైసర్గిక తాత్కాలిక వైరములున్నచో దంపతులు నిత్యమూ కలహపీడితులగుదురు లేక వియోగాదులు తరచు పొందుతారు. దుర్బలులైన పాపులు సప్తమ మందుయుండి శుభదృష్టి కలిగినచో భర్తచే విడువబడును. నీచభంగము పొందని పాపులు సప్తమభావమునయున్న భర్తతో కలహించునది అగును. మరియు బృహజ్జాతకమున స్త్రీ జాతకాధ్యాయమున 9వ శ్లోకం—

శ్లో॥ అగ్నేయై ర్విధవా స్తరాశి సహితైర్మిశ్రైః పునర్భూ భవేత్॥

అనియు మంత్రేశ్వరఫలదీపికా యేకాదశోధ్యాయమున శ్లోకమున-

శ్లో॥ అగ్నేయైర్మదనస్థితైశ్చ విధవా మిశ్రైః పునర్భూ భవేత్॥

అనుశ్లోకములవల్ల "ఆగ్నేయైః" అనగా పాపగ్రహములు, రవి, కుజాదులు అగుచున్నారు. వీరు సప్తమ భావమందున్నపుడు విధవయు, శుభ పాపగ్రహములు సమబలులై యుండగా పునర్వివాహముగానీ (మరొకరితో) వితంతు వివాహములుగానీ కలుగును. శుక్ర-కుజులు పరస్పర క్షేత్రగతులయిన భర్తను విడచునది, స్వేచ్ఛానుసారిణియు, అభిసారికాత్వమును పొందును సప్తమమందు శని-కుజుల యుతిచేత భగరోగాదులు గలదియు, కపటియు వారాంగనవలె సంచరించునది, తుదకు వైధవ్యము పొందునదీ అగును. శుక్ర-శనులు పరివర్తనా గ్రహములయి పరస్పర దృష్టి కలవారయిన అధిక కామాసక్తి గలదగును. సప్తమమున రెండు పాపగ్రహములున్న కామాధికురాలు, విధవయు నగును. ముగురు పాపులున్న భర్త మరణానంతరం వ్యభిచరించును. ఇక శుభగ్రహములు సప్తమమున ఒకటికిమించి యెన్ని యుండిన అన్ని సుగుణాధికము లగును. సప్తమమందలి ప్రబల శుభులచే తుదకు రాణికూడ కాగలదు. ఉదాహరణకు చూచెదము. మీనలగ్నమై సప్తమమున కన్యయందు చంద్ర, బుధ, గురు, శుక్రాదులచే మహత్తరయోగముగల రాణిగానీ, రాణీతుల్యయోగముగానీ తప్పక కలుగును. సప్తమమందలి షష్ఠాష్టమ వ్యయాధిపతులవల్లను, వైధవ్యము కలుగును. ఈవిధముగ అనంత ప్రభావముగలది సప్తమ భావం. ఇక అష్టమభావము విచారింతము—

శ్లో॥ మాంగళ్య రంధ్ర మలినాధపరాభవాయుః
క్లేశాపవాద మరణాఽశుచి విఘ్నదాసాన్॥ అని కలదు.

మంగళములకు ఈ భావము స్థానమైనందుననే మాంగళ్యభావమని నారు. పురుషులకయినను, స్త్రీలకయినను ఇదేభావము. ఈ భావము యెంత శుభగ్రహ యుతముగా యున్నచో స్త్రీలకు అంత దీర్ఘకాల సౌమంగళ్యమును. కలిగించును. ప్రతి నారీమణియు కోరునది ఈ మాంగళ్యమేను. వారి పసుపు కుంకుమకు, సౌభగ్య లక్షణములకు యిది మూలము. దీనికోసమే వృద్ధాప్యములోగూడ భర్తయొక్క అవసానస్థితి కాలములందు బహువిధములుగా ఒకరొకరు పరితపిస్తారు. అష్టమస్థానమందలి పాపగ్రహస్థితి వేధలచేతను నీచగ్రహాదులవల్లను ప్రబల శత్రుగ్రహ యుతులచేతను, మంగళములకు బదులు, మలినత్వమూ, శత్రుపరాభవములు, ఆయుక్షయము, మనః క్లేశములు, అపనిందలు, శీఘ్రకాల మరణములు, అశుచిగాయుండుటయు సర్వ కార్యములకు విఘ్నములతో గూడిన అమంగళములే కలుగుతవి. అష్టమ శుద్ధి శుభగ్రహస్థితీ, శుభవిలోక నాదులున్నపుడు పైచెప్పిన అమంగళములకు మారు అన్నీ మంగళకర శుభపరంపరలు కలుగును "యోయోభావస్స్వామి దృష్టో యుతో వా తస్య తస్యాభివృద్ధిః" అనియు, "భావా స్సర్వేశుభపతియుతా వీక్షితా వా శుభేశైః । తత్తద్భావా స్సకల ఫలదాః పాపదృగ్యోగ హీనాః" అను న్యాయములచే పాపుడయినను, అష్టమమున తన వుచ్ఛ స్వక్షేత్ర,మూల త్రికోణాదులందున్నపుడు అర్ధఫలప్రదుడుగను, ఇట్లుండియు నైసర్గిక శుభులచే చూడబడుటచే త్రిపాదశుభుడును అగును. బృహజ్జాతకమున స్త్రీ జాతకాధ్యాయమున ౧౫ శ్లోకమునను "క్రూరోష్టమే విధవతా నిధనేశ్వరోంశే। యస్య స్థితోవయసితస్య సమే ప్రదిషా" అనియూ, మంత్రే

శ్వర ఫలదీపికయందు "క్రూరోష్ఠాయుషి భర్తృహంత్రీ" అనియు కాళిదాస కేరళియందు "వైధవ్యం నిధనస్థానే" అనియు, జాతకపారి జాతమున, "ఛిద్రాచ్ఛతేషాం మృతిః" అను న్యాయముగానూ, "పాప గ్రహాః షష్ఠమృతి వ్యయస్థాః । తద్భావవృద్ధిం కలయంతి దోషైః । అను బహువిధ ప్రయాణములచేత అష్టమస్థానమందలి అనగా మాంగళ్యభావమందలి ప్రబల పాపస్థితి సంయోగ విలోకనాదులచే స్త్రీలకు తప్పక వైధవ్యమును, జలమరణాదులు, అగ్నిమరణము, స్వకీయమైన ఆత్మహత్యాదికములకు పాల్పడి, ఆయా రాశి గ్రహములకు చెప్పబడిన దుర్మరణములు తప్పక పొందుతారు. ఇట్టి మాంగళ్య బలమునకే మంగళగౌరీ వ్రతాదులు స్త్రీలు చేయుదురు మరియు పాపుడయిన అష్టమాధిపతి అంశయందున్న రాశ్యాధిపతియొక్క దశాకాలమందు వైధవ్యము కలుగును. ఆయా రాశి గ్రహస్థితులచే కలిగే మారకవిధానములు మంత్రేశ్వర ఫలదీపికా చతుర్దశోధ్యాయ మందలి రోగనిర్ణయ – మరణ ప్రకరణములందు విపులముగా గలవు. గ్రంథ విస్తరభీతిచే వదలుచున్నాను. అష్టమభావము శుద్ధిగాయుండి, భావాధిపతీ, అందలి శుభగ్రహముల పూర్ణబలములచేత బహుకాల మాంగళ్యబలము తప్పక చేకూరును.

## లగ్న - వాహన భావ విశేషములు

ద్వాదశభావములకు మూలమైనది ప్రధానమైన తను భావము ఇట్టి తనుభావమునకు శుభయోగము కలుగునపుడూ; అధిక దుర్యోగ ములు పట్టినపుడూ, మహారాజయినా, కోటీశ్వరుడయినా, సకల సౌ భాగ్యములు కలిగియు, అవి అనుభవించలేని దరిద్రుడగుచున్నాడు. ఇట్టి లగ్నమునకు శుభయోగములు గలుగనిచో, శ్రీమంతుడయినా

యేదో ఒక ప్రతిబంధక పీడితుడగుచూ సౌభాగ్యముల పొందజాలడు గాన. తను భావాధిపతిబలము అత్యవసరము. ఈతను భావము (లగ్నము) శుభవంతముగా యున్నచో. కూలీనాలీ చేయు శ్రమ జీవియు, ఆరోగ్యసౌభాగ్యములను, మానసికసుఖమూ పొందును. తను భావమునకు పట్టు దుర్యోగములు ఈవిధములుగా యున్నవి. కాళిదాసకేరళీ తనుభావ విచారమునను—

(1)శ్లో॥ దేహనేతరి శుభేతరి గ్రహై। రన్వితేత్రికగతే విలాసిని
దేహసౌఖ్య మిహనేతి జన్మనో। వాచ్యమంబురుహ
జైత్రలోచనే.

(2) దేహాధీశేత్రికే వాపి। త్రికేశ్వర సమన్వితే
రూపం వర్ణం తథాసౌఖ్యం॥ వృత్తిర్వాచ్యం న జన్మనః.

అన్ని యున్నందున, లగ్నాధిపతి ప్రబలపాపయుతుడై (6-8-12) త్రికాదిస్థానములు పొందుటయూ. ఈ స్థానాధిపతులతో కలియుట గానీ శత్రు, నీచక్షేత్రములు పొందుటయు కలిగినచో, దేహసౌఖ్య హీనతయు, అల్పకాల జీవితము. ప్రయాసతో గూడిన జీవనములు, దీర్ఘకాలరోగములు సంప్రాప్తించును. మరియు. "దేహనేతరి పాపాన్వితే వా త్రికగతే వా జాతస్సౌఖ్యేన హీనస్స్యాత్ న రోగపీడితః" అనియు కలదు. దీనినిబట్టి దేహసుఖం మాత్రముండదనియు, రోగ పీడితుడు కాదనియు తెలియుచున్నది. ఈ ఫలితము లగ్నమున షష్టాష్టమ వ్యయాధిపతులు లేనపుడు, లగ్నాధిపతి త్రికాధిపతులతో కలియక యుండి కేవల త్రికస్థానములు (6-8-12) పొందినపుడు మాత్రమే కలుగును. అనగా రోగపీడనములేక యుండి శరీర సుఖ సౌఖ్యములుమాత్రమే తగ్గిపోవును. మరియు, "లగ్నేశ చంద్రాధిష్టిత

రాశీశ్వరౌ షడాదిషు స్థితౌ రోగాదికం జాతస్య భవతి" అనియు కలదు గాన, లగ్న, చంద్రలగ్నములు అందలి త్రికాధిపతులవల్లను, లగ్న, చంద్రలగ్నాధిపతులు (6-8-12) భావాధిపతులతో కలియుటగానీ, షష్ఠాష్టమ వ్యయస్థితిచేగానీ, దేహసౌఖ్యము లేకుండుటయో దీర్ఘ రోగములో తప్పక కలుగుతవి. దైవజ్ఞుడు ఈ రెండింటిలో జాతకున కేవియున్నదీ జాతకమునుచూచి సందర్భోచితముగా నిర్ణయించవలసి యుంటుంది. అయితే లగ్నాధిపతికి త్రికాధిపతులతో మైత్రి యున్న పుడుమాత్రము రోగబాధలుండక కేవల సుఖభోగాదులుమాత్రమే తగ్గిపోవును. ఈ నా మిత్రుని జాతకము చూడగోరుచున్నాను. శ్రీ రౌద్రి సం॥ర శ్రావణ బహుళ సప్తమీలు శనివారం రాత్రి షుమారు గం. 8-30 ని॥కు కృత్తికా తృతీయ చరణయుక్త మీనలగ్నమందు జననం. తెనాలి తాలూకా మండూరు గ్రామము. నామధేయము చావలి సుబ్బారావు. ఇతని జాతకమున లగ్నాధిపతి షష్ఠవ్యయాధిపతులతో చేరి రోగస్థానమున మిత్రరాశి గతుడయి రాజ్యస్థానము చూచుటచేత ఇతను నడచునపుడు ఒక వెదురువాసమువలె

| | | | |
|---|---|---|---|
| ల | కే | చ | |
| | రాశి | | |
| | మీనము | | రబు గుశ |
| | కు | రా | శు |

నుండును. ఆరోగ్యము యథోచితముగా గలదు. జీవనాధిపతికూడ గురువయినందున జీవనాధారములన్నియు పోయినవికూడా, ఇటీవల వచ్చిన గురుదశలో అయాచిత జీవనాధారములు కలిగినవి. ఇంతే గాక రవి - బుధులయోగము చాలవరకు దుర్దోషహరముకూడను. వెనుకటి ప్రకరణములలో బుధాదిత్యయోగము త్రికస్థానములందు (6-8-12) న్ననూ. మేష, మిధున, సింహ్వా, కన్యలయందు మాత్రమే యోగించునని చెప్పియున్నాను. ఈవిధమైన అనుభవము

గలదుకూడను. ఇక మంత్రేశ్వర ఫలదీపికా పంచదశోధ్యాయము నను, వింశోZధ్యాయమునను ఈ శ్లోకములిట్లు గలవు.

(1) శ్లో॥ యద్భావేవ్య శుభోపివోదయపతిః తద్భావవృద్ధిం దిశేత్
దుస్థానాధిపతి స్వచేద్యదితనోః ప్రాబల్య మన్యస్య న
(2) రంధ్రేశోపి విలగ్నపో యది శుభం కుర్యాత్ద్రవిర్వా శశీ
యద్యేవం శుభదః పరాశర మతం తత్తద్దశాయాం ఫలమ్.

అని కలవు. మొదటి శ్లోకము ప్రకారము లగ్నాధిపతి తన్వాది ద్వాదశ భావములందెక్కడ యున్నను దోషము కాదనియు, దుస్థానాధిపత్యము (6-8-12)లలో ఒకటికూడ యుంశరాదనియు కలదు. ఈ త్రికాధిపత్యములు మినహా, శేషించిన యే ఆధిపత్యముగల లగ్నాధిపతి యైనను, ఆ భావఫలవృద్ధి కలదని తెలుపుచున్నది. ఇదే గ్రంధకర్త ఈ రెండవ శ్లోకమును వ్రాసియుండుటవల్ల స్వవచనవ్యాఘాతము కలుగుచున్నది. అయితే రెండవ శ్లోకాభిప్రాయము ననుసరించి వ్యయాధిపత్యము మాత్రము లగ్నాధిపతికి కూడదని తేలుచున్నది. "రంధ్రేశోపి విలగ్నపో యది శుభం" అనుటచే ఒకే గ్రహమునకు లగ్నాష్టమాధిపత్యములు మేష-తులలకు, లగ్న షష్ఠాధిపత్యయోగములు వృష-వృశ్చికములకు కలుగుటచే ఇవి యోగప్రదములగును. లగ్న వ్యయాధిపత్యము ఒక్క కుంభలగ్నమునకుమాత్రమే కలుగును ఇదికూడ చాల జాతకములందు యోగప్రదమేనని కన్పడుచున్నది. ఈ రెండు నిర్ణయములచే లగ్నాధిపతికి త్రికాధిపత్యములున్నను ప్రత్యేకమైన త్రికాధిపతులతో కలియక త్రికస్థానములందున్నపుడు తను భావము చెడదు. అనగా ఇతర త్రికాధిపతులతో (6-8-12) కలియుటగాని, చూడబడుటగాని యుండరాదని తెలియుచున్నది.

అనుభవమున యిటులనే సరిపోవుచున్నవి. ఈ తమభావము కేంద్రమై విష్ణుశక్తిగలదగుటచేత ఇందలి పాపవేధలచేత విష్ణుశక్తి లోపించి బహువిధ శరీరప్రయాసలు, అసుఖము, రోగపీడనములు కలుగును. లగ్నాధిపతికి ఇట్టి పాపసంయోగ విలోకనాది స్థానస్థితులచే ఉన్నత వాహనయోగములు పట్టకపోవును. వాహనయోగము పొందునది తను భావమే (శరీరము) గనుక తనుభావమందలి యిట్టి దుర్యోగములు వాహనాదియోగములు భంగపరచును.

ఇక వాహనభావమును విచారింతము "కేంద్రాణాం ప్రబలా ఉత్తరోత్తరం" అను న్యాయముగ విష్ణు దేవతాశక్తిగల ఈ చతుర్థ కేంద్రము లగ్నకేంద్రముకన్న యెంతో శక్తిగలదియు. మానవుని జీవితనిధియై దశమకేంద్రమును లగ్నకేంద్రమును రాణింపజేయు మూలస్థానం. విద్య మాతృ, గృహ, బంధు, మిత్ర భూమి, గోమహిషాదిసంపత్తి సుగంధ సౌరభభోగము, ఉన్నత వస్త్రధారణశక్తి, భూషణాలంకార, పాతాళలోకసంచార, భూగర్భగృహాదులు, పుణ్యనదీక్షేత్రములందలి స్నానదర్శనాది మహత్తరయోగములెన్నియో ఇందు ఆధారపడియున్నవి. మానవుని హృదయస్థానము, ఉచ్ఛ్వాస నిశ్వాసస్థానము ఇదే అయియున్నది. యోగపురుషులైనవారలకు పూర్వకాలికములైన ఉన్నత గజాశ్వారోహణపల్లకీ సంచారయోగములుగాని, ఆధునికములైన విమానము, కార్లు మొదలైన సకల వాహనాదియోగములు ఈ చతుర్థకేంద్రముపై ఆధారపడియున్నవి. ప్రస్తుతకాలమున సర్కారుజిలా ప్రాంతమందలి ప్రతి భూస్వామియు ఇంతో అంతో వాహన సంచారయోగాదులు (టాక్సీ మోటారుసైకిలు) పొందుచున్నారు ఇట్టి వాహనయోగములు విద్యావంతులు ప్రముఖ రాజకీయనాయకులు పొందుటయేగాక చదువుసంధ్యలు రాని ఆ

నాయకుడు అనుభవించుచున్నాడుగాన ఇది వాస్తవికముగా వాహన యోగముగాదు. ఆడంబరిక వాహనము ప్రత్యేకముగా ఆతని భోగ సూచకవాహనము మాత్రమే. ఇక విద్యా, బుద్ధి, వాక్చాతుర్యశక్తిచే (2-4-5 భావప్రాబల్యం) కలిగే గజారోహణాది యోగములే నిజమైన యోగములగును. ఆధునిక కాలమున యిన్నిరకములైన వాహనము లున్నను నేటికీ సర్వప్రభుత్వములు హుందాతనముకొరకు గజ, అశ్వములనే వాడుచున్నవి. ఇండియాలో ఏనుగులు, గుర్రపుబోగీలు వాడుచున్నారు. లండను వగైరా ప్రాంతములందు గుర్రపుబోగీలు రాజలాంఛనములుగ నేటికి యున్నవిగనుక నిజమైన వాహనయోగ మేదో ఈ ధముగనే ఋజువగుచున్నది. సామాజిక వాహనసంచారు లలో భూస్వానము బాగున్నను వాక్కులేని కారణముననుు. బుద్ధిప్రజ్ఞలు లేనందుననుు పరిమిత వాహనయోగపరుడే అగును. ద్వితీయ, చతుర్థ పంచమ భావములలో యేదోఒకటి తగ్గిపోయి ఉన్నతవాహనయోగము పట్టదు. ఉన్నత వాహనయోగములనునవి మహాపురుషులకు (పీఠాధి పతులు వగైరా) పండితులకు, కవులకు, కళాకారులకు, ప్రముఖ రాజకీయపురుషులకు మాత్రమే తరచు సంభవించును. తదితరులకు సకృత్తుగా మాత్రమే కలుగుతవి. కనుక విద్యాభావము నిర్ణయించి నపుడు ద్వితీయ పంచమములుగూడ విధిగా చూచి నిర్ణయించ వలయును. ఒక చిన్నభూస్వామి జాతకమునగూడ నేడు చతుర్థ భావము బలయుక్తముగానే యుంటున్నది. అంతమాత్రమున అతను విద్యావంతుడు కానేరడు. ఇట్టివారలకు ఇండ్లు, భూములుమాత్రమే సమృద్ధిగ యుండును.

మంత్రేశ్వర ఫలదీపికాయాం షోడశోధ్యాయే—

శ్లో॥ దుస్థే సుఖేశే కుజసూర్యయుక్తే సుఖేపివా జన్మగృహం ప్రదగ్ధం
జీర్ణం తమో మందయుతే రియుక్తే పరైర్హృతం గోక్షితి
వాహనాద్యం॥

చతుర్థాధిపతి రవి - కుజులతో కలసి (6-8-12) దుస్థానములందు న్ననూ సుఖస్థానమున ఈ ముగ్గురూ యున్నను (చతుర్థాధిపతికి వీరు శత్రువులుగ యుండవలెను) జన్మగృహము అగ్ని దగ్ధమగును. ఇటు లనే ప్రబల పాపులయిన శని రాహువులు యున్నచో దోపిడీ విధాన ములు, దొంగతనములు, ప్రభల శత్రువులవల్లను సమస్తము దోచు కొనబడి క్రమముగా హరించిపోవును. ఇట్టి స్థానమున ప్రబల శత్రు గ్రహములు రవి-శనులు, కుజ-శనులు, రవి శుక్రులు, కుజ-శుక్ర స్థితులచే హృద్రోగములు (గుండెజబ్బు), విద్యాభంగము, వాహన, జంతు ప్రమాదములు, తదితర గండములు, మిత్రద్రోహము లు కలుగును. ఉన్నత వాహనయోగ మనుభవించునది తమయోగము గాన, వాహనాధిపతి బలమున్నను లగ్నాధిపబలము అత్యవసరము ఈ జాతకము చూడవచ్చును.

1870-8-8 తేదీకి సరియగు స్వస్తిశ్రీ ప్రమోదూతనామ సంవత్సర శ్రావణశుద్ధ ద్వాదశీలు ఇందువారము అస్తమయాది ఘ. ౨౩-౨౮ ని.లకు పూర్వాషాఢ నక్షత్ర చతుర్థ చరణయుక్త మిథున లగ్నమందు బ్రాహ్మీ ముహూర్తమున ఈ బ్రాహ్మణ్యమూర్తి బ్రహ్మకుల జననమొందినారు. జన్మకాల శుక్రదశాశేషం 4 సం. 11 మా. 16 రోజులు మాత్రము.

1950-2-14 నిర్యాణము. ఆంధ్రదేశకవులలో అఖండ కీర్తిసంపన్నులు, తిరుపతికవులలో ప్రసిద్ధకవులునూ, శ్రీ కింకవీంద్ర

ఘంటాపంచానన, విద్వత్కవి, బాలకళానిధి, బాలసరస్వతి, శతావధాని, ఆంధ్రప్రభుత్వ ఆస్థానకవీశ్వరులు అగు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి జాతకము. సాహిత్య లోకములోను, మహాకవి లోకములోను, తుదకు మహారాజలోకములోను అనంతవిజయములు గాంచి ఆంధ్రజాతికి గురుపీఠమయినారు. వీరు వ్రాసిన నానారాజ

| | | | |
|---|---|---|---|
| | | | లగుకు శరా |
| | శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి | | ర |
| | | | బు |
| చం కే | శ | | |

సందర్శనము చదివినచో వీరి ధైర్య సాహసములు, చాతుర్యము అర్థమగును. ప్రముఖరచనలు చాలగలవు కూడను. వీరు వ్రాసిన పాండవోద్యోగ నాటకము–కృష్ణరాయబారము లున్నంతవరకు పామరులదృష్టిలోకూడ వీరు తొలగిపోరు. పనులకాపర్లుకూడ 'అల్లదిగో ద్వారక' అనియూ. 'చెల్లియొ చెల్లకో' అనే పద్యాలు ఆనంద పరవశులై పాడుతారు. అయిదారు దశాబ్దములు మరపురాని యేకచ్ఛత్రి యేలుబడిగా యేలుకున్నారు కవితాలోకమును. తుదకు 'దుందుడుకొప్పగ పెంచినారమీ మీసలు రెండు' అనియు, 'రెండు బాసలకును మేమె సత్కవీంద్రులమంచు' అనియు ధైర్యముగా చెప్పుకొని సంచరించుట చిన్నవిషయముగాదు. ఇక వీరి జాతకవిశేషముల చూచెదము. (1) గురుమంగళయోగము (2) పంచాననయోగము (3) గజకేసరియోగము ('గజకేసరీ యోగోయం చంద్రకేంద్రే బృహస్పతిః') (4) రాశియందలి చంద్ర-కేతువులు. అంశయందు యేకరాశిగతులై వృశ్చికమున యున్నందున యేకపాదస్థరాశి వర్గోత్తమాంశము ప్రబలయోగకరము లయినది. లగ్నవాహనాధిపతి బుధుడు మిత్రరాశిగతుడై భాగ్యస్థానమును (కుంభము) చూచుటయు, భాగ్యాధిప శని బుధుని చూచుటచే వాహనాధిపతికి మిత్రబలము

చేకూరినందున మిత్రుడైన తిరుపతి కవిబలము తోడై అనంతశక్తి ప్రసాదించినది. లగ్న (శరీర) వాహనాధిప బుధునకు భాగ్యాధిప బలము చేకూరి బహు వాహనయోగ, అనంత సన్మానములకు మూల మయినది. 'కేసరీవ రిపువర్గ నిహంతా' అను గజకేసరీ యోగబలముచే శత్రువిజయము అనగా కవిలోకవిజయము, నానారాజ సందర్శన రూపక కవితావిజయములు కలిగెను. లగ్న చతుర్థ కేంద్రాధిపతిపై త్రికోణాధిప (నవమ) దృష్టి కలిగినందున కేంద్ర త్రికోణాధిప సంయోగ ఫలములనే యిచ్చినారు. ఈవిధముగా వాహనభావము బలము కలిగి బహు వాహన సన్మానయోగములు తుదకు ఆంధ్ర ప్రభుత్వ ఆస్థానకవీశ్వరులై శనిదశా గుర్వంతరకాలమైన దశా ఛిద్ర కాలమున స్వర్గవాసులైనారు. ఈవిధముగా లగ్న చతుర్థ భావములకు యోగములు అవయోగములు కలుగుచుండును. వాహనకారక గురువు లగ్నమందేయుండి లాభాధిపతితో చేరుటకూడ వాహనయోగములను తెలుపుచున్నది. ఇట్టి కుజ గురువులచే గురుమంగళ యోగము కలుగు టయు, లగ్న వాహనాధిప బుధుడు, వాహనకారక గురువు శుభస్థితులు పొందినందున బహువాహన బహుసన్మానయోగములు కలిగినవి. ఇక రెండవవిషయం – కొన్ని జాతకములందు వాహనాధిపతి చెడినను వాహనకారకగురువు, లగ్నాధిపతుల పూర్ణబలముగాని, లగ్నమండలి బహు శుభగ్రహ స్థితులవల్లను, గురుబలములవల్లను తరచుగా వాహనయోగములు కల్గించును.

## విషకన్యాదోషములు – పరిహారములు

ఈ విషకన్యలనేవారిని ప్రముఖముగా జాతకాదులందు చూచుట ఎంతైన అవసరము. ఇట్టి కన్యలను పరిశీలించి వివాహము

చేసుకొననిచో అనేక అమంగళములకు మూలమగును. క్షీరము యెంతమంచిదైనా విషప్రభావముచే వ్యర్థమైనట్లు ఈ విషకన్యా ప్రభావముచే భర్త ఎట్టి సత్పురుషుడైనా తప్పక మృతి చెందడమో లేక ఆకస్మిక దౌర్భాగ్యలక్షణములు పొందుటయో, శ్రీమంతుడు అతిత్వరలో దరిద్రతాయోగములు పొందుటయో తప్పక కలుగును. ఇట్టి స్త్రీలచేత భర్తలు పసుపు పారాణి పాదములతో ఆకస్మిక మృతులగుటయు, జ్వరగండములవల్లను, జలగండములవల్లను, అగ్నిప్రమాదములు హత్యాప్రమాదములు, పెండ్లి బండిప్రమాదములు మొదలైనవెన్నియో కలిగి శీఘ్రమరణములు భర్తలకు కలిగింతురు. కొందరు గర్భాదానాదులుకూడ జరుగకయే భర్తలను కోలుపోవుదురు. తరుచుగా ఇట్టి గండములు విషకన్యాప్రభావాదుల వల్లనే జరుగుచుండును. విషకన్యాలక్షణములు తెలుసుకొనుటకు కాళిదాసకేరళి, జాతకాలంకారాది ప్రముఖ జ్యోతిషగ్రంథములందు తదితర గ్రంథములందు బహువిధములుగా వ్రాయబడియున్నవి. అవి ఇట్లు గలవు.

1. విదియా ఆదివారమునాడు ఆశ్లేషానక్షత్రమున బుట్టిన కన్యకయు
2. సప్తమీ శనివారము కృత్తికానక్షత్ర జననము గలదియు
3. ద్వాదశీ మంగళవారము శతభిషానక్షత్ర జననముగలదియు
4. విదియా శనివారము ఆశ్రేషా జననముగలదియు
5. సప్తమీ మంగళవారం శతభిషానక్షత్ర జననముగలదియు
6. ద్వాదశీ ఆదివారం విశాఖానక్షత్ర జననముగలవారు విషకన్యకలనబడుచున్నారు.

కాళిదాసకేరళీ - స్త్రీ జాతక ప్రకరణే :

శ్లో॥ ధర్మగేహగతే భౌమే లగ్నగే రవినందనే
పంచమే దివసాధీశే సావిషాఖ్యా కుమారికా
విషాఖ్యా శోకసంతప్తా దుర్భగామృతపుత్రికా
వస్త్రాభరణ హీనాచ తత్పతిః కుచ్ఛితో భవేత్॥

అని కలదు. కన్యకాజాతకమున నవమున అంగారకుడు, లగ్నమున శనియు, పంచమమున రవియు యుండగా జన్మించుటకూడ విష కన్యాయోగమని తెలుపుచున్నది. ఇట్టి విషకన్యలు శోకతాపములచే మ్రగ్గువారును, దుష్టయోనిగలవారును, సంతానము నశించువారును, వస్త్రాభరణాదికొరతలు గలవారు, దుష్టభర్తలు పొందువారు కూడ అగుదురని కలదు ఇట్టి విషకన్యలక్షణములను హరించు సుయోగము కూడ ఇట్టు చెప్పబడినది.

కాళిదాసకేరళీ - స్త్రీ జాతకాధ్యాయము—

శ్లో॥ సప్తమే సప్తమాధీశ శుభయోర్లగ్న చంద్రయోః।
విషయోగమలంహంతి సద్యోహరి రిభం యథా॥

అని కలదు గాన కన్యకాజాతకమున సప్తమాధిపతి సప్తమంలో యుండగాను, లగ్న చంద్రలగ్నములందు పూర్ణశుభులుండగానూ అకస్మికము సింహము యేనుగునెట్లు వధించివేయునో అట్లు ఈ విష కన్యాదోషముల తొలగించునని ప్రమాణము. అయితే బలీయులైన శుభులు లగ్నస్తములలో యుంటూ కేంద్రకోణాదులు బలముగా యుండుటవల్లను తొలగును. అనగా యిందు చెప్పని కేంద్రకోణ ములుకూడ ప్రధానమని నా నిశ్చయము. రెండవ పక్షమునను, చతుర్ధ, పంచమ, నవమభావములు శుభదృష్టి శుభస్థితి కలుగుట

దుర్దోషహరములగును. అనగా పంచమభావము బుద్ధికి సంబంధించినదియు, నవమభావము తపోస్థానమగుటయు, చతుర్థభావము సుఖభావము విష్ణుశక్తి గలదగుటచేతను ఈ విషకన్యాది దోషములు హరించునని స్థూలాంగీకారము కాగలదు. "ప్రబలేన దుర్బలం బాధ్యతే" అను న్యాయముగా దోషపూరితమయిన కన్యకాజాతకము తక్కువబలముగల పురుషజాతకుని వేధించును. ఇట్లే పురుషజాతకమున అధికబలము కలిగి కన్యకాజాతకము దుర్బలమయినపుడు కన్యక మరణించుటగాని, వియోగము హొందుటగాని, విడువబడుటగాని జరుగును. వేదవేదాంగ విద్యాప్రవీణునకు ఇట్టి కన్యక లభ్యమైనపుడు అతని బలముయెదుట ఈ శక్తి నిలువలేక వారు విడిపోవు మార్గము కలుగుట గాని మృతి చెందుటగాని కలుగును. ఇది చాలా అరుదయినవిషయము. దుష్టశక్తులు దివ్యశక్తిముందు నిలువజాలక యేదో యొక నెపముతో తప్పక చెదరిపోవును. రెండు జాతకములు సమబలములు కలిగియున్నపుడు భర్తవల్ల భార్యయు, భార్యవల్ల భర్తయు పరస్పరము వేధించబడుచుండురు. ఇది అమరణాంత విషయం కాగలదు. ఈ జాతకము చూడగోరెదము.

స్వస్తిశ్రీ భావ సంవత్సర శ్రావణశుద్ధ పంచమీలు బుధవారము ఉదయాది ౮-౩౩ ఘడియలకు కన్యకాజననం. ఇది నా మిత్రుని యొక్క కుమార్తె జాతకము. చిత్తా ప్రథమపాదము.

| | | | |
|---|---|---|---|
| | | | కు |
| శ(వ) | రాశి | | రబు శుకే |
| రా | కన్యజాతకం | | |
| | | | లగ చం |

కన్యాలగ్నము లగ్నభుక్తి ౨-౫౫ ఘడియలు. ఒకవేళ లగ్నము తప్పనటకు నా మిత్రుడు జ్యోతిషము కొంతవరకు తెలిసినవారుకూడను. ఆ సంశయమక్కరలేదు. 1934 - 8 - 15 జననం. కుజదశాభుక్తి. సం. 0-1-24 రోజులు. ఈ జాతకము కోర్టుద్వారా

కూడ భర్తతో విడాకులు పొందివున్నది. సప్తమలాభాధిపతులు లగ్నమందుండి గురుచంద్రయోగము కలిగి సప్తమాధిపతి సప్తమును చూచును, ఈ యోగము పట్టుట శాస్త్రపరముగ చాల ఆశ్చర్యకరమైన విషయమేను. ఈమె జాతకములో లేనియోగము యెట్లు పట్టునో తెలియుటలేదు. ఇంతకన్న దుర్యోగము భర్త జాతకమున యుండి ఈ యోగము పట్టియుండవచ్చును. "ప్రబలేన దుర్బలం బాధ్యతే" అను మాత్రమేదో పట్టియుండును. ఒకవిధముగా (1) అష్టమభావమైన తన నీచరాశిని చూచు శనిబలము (2) దశమమందలి కుజుని దుర్బలత్వ కారణలుగా కన్పడుచున్నవి. (3) శుభునిపైన పాపదృష్టి యుండరాదను నియమానుసారముగ అష్టమాధిప కుజదృష్టి సప్తమాధిప గురువుపైనుండుట, వియోగము, విడాకులకు దారితీసినదని తోచును. (4) సప్తమాధిపతి నీచరాశి దృష్టియు, అష్టమాధిపతి ఉచ్చదృష్టియు. సప్తమాధిపతిని చూచుటయు దాంపత్య విఘాత భావములు బుద్ధిభావమున పొడసూపినవి. ఈ జాతకమున విషకన్యా లక్షణములు లేకపోయినను, గ్రహదోషాదులచే యింత చిన్న వయసులో యిట్టి విడాకులయోగము కలిగించినది. వివాహకాలమున వధూవరుల జాతకములందు కుజదోషవిచారణయు, గ్రహపొంతనాది గుణవిచారణలు చేయుచు వాదప్రతివాదములు చేయుదురు. కుజదోషము పట్టకపోయిననూ ముప్పదిఅరు గుణములలో పదునెని మిదికి అధికముగా వచ్చినను, యిట్టి విషకన్యాజాతకములను చేసుకొనుదురా? అనునది ఆలోచించవలసిన ముఖ్యాంశము కాగలదు. ఇట్టి విషకన్యాదోషాది మహాదోషములుండగా వీటిని మరచి వకరి నొకరు వాదప్రతివాదములతో వంచించుకొనుటకు ప్రయత్నించు కొనుట వివేకలక్షణము కానేరదు.

# గురు - కుజ సమసప్తక నీచగ్రహ రాజయోగములోని వింత మార్పు

గురు-కుజుల సమసప్తక నీచస్థ రాజయోగాధారముగా 66వ పేజీనుండి 78వ పేజీలలో శ్రీ పాదవారు శ్రీ స్థానంవారు T. రామ కృష్ణశాస్త్రి శ్రీ V.B.రాజువంటిప్రముఖుల జాతకములు ఉదాహరణ ముగా యివ్వబడినవి. మరికొంత పరిశోధన చేయగా వక్రప్రధానమైన మార్పు కనుగొనబడినది. యీ యోగములోని గురు-కుజులతో మరో గ్రహము యేది కలసినా వింతయినమార్పు వస్తుంది. యోగమే మారి పోతుంది. ఇటీవల 1999 జూన్ నెల 18న చిత్తూరు పట్టణములోని శ్రీ పద్మశ్రీ అండ్ కో. ప్రముఖ విద్యా ప్రచురణసంస్థ అధిపతులు శ్రీ A.కామేశ్వరరావు. M.A., B.Ed. గారిని కలియడం జరిగినది. ఆ సమయంలో వారి జాతక పరిశీలన జరిగినది. వీరి జాతకములోని గురు-కుజ సమసప్తక నీచస్థ రాజయోగమును చూచి, వింతయిన ఈ మార్పునకు ఆశ్చర్యము కలిగినది. ఉదాహరణ-ప్లవనామ సంవత్సర అధిక జ్యేష్ట బహుళ త్రయోదశీ (చతుర్దశీ)లు కృత్తికా నక్షత్ర తృతీయ చరణయుక్త ధనుర్లగ్నము వీరి జననం. 1961-6-11 సా॥ గం. 7-44 ని.కు జననం జన్మకాల రవిదశాశేషం 0-10-16 రోజులు. కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా గుడిపాడు గ్రామం. గౌరిపెద్దివారి ప్లవ పంచాంగమునుండి పైవారి జాతకములలో గురు-కుజులకు యే యితర గ్రహసంబంధములేదు. మరి వీరి జాతకములో

| | | | |
|---|---|---|---|
| | శు | రచ | బు |
| కే | రాశి ధనుస్సు | | కు |
| గు శ (R) | | | రా |
| ల/ | | | |

గురువుకు శని సంబంధ మేర్పడినది. పైవారికి పుత్రసంతాన భాగ్యము లేదు. వీరికిపుత్ర పుత్రి సంతానసౌభాగ్యము లున్నవి. శ్రీ కామేశ్వరరావుగారు తమ తండ్రిగారు 1960లో స్థాపించిన విద్యా ప్రచురణా సంస్థను బహు ముఖంగా విస్తరింప చేశారు. చిత్తూరు

జిల్లాలో పేరుప్రతిష్ఠలుగాక, పరిసరజిల్లా ప్రాంతాలలోకూడ ప్రచురణ సంబంధాలున్నవి. 1. రిజిస్టర్డు ఎడ్యుకేషనలు పబ్లిషర్సుగా 2. ఆఫ్‌సెట్టు ప్రింటర్సు 3. ఫైన్ స్క్రీన్ లేజరు ప్రింటర్సుగా 4. బుక్ సప్లైర్సుగా 5. బుక్ బైండర్సుగా లబ్ధ ప్రతిష్ఠులు. పైవారి యోగప్రవర్తనా మార్పునకూ వీరి యోగమార్పునకూ యెంతో అంతరం సుస్పష్టము. దీనిననుసరించి గురు-కుజులతో శనిగాని మరే గ్రహముగానీ కలియడం జ్యోతిశ్శాస్త్రరీత్యా అనేక నూతన మార్పులకు కారణమవుతున్నది. నీచస్థ గురు-కుజులతో యే గ్రహము కలియరాదనేది ప్రధానసిద్ధాన్తము.

శ్రీ శేషాచలేశ్వర కరుణాకటాక్ష లబ్ధ కామకాయన విశ్వామిత్ర గోత్ర పవిత్ర ఆశ్వలాయనసూత్ర, శ్రీరామకవచ వంశపయః పారావార రాకా సుధాకర బ్రహ్మశ్రీ రామకృష్ణశాస్త్రి అన్నపూర్ణాంబల జ్యేష్ఠ పుత్రుడూ, జ్యోతిః కంఠీరవ దైవజ్ఞరత్న ఆదిత్య (పద్మ) మణి బిరుద సన్మానితుడూ, సంశోధిత, జ్యోతిష, వాస్తు గ్రంధ రచనాప్రవీణ శ్రీ వేంకటేశ్వర శర్మాభిధేయ ప్రణీతంబైన, "దైవజ్ఞ దృష్టిపథము" అను యీ గ్రంథమున ద్వితీయ ప్రకరణ సమాప్తం.

# అష్టగ్రహ కూటమి (1962)

ఈ అష్టగ్రహ కూటమనునది 1962-2-4వ తేదీకి సరియగు స్వస్తిశ్రీ ప్లవనామ సం॥ పుష్యబహుళ చతుర్దశీ రాత్రి సుమారు గం. 3-30 ని.లకు కలగును. దీనిని గురించి ప్రచారము బాగా జరుగుచున్నది. భారతయుద్ధ కాలమునాటికే యిట్టి గ్రహకూటము కలిగినట్లులేదు. ఆనాటి గ్రహసంపత్తి ఇట్లుండును. మకరరాశియందు

రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, కేతు గ్రహములు యెనిమిదియు, కర్కాటక రాశియందు ఒక్క రాహువు మాత్ర ముండును. ప్రథమమున ఆకాశమండలి గ్రహముల ఉనికిని కొంత తెలిపి తత్ఫలితముల తిరిగి వ్రాయుదును.

శ్లో॥ మందామరేడ్య భూపుత్ర సూర్య శుక్రేన్దుజేన్దవః
పరిభ్రమన్త్యధోఽధస్తాః క్రమశ శ్శీఘ్రగామినః॥

| | | | |
|---|---|---|---|
| | | | |
| | అష్టగ్రహ కూటమి మకరరాశి 1962 | | రా |
| ర చం కు బు గు శు శ కే | | | |
| | | | |

అను న్యాయమున (1) ఊర్ధ్వభాగమున ప్రప్రథమున శని స్థితియు, (2) శనికి దిగువను బృహస్పతియు (3) బృహస్పతికి దిగువ కుజుడు (4) కుజునకు దిగువ రవియు (5) సూర్యునకు దిగువ శుక్రుడు (6) శుక్రునకు దిగువ బుధుడు (7) బుధునకు దిగువ చంద్రుడు క్రమముగా యుందురు. ఇటీవల రష్యావారు ఫొటోలు తీయుటయు, కృత్రిమ గ్రహముల పంపినదియు ఈ చంద్ర గోళమునకె. ఇటువంటి గోళములు యింకా ఆరు జయించినగాని విశ్వవిజయము వీరి చేతులలోనికి రాదు. అప్పుడుగాని మానవు డధికుడా? భగవానుడధికుడా? అను ప్రశ్న కలుగదు. నిజముగా వీరు విజయులైనచో దైవాతీతశక్తి అనునది ఉండదు. ఇకముందు కాలము దగ్గరలోనే యున్నందున ఈ అష్టగ్రహ ఫలితముల పరిశీలించవచ్చును. గ్రహగోళములు అనునవి పైవిధముగా యున్నవి. అనగా మధ్యభాగమున రవి కక్ష్యకలిగి అధోపరిభాగముల శేషగ్రహ కక్ష్యలుండి, రవ్యాధారముగ సంచారగతిని పొందుచు, దైవనిర్ణయ మైన నిర్ణయగతిని పాలించుచున్నవి ఈ గతియే సర్వప్రాణులసృష్టి

స్థితిలయములకు మూలకారణము. ఇట్టి గ్రహసంచారములచే, లోకారిష్టములైన త్రిగ్రహకూటాది అష్టగ్రహ కూటములవరకు కలుగు చున్నవి. సామాన్యముగా చాతుర్గ్రహ పంచగ్రహ కూటాదులవరకు కలుగుచుండును. షడ్గ్రహకూటము చాలా అలస్యముగ కలుగు చుండును. ఇక సప్తగ్రహ, అష్టగ్రహ కూటములు వందలు వేల సంవత్సరముల తేడాతోగాని కలుగవు. ఇట్టి దుష్టగ్రహ కూటమిచే సకల జీవులకు, మానవప్రపంచమునకు, జీవనవిఘాతము, మృత్యుప్రదమైన దుష్ఫలితములు యుద్ధములు, ఉత్పాతములు కలిగి దేశ పీడనము కలుగునని శాస్త్రాదేశము. ఇక ద్వాపర యుగాంతమందు జరిగిన భారతయుద్ధ కాలమునాటి పుణ్యపురుషులు చూడని ఇట్టి దుష్టగ్రహ కూటమును కలికాలమందలి మనము చూడబోవుచున్నా మనగా మనమెంతటి పుణ్యమూర్తులమో మన అంతఃకరణమే మనకు సమాధానము కాగలదు. ఈ గ్రహకూటమి నాటికిగల నక్షత్రమున జన్మించినవారు ఈ మకరరాశి జననముగలవారు తమ ఆత్మరక్షణకు వేదచోదిత శాంతికర్మలు విధిగా చేసుకొనవలసియుండును. ఇంతియే గాక మరురోజున 1962-2-5వ తేదీన సూర్యబింబాధికమైన గ్రహణముకూడ కలుగుట దోషము. ఈ అష్టగ్రహకూటము. ఈ సూర్య గ్రహణము దేశోపద్రవ సూచకములు కాగలవు. ఈనాడు దేశదేశములలోని ఖగోళ విజ్ఞానశాస్త్రవేత్తలు. స్వదేశప్రభుత్వములు, వేద పురుషస్వరూపమైన సూర్యగోళపరిస్థితి ప్రభావాదులను యంత్ర సంబంధ ఫొటో వగైరాలవల్ల పరిశీలించి రికార్డులందు భద్రపరచి పరిశోధనలు చేయుదురు. మరియు అణుయుద్ధములు, కృత్రిమ గోళ గ్రహములకు సంబంధించిన తమ జయాపజయావకాశముల నిర్ణయించుకొనెదరు. అటంబాంబు, రాకెట్ ప్రయోగాదిక రహస్యము

లన్వేషింతురు, ఫలములు కోసుకొనుట కుపయోగించు ఆయుధము మనుష్య హత్యకుపయోగించిన ఎట్టి దుష్ఫల ప్రదమగుచున్నదో అదే విధముగ విజ్ఞానశాస్త్రవేత్తలు అణుపరిశోధనా పరిశోధితశక్తులను లోకకళ్యాణమైన మానవ శ్రేయస్సున కుపయోగించక. మానవవినాశన మునకు పూనుకున్నచో సామాన్యమానవులుగాక తత్ప్రయోగకర్తలు కూడ ఈ దుష్కార్యదుష్ఫల భాగస్వాములై నశించు ప్రమాదమిందు అంతర్గర్భితమైవున్నది. ఇట్టి గ్రహకూటముల గురించి శాంతికమలా కరాది శాస్త్రీయ గ్రంథములందు ఈవిధముగ వ్రాయబడి యున్నది.

శ్లో॥ అమావాశ్యాది తిథిషు గ్రహయోగో భవేద్యది
యేకర్షే భిన్నరాశౌవాప్యేకల శ్యక్ష భేదనే
శశి సూర్యసమాయుక్తే గ్రహత్రయ సమన్వితే
దుర్భిక్షాదిభయం చైవ చతుర్గ్రహ సమన్వితే
మహారోగభయం రాష్ట్రక్షయో వృష్టివినాశనం
పంచగ్రహ సమాయోగే దర్భిక్ష సంకరాదికం
నృపవైరం గర్భనాశో జాయతే జననాశనం
గ్రహషట్కసమాయోగే మంత్రిణాం మరణం భవేత్
పశ్వశ్వాది భయం సర్వం సంకరాది జనక్షయః
పట్టరాజ్ఞో వినాశోవా మహాభయ మథాపివా
సప్తగ్రహ సమాయోగే క్షితీశ మరణం ధృవం
జగత్ప్రళయయేవాపి తదా నిర్మానుషం జగత్
అత ఊర్ధ్వం (అష్టగ్రహ కాలమందు)
నానాదుఃఖ మనాకులం సూర్యస్తద్వ్యతిరిక్తచే
త్తదాయోగో మహాద్భుతం వినా చంద్రేణ యోగోపి

జగత్ప్రళయకారణం తదృక్షజాత జంతూనాం మహో
రోగో మహాభయం అర్ధనాశ స్థాననాశః మానహాని
న్నృపీడనం॥ అని కలదు.

ఋక్షమనగా, రాశీ-నక్షత్రము అని అర్థము గలదు.

వాత పిత్తాది సంభూత మహాపీడా మహాభయం
సమాయోగే గ్రహాణ్ణాం దోషాన్కుర్వంతి సర్వదా
షాణ్మాసాభ్యంతరేవాపి ఆయుర్హానీ శ్రియ స్తథా
జన్మాష్టమ ద్వాదశేరాశౌ చతుర్థే పంచమేపివా
పూర్వోక్తఫలమేవాత్ర తస్యాశ్శాంతిం ప్రయత్నతః
కుర్యాద్దోషానుసారేణ వితశాఠ్యం నకారయేత్.

అని శాస్త్రప్రమాణము. జన్మలగ్నాదిగాని, చంద్రలగ్నాది గాని, చతుర్థ పంచమ భావములందుగాని, జన్మనక్షత్రమునగాని ఇట్టి దుష్టగ్రహకూటములు కలిగిన జాతకులకు బహువిధ దుష్టఫలితములు కలుగును. ఈ గ్రహకూటములు విడిరోజులలో కలుగుదాని కన్నను, పౌర్ణమి అమావాస్యలయందు సంభవించినపుడే విశేషఫలప్రదములగును. రవి చంద్రులతో మూడవగ్రహము కలియుటచే త్రిగ్రహకూటము కలుగును. ఇట్లే తదితర కూటములు క్రమాధిక సంఖ్యతో అధికమగుచుండును. రవి చంద్రులు ప్రధానముగనుండు మిగతాగ్రహములు కలియవలయును. ఒకపుడు (పౌర్ణమి) చంద్రుడు కలియకపోయినను రవితో మిగతాగ్రహములు కలియువలయును. ఇట్టి రవిచంద్రులు కలియుటనునది బహుళ చతుర్దశీలు. అమావాస్యలు శుక్ల ప్రతిపత్తులందు మాత్రమే. ఈ కూటములు కలిగిన ఆరు మాసములలోగా అనేక దుష్టఫలితములు కలుగును. త్రిగ్రహకూటము

దుర్భిక్షమును. చాతుర్గ్రహకూటముచే మహారోగభయములు, పంచ గ్రహకూటముచే దుర్భిక్షము, సంకరజాతి ప్రజాపీడలు, పరస్పర రాజవైరములు, గర్భిణీస్రావదోషములు, జననష్టము కలుగదు. షడ్గ్రహకూటమిచే ప్రముఖ మంత్రిశ్రేష్ఠుని మరణము, పశ్వశ్వాది సర్వజంతు నష్టములు, రాజనష్టములు కలుగును. సప్తగ్రహకూటమిచే ప్రముఖ రాజులుగాని, ప్రముఖ రాజకీయ నాయకుడుగాని మరణించును. జగత్ప్రళయమువంటి ఉత్పాతాదికములచే జగమే నిర్మానుష్యముగ దోచును. ఇక అష్టగ్రహకూటమిచే మహోత్పాతములు, దుఃఖములు అధిక భయవ్యాకులములు కలిగించును. ఒక్క వాక్యములో చెప్పవలయునన్న ఈ కాలమున మనము ఆటంబాంబు ఫలితములు చూచెదమో, అణుయుద్ధ ఫలితములు చూచెదమో, ఈ రెండు ఫలితములు చూచెదమో, మరేవిధమైన నూతన ఫలితములు చూచెదమో నిరీక్షించవలసి యున్నది. 1962-2-4 అష్టగ్రహకూటము గురించి కొందరు దైవజ్ఞులు భిన్నాభిప్రాయములు కలవారు కలరు. కొందరు అన్నిగ్రహము ఒకేపాద ప్రవేశమగునపుడుతప్ప భిన్న పాదములందు దోషములేదని వాదించెదరు. నాకొకవిధముగా తోచుచున్నది ఇతర గ్రహములెట్లున్నను మూడు ప్రధానగ్రహములు చాలా వ్యథను పొందుచున్నవి ఎనిమిదిగ్రహము లేక రాశిగతములైనందున ఉచ్చ, స్వక్షేత్రము, మిత్రక్షేత్రము, శత్రుక్షేత్రము, నీచరాశి భేదములుగాక, అస్తంగతము, పరస్పర శత్రుత్వము, పరాజయము, వక్రత్వ, హీనావస్థఖలావస్థాది అనేక కారణములచే అనిర్వచనీయమైన దుష్టఫలప్రదాత లగుచున్నారు. భారతయుద్ధమందలి అభిమన్యుపై నురుకు కౌరవ సైన్యమువలె ఈ గ్రహములన్నియు కాలపురుష సప్తమాంగమైన జానూరాశియందు (మోకాళ్ళ)

చేరి వేధించుటచేత సకల దేశ ప్రభుత్వములు, ప్రజలు తమ మోకాళ్ళపై తాము నిలువజాలనిదుస్థితి కలుగునని తోచుచున్నది. ప్రజావసరమైన ధనము లోపించుటచేతను పంటలు ఫలించని ఆహారసమస్యలు, మహోత్పాతములు, దౌర్బల్యస్థితులు కలిగి అనేక విధములైన పీడలుగాని ఆకస్మికముగా కలుగవచ్చును. ఆత్మకారక రవికి దుష్ట వేధలచేత మానవులలో ఆత్మబలము తగ్గుటయు, ఆయుష్కారక శనికి దుష్టవేధలచే మానవులకు ఆయుర్భద్రతలు లోపించుటయు అకాల మరణములు, భయసంకులములు కలుగును "సదా కాల బలాధిపో గురుః" అనుటచేత కాలగతి ఆధీనతాధికారముగల బృహస్పతి నీచ రాశిగతుడై హీనావస్థ కలిగి దుష్టగ్రహవేధలు పొంది క్లేశత్వము కలిగియున్నందున కాలదౌర్బల్యము కలిగి అమంగళాధికములు కలిగి, వెనుకటి కురుక్షేత్ర సంగ్రామ దృశ్యముల కలిగించునని మనమున భ్రాంతి కలిగించుచున్నది. సకల మానవులు నశించిపోవు దురనునదిమాత్రము యదార్థముగాను మానవులకు అనేకములగు పీడనములు కలిగి వ్యథితులగుటమాత్రము నిశ్చయము.

## ముహూర్త విభాగము

పంచకరహితము – సుముహూర్తములు :-

(1) సుముహూర్త నిర్ణయసమయమున పంచకశుద్ధి అయినదీ లేనిదీ చూచుట ప్రథమకర్తవ్యమని అందరకు తెలిసిన విషయమే. ఈ పంచకశుద్ధిని మూడు విధములుగా చూచెదరు (1) పంచ విధానము (2) మార్తాండరహితము (3) ధృవకసహితము. పంచకము అనగా తిథి, వార, నక్షత్ర, లగ్న, ధృవకములనునవి ఐదు గదా? ఆచరణలో తిథి, వార, నక్షత్ర లగ్నములతోనే సరిపెట్టుచున్నారు. ఇందుకు ఈవిధముగా ప్రమాణము గలదు.

శ్లో॥ తిథి వారోడుభిర్యుక్తం, తత్కాలోదయ మిశ్రితం
గ్రహసంఖ్య హరేచ్ఛేషం, పంచశేష సుపంచకం.

ఈ శ్లోకములో అయిదవదైన ధృవకమును చేర్చమని లేదు. కారణము ఆలోచించగా ధృవకము ప్రతి సుముహూర్తమునకు కలుపరాదని ప్రమాణము గలదు.

శ్లో॥ గమనే, కృషి, వాణిజ్యే. తటాకే, ధన నిక్షిపే
శివలింగ ప్రతిష్ఠాయాం రహితం ధృవకాన్వితం.

ఈ శ్లోకమువల్ల ప్రయాణ సుముహూర్తము, వ్యవసాయ సుముహూర్తము, వ్యాపారసుముహూర్తము, తటాకనిర్మాణ (చెరువు) సుముహూర్తము. ధనస్థాపన సుముహూర్తములందుమాత్రమే ధృవక సహితము చేయుమని కలదు. కనుక ధృవకములను యిష్టమువచ్చిన విధముగా ఉపయోగించవద్దని తెలియుచున్నది. రెండవ పక్షమునను ధృవకమును కలిపియు పంచరహితము చేయుమని యిట్లు ప్రమాణము గలదు.

శ్లో॥ తిథి, వారంచ, నక్షత్రం, లగ్నం, ధృవక మిశ్రితం
గ్రహసంఖ్యా హరేచ్ఛేషం పంచశేషసు పంచకం.

ఈ ద్వివిధపద్ధతుల శ్లోకములున్నందునను తిరిగి సందేహము కలిగించును. ధృవకము కలుపకుండట మొదటిపక్షము, కలుపుట రెండవపక్షము కాగలదు.

(2) ఇక మార్తాండరహిత విషయమున వెనుకటిరోజు తిథియు, లగ్నము ఈ రెండింటితోనే పూర్తియగుచున్నది.

## పంచకరహితము అక్కరలేదు

(3) శ్లో॥ కేంద్ర కోణాః శుభాక్రాన్తా శుభగ్రహ నిరీక్షితం
వినా పంచకరాహిత్యం లగ్నం కుర్యాద్విచక్షణః.

కేంద్ర కోణములందు ప్రబల శుభులుండగా పంచకరహిత మనునది యే పద్ధతిన రహితము కాకపోయినపుడుకూడ చేయుమని తెలుపుచున్నది. ఇది యెంతయో బలీయమైన గ్రహయోగములుగల సుముహూర్తము వుండినప్పటి విషయము మాత్రమేనని తెలియవలయును. ముహూర్తాభావ పరిస్థితులలో ఇట్టి ముహూర్తమున్నపుడు దోషముకాదని తెలియుచున్నది.

## రోహిణీయుక్త చంద్రబలం

శ్లో॥ కరణ భగణదోషం వారయోగాది దోషం
విషమ దివసదోషం శూలగండాది దోషం
కుజ రవి శనిదోషం త్యాజ్యపాతాది దోషం
సర్వం హరతి దోషాన్ రోహిణీయుక్త చంద్రః.

ఇరువదియేడు నక్షత్రములు చంద్రుని భార్యలైనందునను అందులో విశేషించి రోహిణియందు చంద్రునకు అధిక ప్రేమాసక్తి కలదు. మాతృకారక చంద్రుడు రోహిణియందున్నాడనగా వృషభ రాశియందు తన ఉచ్చరాశిస్థితిని పొంది తారాబలము పూర్ణబలమగుటయేకాగలదు. ఇట్టి చంద్రుడు అగ్ని దగ్ధమగుచున్నదానిని వరుణదేవుడు (వర్షరూపం) చల్లార్చినట్లుగ సుముహూర్తమందలి సర్వదుర్దోషములను తన అమృతకిరణ ప్రభావముచే తొలగచేయుచు సంరక్షకుడగుచున్నాడు.

# ఏకవింశతి మహాదోష పరిహారములు

## రవి గురు శుక్ర బలము (మంగళ కార్యములు)

శ్లో॥ కుచాష్టమే షష్ఠగతే భృగౌవా, షష్టాష్టమ ద్వాదశగేచ చంద్రే
తద్దోష నాశం రవిరాయ(౧౧)సంస్థోలగ్నే యదా కేంద్రగతే సురేజ్యే

రవి యేకాదశమందు పూర్ణబలీయుడుగను, గురువు కేంద్రము లందు పూర్ణబలీయుడుగ నుండగ కుజాష్టమ (8) దోషము, భృగు షట్క (6) దోషము 6-8-12 స్థానములందలి చంద్రదోషములు తొలగునని తెలియుచున్నది. అనగా యేకవింశతి మహాదోషాంతర్గత మైన ఈ మూడు దోషములు పీడాకరములుగావని అర్థము. ఇక మిగతా దోషములగురించి విచారించనక్కరలేదనియే తేలుచున్నది. "కేంద్ర స్థానంతు వైష్ణవం" అనుటచే కేంద్రములందున్న శుభులచే విష్ణుబలము వృద్ధియగును తద్వారా సర్వదుర్దోషములు హరించును. కేంద్రములందున్న పాపులవల్ల అమంగళములు, శుభులవల్ల శుభ పరంపరయు మానవులకు కలుగును. (ముహూర్త దర్పణం—దోష ప్రకరణం)

# వధూవరుల ప్రాప్తిస్థానములు

శ్లో॥ ప్రష్టు రారూఢ రాశీశ దిశస్థాం కన్యకాం వదేత్
లగ్న స్యాధిపతిర్యత్ర తత్ర జామాతరం వదేత్.

ప్రశ్నకాల అరూఢలగ్నాధిపతివున్న, రాశిననుసరించి కన్య కాలబ్ధిని చెప్పవలయును. లగ్నాధిపతి యే రాశియందుండునో, ఆ రాశికి చెప్పబడినదిక్కున వరుడు లభించును. జాతకభాగమున రాశి

లగ్నమునను సరించి ఆరూఢము యెట్లు వేసుకొనుచున్నారో అటులనే ప్రశ్నకాల లగ్నమునకుకూడ ఆరూఢలగ్నము వేసి పూర్వోక్త ఫల నిర్ణయము చేయవలయును.

## గురు - శుక్ర లగ్నస్థ సంహార్త దోషము

శ్లో॥ అపిశుక్రేజ్య సంయుక్తౌ। విషసంయుక్త దుగ్ధవత్
గ్రహణోత్పాతభం త్యాజ్యం మంగళేషు త్రిధాZశుభం
(నారద సంహిత-యేకోనత్రిం శతమోZధ్యాయః)
(అన్యత్ర) గురుశుక్రౌ యదాలగ్నే। పరస్పర నిరీక్షితే
సప్తమస్థే తదాదోషో మూఢత్వా దతిరిచ్యతే

## పౌర్ణమా తిథి (౧౫) ప్రాధాన్యత

శ్లో॥ యజ్ఞక్రియా పౌష్టిక మంగళాని
సంగ్రామ యోగ్యాZఖిల వాస్తుకర్మ
ఉద్వాహ శిల్పాఖిల భూషణాద్యం
కార్యం ప్రతిష్ఠాఖిలు పౌర్ణమాస్యాం

పౌర్ణమీ తిథి పై శుభకార్యములన్నిటికీ మంగళకరమేను. ఆషాఢ, భాద్రపద, పుష్యమాస పౌర్ణమిలు మాత్రం నిషేధముగా వుంటవి. (ముహూర్తచింతామణి-తిధికృత్యాని-శుభాZశుభప్రకరణం-వ్యాఖ్యాయాం)

## అధిమాస దోషములేదు

శ్లో॥ గర్భేవార్ధుషికే భృత్యే శ్రాద్ధకర్మణి మాశికే
సపిండీకరణే నిత్యే నాధిమాసం వివర్జయేత్

స్త్రీల గర్భమాస విషయాలతోనూ, ఋణం తీసుకొనే విషయం సపిండీకరణ, శ్రార్ధకర్మలు, వేతనవిషయాలు నిత్యశ్రార్థములలోను అధికమాసమయినా ఆచరించవచ్చును. సందేహంలేదు. (ముహూర్త దర్పణం)

## ప్రయాణ దిక్శూలలు

శ్లో॥ అగ్నేయ్యాం గురౌ చంద్రే। నైఋత్యాం రవి శుక్రయోః
ఈశాన్యాం చంద్రజో। వాయౌమంగళే గమనంత్యజేత్

గురు సోమవారములు ఆగ్నేయమూలకు, శుక్ర, ఆదివారములు నైఋతిదిశకు బుధవారం ఈశాన్యమూలకు, మంగళవారం వాయవ్య మూలకు ప్రయాణించరాదు.

## పురశ్శుక్ర (చుక్కయెదురు) దోషము

శుక్రుడు తూర్పుదిక్కున వున్నపుడు, నూతన వధువు, గర్భిణీ స్త్రీలు పసిపిల్లతల్లులు, పడమర దిశనుండి వాయవ్య, ఉత్తర, ఈశాన్య, తూర్పుదిక్కులకు పోరాదు. పడమరదిశలో శుక్రుడు వున్నపుడు అగ్నేయ, దక్షిణ నైఋతి పశ్చిమ దిక్కులకు పోరాదు. వకే గ్రామంలో వున్నవారికి వెళ్ళుటకు దోషములేదు. దుర్భిక్షము, రాజవిద్వరములు, వివాహసమయం, తీర్థయాత్ర విషయాలలో యీ పురశ్శుక్ర (చుక్కెదురు) దోషంలేదు. భారద్వాజ భృగు, అత్రి కాశ్యప, వశిష్ఠ గోత్రములవారికి యీ చుక్కెదురు దోషములేదు. నిస్సంశయముగా ప్రయాణం చేయవచ్చును.

## వైధవ్య విధవాముఖ సందర్శన నిషేధము

శ్లో॥ మూఢేసూర్య వివర్జితే యదిమలేమాసే దినే। ఋక్షాః పైత్ర్య భయాన్య ఇందు అనలాసార్వాణి యోయాభగాః। రాదేశ్రీ శోడుష బ్రహ్మధిష్ణ్య సహితే నారీముఖావీక్షణే। నష్టైభర్త రివర్భయే ద్యదిభవేత్ జ్ఞాతిశ్చ బంధుస్తథా। వారేభానుజ భానుభృగుజావారా మహాదుఃఖ ప్రిధాః। దాశం ద్వితి్రి, పదేషు ఋక్ష పరిషూ గండాది గండాభవేత్।

మూఢములోనూ. అధికమాసము. మఖా భరణీ మృగశిర కృత్తికా, ఆశ్రేషా, పూర్వాషాడా, పుబ్బా. ఆరుద్ర, రోహిణీ నక్షత్రములలోనూ, ఆది మంగళ, శుక్ర, శనివారములలోనూ, ద్విపాది (మృగశిర చిత్తా) కృత్తిక, పునర్వసు. ఉత్తర, ఫల్గుని, విశాఖా, ఉత్తరాషాడాది త్రిపాద నక్షత్రములలోనూ. వైధవ్యము పొందిన స్త్రీని దాయాదులు, బంధువులు చూడరాదు.

## గ్రామార్వాణము

గ్రామ నక్షత్రమునుండి యజమాని నక్షత్రమువరకు లెక్కించగా వచ్చినసంఖ్య 5 ధనలాభం, 3 ధననష్టము, 5 ధనిధాన్యాభి వృద్ధి 6 దరిద్రం, 1 ప్రాణహాని, 4 సంపద, 2 ధనవ్యయం, 1 ధనలాభం

## మహాభారత ప్రమాణమ్ - గ్రహాలపై
## (మహేశ్వర ఉవాచ)

శ్లో॥ నక్షత్రాణి గ్రహాశ్చైవ। శుభాzశుభ నివేదకాః
మానవానాం మహాభాగే। నతుకర్మక దాస్స్వయం

శ్లో॥ ప్రజానాంతు హితార్థాయ। శుభాశుభ విధింప్రతి
అనాగతం అతిక్రాన్తం। జ్యోతిశ్చక్రేణ బోధ్యతే
(సంస్కృత భారతం — అనుశాసనం) (అన్యత్ర)

శ్లో॥ జ్యోతిశ్శాస్త్ర మిదం పుణ్యం। పఠనీయం సదా నరైః
జ్ఞాత్వా శృత్వా తతశ్శాంతిం। మోదతే మోక్ష చింతనాత్

శ్లో॥ యేతచ్ఛా స్త్రం యః జ్ఞాత్వా। యోనిందతి జ్యోతిషం
సరౌరవం నరకం గత్వా। పరజన్మని భవత్యంధః

## గృహవాస్తు విభాగము

1) విరుద్ధ వాస్తు ప్రచారాలు :- ఈశాన్య సింహద్వారాలు

అయిశ్వర్యప్రతుడూ, త్రిలోకాధిపతీ, తూర్పుదిశను వుండే ఇంద్రుని అనుగ్రహముతోను, ఉత్తరదిశనుండు అష్టఅయిశ్వర నిధులుండే కుబేరానుగ్రహముల మధ్యలో ఈశాన్య సింహద్వారము పెడితే గృహయజమాని ముంగిట అష్టఅయిశ్వర్యములు వచ్చిపడుత వన్నటువంటి భ్రమతో కొందరు అధునిక వాస్తుపండితులు. ఈశాన్య సింహద్వార ప్రచారము ప్రారంభించినట్లు ఊహామాత్రంగా తెలుస్తున్నది. వీరి విధానములకు తోడుగా సాహిత్య సంస్కారములులేని వీరి భజనపరులయిన బేలుదారులుకూడ మహాప్రచారం చేస్తున్నారు. దీనివల్ల వాస్తు విధ్వంసము అపారధననష్టము. అకాల మరణాలూ వస్తున్నవి. ఉదాహరణకు :-

తూర్పు సింహద్వార ముండవలసిన గృహమునకు, ఈశాన్య ద్వారములు నేరుగా పెట్టుటవల్ల, గృహములోని యజమానికి లోపల

కూడా దేవతామందిరం (దేవుడిల్లు) లేకుండానే పోతున్నవి. అనుభవాన్ని తీసుకొంటే కొన్ని అనుభవాలు అక్కడక్కడ కన్పిస్తున్నవి. 1995 సెప్టెంబరు అక్టోబరు నెలల్లో "వాస్తుదర్శిని" పత్రికల్లో ఈశాన్య ద్వారంపైన కొన్ని విమర్శలు వచ్చినవి. చూడవచ్చును. జపాను దేశీయులు వచ్చినా ఈశాన్యం ఓపెన్ (తెరువరు) చెయ్యరు. ఈశాన్యమార్గం కల్పించరు కిటికీకూడ అక్కడ పెట్టరు. ఈశాన్యం మూసివేసే జపానీయులు చెడిపోవడంలేదు. ఈనాడు యెంతో పురోగతిలో వుంటున్నారు. భారతదేశంలోకూడ ఈశాన్య నడకద్వారం లేకుండానే ప్రాచీన కాలంనుండి నడుస్తున్నది. యిప్పటికీ యిలా చాలా గృహాలున్నవి, వారెవరూ చెడిపోవడంలేదు. యెక్కడయినా ఈశాన్యద్వారాలు వెలుస్తున్నవనగా, కొత్తవాస్తు రచయితలూ బేలుదారుల ప్రభావమేను—

2) అనుభవము—

కొందరు కొత్తకొత్త వాస్తు పండితుల సలహాప్రకారం, శాసన సభా భవనానికి రావడానికి పోవడానికి ఈశాన్య ద్వారవిధానం శుభమని మాజీ ముఖ్యమంత్రి మహానటులు శ్రీ N. T. రామారావుకు సలహా యిచ్చారు. అది ప్రారంభించారు. దీని ప్రభావములు తెలుగుదేశంపార్టీ చీలికలు, కుటుంబ చికాకులు వచ్చి ఆ మహానటులు 1996-1-18న అకాలమరణం పొందారు. యిలా యెన్నెన్నిరకాల నష్టాలు యెక్కడెక్కడ పొందుతున్నారో తెలియదు. అందరకూ వకే నష్టాలుండకపోవచ్చును. మరోవిధంగానూ వుండవచ్చును.

## 3) రచనావిరుద్ధతను గుర్తించలేని కొత్తవాస్తు పండితులు వారి గ్రంధాలు :-

1) కృష్ణాజిల్లా విజయవాడ ముద్రగడ రామరాయ వాస్తు గ్రంథమున ద్వి।ముద్రణ। ఉపోద్ఘాతము—సలహాలు, ప్రతి గది ఈశాన్యములోనూ ప్రతిస్థలములోని ఈశాన్యదిశలోనూ, గృహస్థు పొరబాటుగానైనా చేతికర్రనుకూడ నిచేరవేయరాద వ్రాసుకుంటూ, ఈశాన్య ద్వారాలు శ్రేయస్కరమని వ్రాయడం పరస్పర విరుద్ధము కదా?

2) కడపజిల్లా ప్రొద్దుటూరు "వాస్తు శాస్త్రవాస్తవాలు" (3వ ముద్రణ) గంధమున, ప్రతిగదిలో ఈశాన్య మూలకుఛేర్చి, పొరకలు దోమతెరకట్టెలు యితర సామానులుకూడ వద్దు అంటూనే, ఈశాన్య ద్వారాలు శుభప్రదమని వ్రాయడం, పరస్పర విరుద్ధాలుగా యికనైనా అందరూ గుర్తించండి. పూలమొక్కలుకూడ ఈశాన్యములో పెట్ట రాదట. ఈ గ్రంధకర్తలు యేమి వ్రాస్తున్నారో వారికే తెలియదు. సమీక్షాదృష్టి లేదన్నమాటేకదా! కొత్త వాస్తుకర్తలు తమదే యదార్థ వాస్తువనడం యెలా వున్నదనగా, వాసుదేవుడు (కృష్ణపరమాత్మ) దేవుడుకాదు. నేనే సర్వదేవతామూర్తిని ఆరాధ్యుడను అని విర్రవీగిన పౌండ్రక వాసుదేవునికథ మాదిరిగా వున్నది.

ఈశాన్యద్వారం గేట్లవల్ల శివుని నెత్తిన నడవడం, పాదధూళి, పడడం, పేడనీళ్ళు చల్లడం, వాహనాల రాకపోకడలు, యెద్దులబండ్లు స్కూటరులు, ట్రాక్టరులు, గృహంలోని బరువుభారాల వస్తువులు, ముట్టుఅంటు జనులు రావడంవంటివాటితో అపవిత్రమే అవుతుంది

గాని గృహము లక్ష్మీకరముగా వుండదు. ఈశాన్య సింహద్వారాలూ ఈశాన్య గేట్లూ పెట్టి చెడిపోకండి. ప్రజలకు తెలియచేయండి. జాగ్రత్త పడండి.

శ్లో॥ దేహకర్తా ప్రశాంతాత్మా। విశ్వాత్మా విశ్వతోముఖః
(భారతం—అరణ్య పర్వం)

స్వర్గద్వారం ప్రజాద్వారం। మోక్షద్వారం త్రివిష్టపం
(ఆదిత్య స్తవం)

సృష్టిస్థితిలయకారకుడు, ఆయురారోగ్య ఆహారప్రదాత, జగన్నేత్రుడు గ్రహరాజయిన శ్రీ సూర్యనారాయణమూర్తిని మనసారా స్మరించి ఈ గ్రంథమును శ్రీ సూర్యగ్రహ చరణారవింద సమర్పణ చేస్తున్నాను.

శ్రీ శేషాచలేశ్వర కరుణాకటాక్ష లబ్ధకామకాయన విశ్వామిత్ర గోత్ర పవిత్ర అశ్వలాయనసూత్ర, శ్రీరామకవచ వంశపయః పారావార రాకా సుధాకర బ్రహ్మశ్రీ రామకృష్ణశాస్త్రి. అన్నపూర్ణాంబల జ్యేష్ఠ పుత్రుడూ, జ్యోతిః కంఠీరవ, దైవజ్ఞరత్న, ఆదిత్య (పద్మ) మణి బిరుద సన్మానితుడూ, సంశోధిత, జ్యోతిష, వాస్తు గ్రంథ రచనాప్రవీణ శ్రీ వేంకటేశ్వర శర్మాభిధేయ ప్రణీతంబైన, "దైవజ్ఞ దృష్టిపథము" అను యీ గ్రంథమున తృతీయ ప్రకరణం సమాప్తం.

స్వస్త్యస్తు.



## సూర్యాది గ్రహాలలో అంతర్గత శరీర లక్షణములు

రవివల్ల . యెముకలకు సంబంధించిన లక్షణములు, వ్యాధులు పరిశీలించి తెలుసుకోవాలి. పిత్తప్రవృత్తి కలవాడు.

చంద్రునివల్ల : రక్తలక్షణము, రక్తదోషములు, పరిశీలించాలి. కఫవాత ప్రవృత్తిగలవాడు

కుజునివల్ల : యెముకలలోని నేయివంటి పదార్థము (మజ్జ) గురించి, వీటి లోపాల గురించి తెలుసుకోవాలి. పిత్తప్రవృత్తి గలవాడు

బుధునివల్ల : చర్మ లక్షణములు, చర్మవ్యాధిలక్షణములు చర్మ సౌందర్యలక్షణములు గలవాడు. వాతపిత్తకఫము లకూ సంబంధమున్నది.

గురువువల్ల : మాంసములోని కొవ్వు (వస) వగైరా ఆరోగ్య లక్షణాలు తెలియవచ్చును. కఫప్రవృత్తి గలవాడు.

శుక్రునివల్ల : వీర్యపుష్టి, సౌందర్యము వగైరాలు తెలుసుకో వచ్చును. కఫవాత ప్రవృత్తిగలవాడు. వంకర వంకరలున్న కేశములుండువాడు.

శనివల్ల . స్నాయువు (నరముల)కు సంబంధించిన వ్యాధులు, ఆపరేషనులు, శరీరపుష్టి వగైరాలు విచారించ వలెను. వాతప్రవృత్తి గలవాడు. పెద్ద దంతములు కఠినమైన దేహరోమము లుంటవి. (రాహు-కేతువు లకు చెప్పబడలేదు).

# తప్పు - ఒప్పుల పట్టిక

| | తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి |
|---|---|---|---|---|
| 1 | స్కన్దతయా | స్కన్దత్రయా | 3 | 11 |
| 2 | చక్షునని | చక్షువని | 3 | 12 |
| 3 | ఫేదనేత | వేదనేత్ర | 4 | 6 |
| 4 | సంప్కృతి | సంస్కృతి | 5 | 2 |
| 5 | రాహు గహా | రాహుగ్రహా | 5 | 13 |
| 6 | మంత్రవాదా | మంత్రవాదా | 6 | 10 |
| 7 | పగడ | ప్రగడ | 7 | 7 |
| 8 | చందాదులనే | చంద్రాదులనే | 8 | 17 |
| 9 | మవిదితము | సువిదితము | 8 | 19 |
| 10 | ట్టుచు | బుట్టుచు | 14 | 13 |
| 11 | ర్వామాంగ్యంచ | ర్వామ్యాంగంచ | 19 | 16 |
| 12 | తులారాశిలో | కుజరాహులు | 23 | చక్రము |
| 13 | పాతధారిగ | పాత్రధారిగ | 24 | 5 |
| 14 | సపమ | సప్తమ | 25 | 13 |
| 15 | రెంటిని 3-0 | రెంటిని 3-10 | 26 | 1 |
| 16 | కజుని | కుజుని | 26 | 14 |
| 17 | పె శోకములు | పై శ్లోకములు | 28 | 20 |
| 18 | గహా | గ్రహా | 49 | 11 |
| 19 | వర్గోత్తమారశ | వర్గోత్తమాంశ | 49 | 21 |

| | | | | |
|---|---|---|---|---|
| 20 | రాది | రౌద్రి | 51 | 2 |
| 21 | నక్షత | నక్షత్ర | 51 | 4 |
| 22 | చంద | చంద్ర | 51 | 17 |
| 23 | 1971 | 1959 | 54 | 3 |
| 24 | గ్రహయలు | గ్రహములు | 55 | 8 |
| 25 | నీచనింద్ర | నీచనిండ్ర | 55 | 17 |
| 26 | దుమ్యోగ | దుర్యోగ | 56 | 9 |
| 27 | ఫలవరిత | ఫలవంత | 56 | 15 |
| 28 | అదిపత్యవాపిగా | అధిపత్యపాపిగా | 57 | 11 |
| 29 | ష్టములు | కష్టములు | 60 | 17 |
| 30 | మైన | మైనది | 64 | 22 |
| 31 | D.No. 2-10 | D.No. 3-10 | 65 | 13 |
| 32 | మంచమ | పంచమ | 74 | 14 |
| 33 | అనిరుద్ధం | అవిరుద్ధం | 78 | 13 |
| 34 | గహ | గ్రహ | 78 | 18 |
| 35 | ర్గ్రహత్వ | ర్గ్రహత్వ | 81 | 20 |
| 36 | ఇద్దరు పుత్రికా సంతానం | నలుగురు పుత్రికా సంతానం | 78 | 17 |
| 37 | చంద్రునచ్చె | చంద్రునకిచ్చె | 82 | 18 |
| 38 | బుదాదిత్య | బుధాదిత్య | 88 | 19 |
| 39 | మహాద్యోగములు | మహద్యోగములు | 88 | 13 |
| 40 | అ్మత | ఆత్మ | 88 | 22 |

| | | | | |
|---|---|---|---|---|
| 41 | నుశ | కను | 88 | 22 |
| 42 | జాతకంలో మీనచంద్రుడు | జాతకంలో మేషచంద్రుడు | 90 | 15 |
| 43 | చంద్రునకు కోణమందు | చంద్రునకు కేంద్రమందు | 90 | 18 |
| 44 | చంద్రగురువుల పరివర్తనా యోగముగాదు | చంద్ర గురువుల కేంద్రయోగముగాదు | 90 | 22 |
| 45 | బుద్ధి స్థానాధిపతి చంద్రునీ | బుద్ధి స్థానమునందుండి | 90 | 23 |
| 46 | సపమునగానీ | సప్తమమునగానీ | 105 | 2 |
| 47 | ముగురు | ముగ్గురు | 106 | 14 |
| 48 | క్రూరోష్వాయుషి | క్రూరేష్వాయుషి | 108 | 1 |
| 49 | లగ్న - వాహినబావ | లగ్నవాహనభావ | 108 | 18 |
| 50 | కేంది త్రికోణాధిప | కేంద్ర త్రికోణాధిప | 116 | 7 |
| 51 | యిషము | యిష్టము | 129 | 11 |
| 52 | కుచాష్టమ | కుజాష్టమ | 131 | 1 |
| 53 | ప్రభువమేను | ప్రభావమేను | 136 | 12 |
| 54 | నిచేరవేయరాద | చేరవేయరాదని | 137 | 6 |

## ముద్రిత గ్రంథములు

1. రాహు - కేతువులు
2. దైవజ్ఞ దృష్టిపథము
3. అష్టగ్రహకూట కాలసర్పయోగములు (1962-2-4)
4. ఆడవారి అదృష్టాలు
5. కుజగ్రహము - కుజదోష చర్చలు
6. సమీక్షా వాస్తుమయూఖం
7. ఆర్షేయవాస్తు విద్యారహస్యం

## రానున్న గ్రంథములు

1. రామనాడి (పద్యరూపక జ్యోతిషం)
2. కుజదోష పరిహారక శాంతివిధానమ్
3. సమీక్షా కాలామృతమ్


గ్రంథప్రాప్తిస్థానం - శ్రీ లక్ష్మీభవానీ

**శ్రీరామకవచం వెంకటేశ్వర శర్మ**

ఆథర్ & పబ్లిషరు

D. No. 3-353 విజయలక్ష్మీపురం, 4 క్రాసు, (మాయాబజారు)

**BAPATLA - 522 101** గుంటూరు జిల్లా



**EDISSON - 11 Copies 800 మాత్రం - 1999**

**R K ప్రింటర్స్, జి. బి. సి. రోడ్, బాపట్ల ఫోన్ : 23466**